# గీతాసుధాలహరి

(శ్రీమద్భగవద్గీతకు ఆంధ్ర పద్యానుకృతి)

Acc. No. 9524

"ఉపనిషత్తు లన్నియును ధేనూత్తమములు
పాలు పిదికెడు వాడు గోపాలసూతి
అర్జునుఁడు దూడ మహితగీతామృతంబె
పాలు, మీరె భోక్తలు సుధీశాలులార!"

అనువక్త:

అగస్త్యరెడ్డి వెంకురెడ్డి, ఎం. ఏ., ఎల్ఎల్. బి.,

వరకవిపూడి — నెల్లూరు జిల్లా.

ప్రథమ ముద్రణ — 1000 ప్రతులు
జూన్ 1980

Acc. No. 9524

కార్తికేయ ప్రచురణలు — 1

మూల్యము : రూ **20** లు.

సర్వస్వామ్యములు రచయితవి

ప్రతులకు :

1 ఏ. వెంకురెడ్డి,
16/1252 గాంధినగర్,
నెల్లూరు—524 001

2 ఏ. రామచంద్రారెడ్డి,
ఈదూరు
నెల్లూరు తాలూకా.

ముద్రణ :
విక్టరి ప్రెస్
ప్రకాశ్ నగర్
నెల్లూరు — 2

# కృతజ్ఞత

తిరుమల – తిరుపతి దేవస్థానమువారు హిందూధర్మప్రచార పోషకంగా చేస్తున్న ఆర్థిక సహాయ పథకముక్రింద ఒసంగిన భూరివిరాళము ఈ గ్రంథ ముద్రణకు తోడ్పడినది. దేవస్థాన పాలకవర్గమునకు, కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్. ఐ. ఏ. యస్., గారికి

నా కృతజ్ఞతాంజలులు.

ఓమ్

# శ్రీ వేంకటేశాయ నమః

"శ్రియఃకాన్తాయ కళ్యాణనిధయే నిధయేఽర్థినామ్ ।
శ్రీ వేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥

జనయిత్రీ! అలమేలుమంగ! వరివశ్యాచాతురీప్రీతస
ప్తనగాధ్యక్ష శుభాంతరంగ! నిజభక్తత్రాణనిస్సీమశో
భనలీలాపరమార్థసంగ! అనుకంప న్నింపి నా జీవితం
బును ధన్యంబొనరింప, నీయడుగుఁదమ్ముల్ గొల్తునశ్రాంతమున్

మస్తకమ్మున దివ్యమణిమయమకుటంబు
కోటి సూర్యుల కాంతిఁగ్రుమ్మరింప,

ఫాలభాగమ్మున పరమపవిత్రమౌ
కలితోర్ధ్వపుండ్రమ్ము వెలుఁగులీన,

వక్షస్థలమ్మున పద్మావతీదేవి
శ్రీమహాలక్ష్మియై చెలువుఁజిల్క,

పాదపద్మమ్ముల పాపవినాశని
విరజాతరంగిణి పరిఢవిల్ల

ఆపదుద్ధారకుండవై అవతరించి
భక్తజనులకు ముంగొంగు పసిడివైన
తిరుమలావాస! ప్రోవుమా కరుణమీర
సంకటమ్ముల హరియించి వేంకటేశ!

**Prof. Sri K. Satchidananda Murthi Garu.**
( Ex-Vice-Chancellor, S. V. University, Tirupati )
**Dept. of Philosophy, Andhra University,**
**WALTAIR.**

## FOREWORD

The **Bhagavad Gita** has been translated many times into all Indian languages. Yet a new translator can, according to his own Adhikara and Prathibha, find new meanings, not hitherto well expressed in available translations. Its profundity and richness of content is such that any number of translations cannot exhaust what all it contains.

So it is quite all right that Shri Venku Reddy has tried to give a new translation, which I have glanced through with pleasure. I find that lucidity and faithfulness to the original are its characteristics. I congratulate him and hope that it will make a number of Telugu-Knowing people aware of the spiritual beauty of this great classic.

*(Sd.) K. S. Murthy.*

సుప్రసిద్ధ పరిశోధకులు, విమర్శకులు,

కళాప్రపూర్ణ:

డా. మరుపూరు కోదండరామరెడ్డిగారు

# ఒక మదింపు

## గీత – పాశ్చాత్యులు

భగవద్గీతా సుధాలహరి - అగ్రవర్ణ సాంప్రదాయికవాదులు అంధవిశ్వాసంతో అడ్డగించి సొంతంచేసుకొని, సామాన్యప్రజలు ఆ విజ్ఞానవాహినిలో మూతి బెట్టనీకుండా నిరోధించి అణచివేయగా, అది అంతర్వాహిని అయినది. మరల ఇప్పుడిప్పుడే - ఇంతకాలానికి, అది పైకుబికి జీవలహరై, విశ్వమానవ ధార్మికతత్త్వ పిపాసలు దీరుస్తున్నది. భగవంతునిగీత మానవునిగీత అయినది. ఇదంతా ఇంగ్లీషు పలుకుబడి చలవే అనాల.

ఛార్లెస్‌విల్‌కిన్సు (1783) - సంస్కృతానికి చేయూతనిచ్చి పైకిలాగిన ప్రథమ పాశ్చాత్యుడు, గీతను ఇంగ్లీషులోనికి అనువదించి, గద్దకట్టిన సామ్రాజ్యవాది - మొదటి బ్రిటిషు గవర్నర్‌జనరల్ - వారన్‌హేస్టింగ్సును మెప్పించి, ఆ ప్రభువుచేత దానికి పీఠిక వ్రాయింప జేసినాడు. ఈ సంఘటన బైబిలును విక్లిఫ్ ఇంగ్లీషులోనికి, లూథర్ జర్మనులోనికి మార్చిన విజ్ఞాన పురోగమన పదక్షేపం వంటిది. సంస్కృతానికి పునర్జీవన మబ్బజేసిన మ్యాక్సుమూలర్ తెలంగ్ (ఆంధ్రుడు) చేత మరల గీతను ఇంగ్లీషులోనికి మార్పించినాడు. ఇట్లా వీరు ప్రాచ్య విజ్ఞాన దీపికను వెలిగించి, తూర్పు పడమరల సంస్కృతికి సమన్వయ మార్గాన్ని చూపినారు. ఆతర్వాత, హిందూధర్మపునరుత్థాన జనకుడు - వివేకానందస్వామి ఆ మహనీయస్థితికి మూలమై నిలిచినాడు. భూగర్భ నిక్షిప్త హిందూ తత్త్వమణులు బయటకు దీయబడి సానలుబెట్టబడి, విశ్వమానవ విజ్ఞానానికి మార్గదర్శక జ్యోతులైనవి. ఇట్లా కొడిగట్టియుండిన హైందవ సాంస్కృతిక దీపము, చమురుబోసి వత్తి ఎగవేయబడినది.

## అగ్రవర్ణాల గుప్తధనము

మన భూరి (వేదాంత) విద్య మొదట క్షత్రియుల సొమ్మయినా, బ్రాహ్మణాధీనమై - మంత్రంతోబాటు భాషగూడా వారి గుప్తధనమైనది. కాబట్టే ఐదువేల సంవత్సరాలనాటి హిందూమతం, వర్గభిత్తికలనడుమ కృశించిపోతుండగా, కొత్త మతాలు ప్రపంచవ్యాప్తి నొందినవి. కాని గీతారవం వినబడుతూనే, కొద్దిమందినైన ఉత్తేజపరుస్తూ వచ్చినది.

## గీతా సందేశం

గీత భిన్నసంప్రదాయాలను, విశ్వాసాలను, భావాలను సమన్వయపరచి సర్వవేదాంతసార సంగ్రహభూతమై, విశ్వమానవ శాశ్వత సమగ్రధర్మానికి లోక కల్యాణానికి పవిత్ర మూలగ్రంధమైనది. నీచయోనిలో పుట్టినా శూద్రుడైనా స్త్రీయైనా దీనిని చదువను హక్కు ఉన్నదని కృష్ణభగవానుడే చాటుతుండగా, బ్రాహ్మణేతరులెవరూ వినరాదని భూదేవులు శాసించి ఆదివ్యవాణిని కించపరచి మానవతనే అవమానపరచి, హిందూమతం గిటకబారేటట్లు చేసినారు. ఇది మాధ్యమికధ్వాంత యుగధర్మం.

## గీతానువాదాలు

భగవద్గీత భారతీయ భాషలలోనికి దిగటం మహారాష్ట్రి జ్ఞానేశ్వరుని పుణ్యమేమో! తర్వాత ఇంచుమించు నూరేండ్లతర్వాత, తిక్కనసోమయాజి భారతంలో 56 పద్యాలలో గీతా రహస్యాన్ని బయటబెట్టినాడు. ఇప్పుడు గీతాదేవి స్వార్థపరులైన పండితకోటి చెరనుండి బయటబడి, ప్రపంచ విజ్ఞాన భాస్కరమైనది.

నూటయాభైయేండ్లనాడు, ఒక ప్రసిద్ధ ఆంధ్రకవి (శిష్టు కృష్ణమూర్తి?) గీతను తెనుగుచేయగా, ఒక బ్రాహ్మణుడు ఆకవి ఇంటికి అతిధిగావచ్చి, దానిని చించివేసినదాకా ముద్దముట్టలేదు, ఇదీ! హిందూధర్మ రక్షకులనుకొనే అగ్రవర్ణాలు ఆ సనాతనధర్మాన్ని భక్షించినవిధం.

అంఘ్రిభవుని కావ్యమే గ్రాహ్యంకాదన్న - పల్నాటి మొరటు అప్పకవి, ఇప్పుడు ఈ వెంకురెడ్డి గీతను తెనుగు చేసినాడని తెలిస్తే - అతని వల్లకాటిబూడిద,

ఉంచేగింటే - అదిరిపడి సుడితిరిగి చావదా? ఎట్లనైతేనేమి? బ్రాహ్మణ వైదిక సామ్రాజ్య మంతరించినది. ఆర్య సనాతనధర్మం పునర్వికాసం పొంది. ప్రపంచ మందంతటా వెలుగొందుతున్నది.

## తెనుగుసేతలు

నా చిన్నచదువుకు తెలిసినంతవరకు - చర్ల గణపతిశాస్త్రి తెనుగు గీత, తుమ్మల సీతారామమూర్తి గీతాదర్శనం తెనుగు పద్యకృతులు. మహాకవి తుమ్మల వారి రచనలలో ఆయన కవితారీతులు, తెనుగు తియ్యదనము గీత వేదాంతాన్ని మహిమ పరుస్తున్నది. నెల్లూరు బచ్చు పాపయ్యశెట్టి తెనుగుసేత మెచ్చదగి ఉన్నది. లోకమాన్య బాలగంగాధరతిలకు జెయిలులో గీతకు వ్యాఖ్యానం వ్రాసి నాడనికాబోలు, రాజకీయవాదులు కొందరు తెనుగు వచనంలో వ్రాసినారు. గాంధీజీ వ్యాఖ్యానంచూచి వినోబాభావేగూడ వ్రాసినాడు.

ఇక ఈ యువకుడు-ఇంగ్లీషు విద్యాధికుడు. తెనుగు కవిత్వానికి కొత్తవాడు-

## అగస్త్యరెడ్డి వెంకురెడ్డి

గీతాసుధాలహరిని, తేటగీతలో తేటతెనుగులో వ్రాసి, కవితాలక్ష్మికి ఒకతీరైన కుందనపు నగను ఒనగూర్చి, వేదాంత సాహిత్యానికి సులభమగు ఆంధ్ర వ్యాఖ్యానాన్ని నంతనపరుస్తున్నాడు. ఇందు పాండిత్య ప్రకర్షకుగా భాషాహింస, నిజవాదబలానికి మూలపార ఖండనాలు లేవు. సామాన్య వేదాంత జ్ఞానంగలిగిన ఒక జ్ఞానతపస్వి, తనబుద్ధికి, తన స్వానుభవానికి, దాని అనుభూతికి తోచినట్లు వ్రాసిన తెనుగుసేత।

## తమిళనాగరికత ఔదార్యం

ఈ వర్గఆంక్ష - మతపీడ, తమిళ నాగరకత, కవితలెఱుగనే ఎఱుగవు, కాబట్టే తమ నాగరకతకు విఱ్ఱవీగుతారు - ఈ ద్రావిడులు. తమిళంలో కురళ్ (సూక్తి) వ్రాసిన మహర్షి - వళ్లువర్ ఒక పరయ; శిలప్పదికారం (మంజీరగాథ) వ్రాసినది ఒక జైన క్షత్రియుడు. వైష్ణవ ఆళ్వారులు పన్నిద్దరులో ఒకడైన తిరుప్పాణి మాల; శైవనాయనమారులు అరవై ముగ్గురిలో నందనారు అస్పృశ్యుడు.

వీరిలో స్త్రీలున్నారు. యామునాచార్యుడు (ఆళవందార్) శూద్ర. తమిళవేదం - నాలాయిరం (నాలుగువేల పాచురాలు) సంకలనం చేయించిన నంబి శూద్రుడే. రామానుజునికి పై పరంపరలోని చిననంబి హరిజనుడు. ఇట్లా అరవ కవులు, జ్ఞానులు, మతప్రవక్తలు అందరూ బ్రాహ్మణేతరులే! బ్రాహ్మణ పండితులు నిన్న మొన్నటివారు. వీరు ధన్యులు.

## వెంకురెడ్డి

ఛందశ్శాస్త్రపు సాముగరిడీలో కవిత్వపుకత్తులు తిప్పినవాడుకాడు. పూర్వ జన్మ సుకృత పరిపాకంతో, భక్తపోతనవలె సహజకవి అయినవాడు. ఆయన వలెనే "పలుకునది నీవె, పలికించువాడ వీవె" అని వినమ్రుడై, సాధుజనులు ముచ్చటపడ చెప్పుకొంటున్నాడు.

## ఈ ఆంధ్రానువాదం

జాత్యమైన తెనుగుదనంతో, గట్లు ఒరుసుకొనిపారే నిండుచేరువలె ఒడు దుడుకులు లేకుండా గంభీరసుందరంగా నడుస్తున్నది. వివరణం - విషయాన్ని హైదరాబాద్ అనాబ్‌షాహి (ఫలరాజం) ద్రాక్షను తినిపించినట్లు మనసుకెక్కిస్తు న్నది. పదకృపణమైన కూర్పు - చీకిపోవని చేవ. బిగువు గలిగిన భాషాస్నిగ్ధత - మందమనోజ్ఞమైనధార. ఈ పవిత్ర గ్రంథానికి మహోజ్జ్వల భూషణాలు.

తెనుగు చదువరి, ఈ తెనుగు గీతలు చదువుకోని, అర్థంచేసుకోని, వేదాంతసారాన్ని, సాధన విధానాన్ని మనసులో గట్టిగానిలుపుకొని బాగుపడగలడు ప్రజాకవి వేమనయోగి విరిచిచెప్పిన వేదాంత ప్రవచనవిధానమే ఇది! నిత్యపారా యణార్హమై పారవశ్యాల కలిగించే ఆంధ్రగ్రంథమిది.

వేదాంత గురువులేక, ఈ రెడ్డి గ్రహించిన తత్త్వము-కవిత్వము ప్రశంస నీయాలు. ఈ కవితలో క్లిష్టపదాలు పడికట్టురాళ్లు లేవు. తెనుగుపేత, తిక్కన బాణిలో ఆంధ్రావళికి మోదంగూరుస్తూ. సాంకేతిక పదప్రయోగాలు - సంస్కృ తము. తెలుగు మూలవిధేయాలై ఉన్నవి (ఒకటి రెండు తావులలోతప్ప). ఇదే శాస్త్ర గ్రంథానువాదానికి ఒరగల్లు.

ఇంగ్లీషు సంకరకాలంలో పెరిగిన ఇతడు-నలభై ఏండ్లు నిండకముందే ఇంతటి మహోపేత కృతిని వ్రాయగలిగినదానికి - కులాభిమానంతోగాక, గుణ పక్షపాతంతో రసలుబ్ధతతో, కొనియాడుతున్నా.

కళాప్రపూర్ణ,

డాక్టరు. దివాకర్ల వేంకటావధానిగారు,

ఎం. ఏ (ఆనర్సు) పిహెచ్. డి.

పూర్వాంధ్ర శాఖాధ్యక్షులు - ఉస్మానియా విశ్వవిద్యాలయము

18/4. ఆర్. టి. బరకత్పుర, హైదరాబాదు-27.

శ్రీ అగస్త్యరెడ్డి వెంకురెడ్డి, ఎం, ఏ., యల్ యల్. బి. గారు దయతో బంపిన భగవద్గీతాంధ్రపద్యానువాదము నాదరముతో జదివి అమందమైన యానం దము నందితిని. గీత ఉపనిషత్సారము, యోగశాస్త్రము, బ్రహ్మవిద్యాబోధకము నైన యుద్గ్రంధము. అంత విశ్వజనీనమైన తత్త్వగ్రంథము ప్రపంచముననే మఱొకటి లేదనుటలో నతిశయోక్తి లేదు. అది పఠించువారి జ్ఞానపరిమాణము ననుసరించి యందఱికి నెంతో కొంత యర్థమై యానందముచేకూర్చును. అది పూర్తిగా నర్థమైన వారు లేరు; అసలర్థముకానివారు లేరు. అన్ని రంగములకు చెందిన మహనీయులును దానిని పఠించి తమ నేర్చిన కొలంది దాని కర్థవివరణమో, వ్యాఖ్యానమో కావించి సంతుష్టి నందియుండిరి. అది జ్ఞానకర్మభక్తిమార్గముల సమ న్వయము. నిజమున కది కృష్ణపరమాత్మ అర్జునున కొక్కనికే చేసిన యుపదేశము కాదు. సర్వ మానవులకును కావించిన శాశ్వతోపదేశము. అందలి శ్లోకములు కొన్నియైన చదివి తదర్థమును జీవితమున ననుసంధింపగలవారు కృతార్థులగుదురను టలో సందేహము లేదు. "గీతాసుగీతాకర్తవ్య" అనుటలో కర్తవ్యా అను పదము ముఖ్యము.

ప్రాముఖ్య విశేషమునుబట్టి గీతకు భారతీయభాషలలోనేకాక పాశ్చాత్య భాషలలోకూడ ననేక వివరణములు వెలసినవి. బహుశః గీతపై వ్రాయబడినన్ని వివరణవ్యాఖ్యానాదులు మఱేగ్రంథముపైని వెలువడియుండవు. దానికి పద్యగద్య రూపానువాదములు, వ్యాఖ్యావివరణములు పెక్కుకలవు. ఇప్పుడు శ్రీ రెడ్డిగారు మూలముతో గూడ 'గీతాసుధాలహరి' అను తమగీతపద్యానువాదమును ప్రకటిం చిరి. అనువాదమందలి కొన్ని ముఖ్యపదముల కధస్సూచికలో నర్థములు గూడ నొసంగిరి. పఠితలకీయర్థవివరణము చాల ఉపయోగకరముగా నుండును.

శ్రీ రెడ్డిగారనువదించిన పద్యముల నెడనెడ మూలముతో పోల్చి చదివితిని వారి అనువాదము సరళమై, ధారాశుద్ధిశోభితమై, మూలమునకన్యూనాతిరిక్తమై యింపు నింపుచున్నది. "సర్వధర్మాన్‌పరిత్యజ్య" అను గీతాచరమశ్లోకమునకు వారు కావించిన యీ క్రింది అనువాదపద్యమును చూచిన వారి అనువాదసౌష్ఠవము తేటతెల్లముకాఁజాలును.

సర్వధర్మములను వీడి సవ్యసాచి!
పూర్తిగా నన్ను శరణమ్ము పొందు మీవు
నిఖిలపాపములందుండి నిన్ను నే వి
ముక్తు జేసెద శోకంబు బొందవలదు.

మూలమునందలి అర్థము సంపూర్ణముగా నిందు వ్యక్తమగుచున్నది. అన్ని పద్యములు నిట్లే యున్నవి. శ్రీ రెడ్డిగారి భాష నిర్దోషమై, నిర్మలమై, నిఖిలజన సుబోధమై, నిరతిశయానందము నావహించుచున్నది. శ్రమ, శ్రద్ధ వారి ప్రతిపద్యమునందు ప్రత్యక్షములగుచున్నవి. చివర వారు గీతామాహాత్మ్యమును కూడ సానువాదముగా చేర్చియున్నారు. 'గీతాసుధాలహరి' అనునామ మీగ్రంథమునకు సార్థకము. సమూలము, మూలానుగుణమునైన వారి యీగ్రంథము సర్వాంధ్ర ప్రీతిపాత్రము కాఁజాలునని విశ్వసించుచున్నాను. వారికి ఆదరసహితములైన నా ఆశీస్సులు.

దివాకర్ల వేంకటావధాని.

ఉభయభాషాప్రవీణ వేదాంతపారీణ,
కవిశేఖర, విద్యానాథ, కవితామహేశ్వర
శ్రీ మిన్నికంటి గురునాథశర్మగారు,
5/15, బ్రాడిపేట, గుంటూరు-2

తమరాదృతి నందించిన "గీతాసుధాలహరి" నా భావనకు స్నానపాన యోగ్యమై సంతృప్తి కల్గించినది. 'సరసకవి' శ్రీ రామకృష్ణకవిగారి శిష్యులైన మీ కవిత అన్యథా యెట్లుండగలదు?

శ్రీపాటిబండ, అబ్బరాజు, భువనగిరి మున్నగువారు గీతకు గీత్యనువాదము లొనర్చిరి కాని, వారీ మీ నియమమును బెట్టుకొనక పోయిరి. సంస్కృతములోని అనుష్టుప్పునకు ఆంధ్రములోని గీతి సరియైనది. వ్యాలసువారు వ్రాసిన వేదాంతఘట్టములగు శాంత్యనుశాసనికాదుల అనుష్టుప్పులకును, గీతయందలి అనుష్టుప్పులకును చాల భేదము గలదు. గీతల యనుష్టుప్పులు సులభశైలిలో నుంటయేగాక సాధారణముగా పాదములు కలిసియుండక ఏపాదముతో శ్లోకారంభము చేసినను, నేదిష్ఠసమన్వయయోగ్యమై యుండును. ఈ దూరాన్వయము లేమియే గీతకొక విశిష్టత. మీరిది గమనించియే వ్రాసితిరని మీగ్రంథము చదివి గ్రహించితిని. అయితే సంస్కృతమున వ్రాయుటకంటె దాని తెలుఁగును తెలుఁగున వ్రాయుట మిక్కిలి కష్టము. ఇందులో గణయతులు పాదములబడివచ్చి కంఠము పట్టుకొనును. అందులో ననువాదమాయె. గడి గదలరాదాయె సమర్థుఁడైన కవి గాని నిర్వహించుకొని పోలేఁడు. మీ గీతములు నల్లేరుపై బండినడకగా సాగిపోయినవి. నేనునూ గీతకీఫక్కి వ్రాయగలమా? యని యెంచి యొక యధ్యాయము వ్రాసి యవల ఇందువలన లోకమునకు పరిమితప్రయోజనమేకదా అని మానుకొంటిని. మీరు ధైర్యసాహసములతో ఆపనిచేసి గట్టెక్కితిరి. సంతోషము. ఇంతకు, మీరు పాదమునకు పాదమను నియమముపూని వ్రాసితిరనియే నాభావన. అన్ని పద్యములట్లేయున్నవి. కాననే భూవాచకము ఎక్కువగా తొంగి చూచుచున్నది. 'దాన మీశ్వరభావంబు ధరణిలోన (18-43) మహిని పరిచర్య రూప కర్మంబదెల్ల (18-44) అవని వినజ వాసియు' (18-52) ఇట్టి వారచనావేశ ధోరణిలో నొక్కొక్కప్పుడు మనకు తెలియకుండనే పడవచ్చుకూడ అయితే వీనికి

సార్థకతను చెప్పుకొనుటకును వీలు కొన్నితావుల లేకపోలేదు. ఇట్టివి మీ నియమ పాలనకు సహాయపడవలసియుండును. ఛందోనిబంధననిగళము గలగలలాడు చుండునుగా. పాదమునకు పాదము వ్రాయుటలో కొన్నియెడల వెనుకముందులును గలవు. "అధర్మం ధర్మమితియా - మన్యతేతమసాఽవృతా" (18-32) తమముచే ఆవృతంబయి ధాత్రిలోన, ధర్మముంగానిదంతయు ధర్మమనుచు - అని సంస్కృత సాంప్రదాయముహేతువు చివరకుచెప్పుట. ఆంధ్రసాంప్రదాయమట్లుకాదాయె. కాన నిట్లు చేయకతప్పదు.

కొన్ని తావుల మూలపదము రావలెనని ప్రయత్నించినట్లు కన్పట్టుచున్నది. 'త్వమక్షరంసదస త్తత్పరంచ' (11-37) ఈ సదసత్తత్పరపదమును గీతికిఁదేఁ బూనుకొంటిరి, 'సదసత్పర' శబ్దముం దెచ్చుకొన్నను గీతినడక చక్కఁగా నుండెడిది.

'అనంత దేవేశ జగన్నివాస' అనుదానిని "త్రిజగతీనివాస అనంతదేవదేవ" అని వ్రాయక పోయితిరిగదా! ఇంతకు మీభావము తెలియక యిట్లు వ్రాయు చుంటిని.

మీ అనువాదమున శ్లోకమునకు పద్యము సరిగానున్నదనుటేమిటి! పాద మునకు పాదమే సరిగానున్నది.

యతిగణసంఘము మిమ్మెదిరింపలేదాయె. మీకవితాధార అవిచ్ఛిన్నమైనది. మీ పదములపొందిక ఔచిత్యవంతమైనది. మీ పాండిత్యముపమాతీతమైనది, మీ భావము సరసగంభీరమైనది. మీ యారంభము ఆంధ్రజనానుమోదమైనది. మీ జన్మము సఫలమైనది.

మీ సరస మధుర మృదుల కవిత మీ చే మఱియు గ్రంథములు వ్రాయిం చుగాఁక.

శుభమస్తు.

మిన్నికంటి గురునాథశర్మ.

బహుభాషాకోవిదులు, మహావక్తలు,
ఆర్ష విద్యాభూషణులు. వేదాంతవిద్యామహోదధి,
శ్రీ ఎల్లంరాజు శ్రీనివాసరావుగారు. ఎం ఏ:
ఆంధ్రశాఖాధ్యక్షులు; ప్రభుత్వ కళాశాల, కడప.

# ఆశాసనము

చి॥ అగస్త్యరెడ్డి వెంకురెడ్డి కేవలం అధివక్తేగాక అనువక్త కూడా అనిపించుకోవటం ముదావహం. వీరి గీతానువాదం చాలావరకు పరిశీలించిచూచాను. గీతను గీతపద్యాల్లోనే అనువదించారు. అసలు గీతపద్యాలే అనుష్టుప్పుకు చాలాచక్కగా సరిపోతాయని నా అభిప్రాయం. పైగా మాత్రాచ్ఛందస్సు కావటంవల్ల, ప్రాస నియమంలేకపోవటంవల్ల సౌలభ్యంకూడా హెచ్చుగా ఉంటుంది. అది గమనించే ఇలాంటి పద్యాన్ని ఎన్నుకొన్నారు శ్రీ వెంకురెడ్డి.

పద్యాన్ని ఎన్నుకోటంలోనేగాదు, దాన్ని చివరదాకా నడపటంలోకూడా ఎంతో ప్రౌఢికనిపిస్తుంది, ఎక్కడా ఒడుదుడుకులు లేకుండా నడుస్తుంది పద్యం. అన్వయంలో ఏమాత్రమూ క్లేశంలేదు. మూలాన్ని ఆమూలాగ్రంగా అనుసరించారు. అలా అనుసరించటంలో ఏలాటి కృత్రిమత్వమూలేదు.

అనువాదమంటే అది సామాన్యంకాదు. యథాతథంగా అనువదించటం కష్టం. ఒకవేళ అనువదించగలిగినా భాషలో స్పష్టతా నుడికారమూ పట్టుకరావటం మరీకష్టం. పైగా భగవద్గీతలాంటి ఆధ్యాత్మికగ్రంథంమాట ఇక చెప్పనే అక్కర లేదు. ఎన్నో రహస్యభావాలు ఎంతో సాంకేతికమైన భాషలో చెప్పబడివుంటాయి వాటన్నిటినీ భేదించి తూచా తప్పకుండా అనువదించాలంటే అది ఒక గొప్ప కళే. ఇలాంటికళను, అతిశయోక్తికాదనుకొంటే నూటికితొంబయిపాళ్లు సాధించారీ యువరచయిత.

"అర్జునా! అనన్యమనస్కులగుచు నెవరు
చింతసేయుచు నన్నుపాసించుచుందు
రట్టి నిత్యాభియుక్తులై యలరు వారి
యోగము క్షేమము వహించుచుందు నేనె.

మూలంలోని శబ్దాలు చాలవరకుపట్టుకొనివస్తూ భావాన్ని ఏమాత్రమూ జారనీకుండా ఇలా అనువదించిన పద్యాలెన్నో ఉన్నాయి.

కొన్నిచోట్ల ఆశబ్దాలకు తెలుగుశబ్దాలువాడి అర్థాన్ని చక్కగావివరిస్తూ వస్తారు.

"సలుపదగినవియే యంచు సవ్యసాచి!
మహిని నియతమై నట్టి కర్మమ్ము లెల్ల
ఫలము, సంగమ్ము విడిచి సల్పంగబడిన
త్యాగమయ్యది సాత్త్వక త్యాగ మంద్రు.

ఇక్కడ 'కార్యమిత్యేవ' అనుశబ్దాన్ని సలుపదగినవియే యంచు అని వివరించటం ఎంతో బాగుంది.

అలాగే ఒక్కొక్కచోట శ్లోకభావాన్ని అనువదించటంలో కొంత వ్యత్యయంచేసినా కొంత స్వతంత్రతవహించినా అది మూలోచ్ఛేది కాకుండా మీదుమిక్కిలి పోషకంగాకూడా కనిపిస్తుంది.

"తపామ్యహమహమ్వర్షమ్: నిగృహ్ణామ్యుత్సృజామిచ " అనేదానికి 'వాన గురిపించి విలిపెడివాడ నేనె; వేడిమినిగ్గజేసెడివాడ నేనె'! అలాగే 'నద్వేష్ట్యకుశలమ్ కర్మ- అనే శ్లోకానికి 'సంశయము లేనివాడును, సాత్త్వికుండు అనే పద్యానువాదం ఎంతోబాగా నడిచింది,

ఒక్కొక్కచోట స్వతంత్రించి ఒకమాటచేర్చినా అది ఎంతో సాంప్రదాయం తెలిపేయటంచూస్తే వీరు కేవలం అనువాదకులేకాదు. బాగా శాస్త్రాన్ని ఆకళించుకొన్నారని తెలుస్తుంది. మూలంలో కేవలం 'అధిష్ఠాన' మని ఉంటే 'అర్జునా ఈ అధిష్ఠానమనెడి తనువు' అని 'తను' శబ్దాన్ని చేర్చటం గమనించండి.

అలా చెబుతూపోతే ఎంతో చెప్పవచ్చు. ఎన్నో మెళకువలు చూపవచ్చు. మొత్తంమీద ఒక ఉత్తమానువాదాని కుండవలసిన గుణాలన్నీ చాలావరకు పొందుపడివున్నాయిఇందులో, అనువాదమైనా అనువాదమనిపించకపోవటమే అన్నిటికన్నా

గొప్పగుణం. అది ఈ కవి రచనలో నూటికి నూరుపాళ్లూ ఉంది. అది ఒక్కటి చాలు దీని సాఫల్యానికి నిదర్శనం. ఈ చిరంజీవి ఇంకా చక్కని చిక్కని రచనలు చేసి ఆంధ్ర వాఙ్మయలక్ష్మికి నిత్య నేపథ్యం సమకూర్చాలని ఆశిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

శ్రీనివాసరావు.

డాక్టరు. సి. నారాయణరెడ్డిగారు, ఎం. ఏ., పిహెచ్.డి.
ఆంధ్రశాఖాధ్యక్షులు.
ఉస్మానియా విశ్వవిద్యాలయము,
హైదరాబాదు.

# మరో అనుకృతి

భగవద్గీత భారతంలోనిదైనా అది విడిగా ఒక కావ్యత్వాన్నీ: ఒక నిఖిల వేదాంత సారసత్వాన్నీ సంతరించుకుంది.

భగవద్గీతకు భిన్నభాషల్లో వెలువడిన అనుకృతులనూ, వ్యాఖ్యాకృతులనూ ఎన్నడం 'అమలినతారకా సముదయంబుల' నెన్నడమే.

వెంకురెడ్డిగారు గీతాప్రియులు. ఆ ప్రీతి ఈ పద్యానుకృతికి దారితీసింది. మూలవిధేయంగా ఉంటూనే అత్యంత పఠనీయంగాసాగింది అనువాదం. వెంకురెడ్డిగారి కృషిని అభినందిస్తున్నాను, ఈ అనుకృతి మూలకృతితోపాటు నిలవాలని ఆశిస్తున్నాను.

సి. నారాయణరెడ్డి.

మహాకవి, సరస్వతీపుత్ర, పద్మశ్రీ

డాక్టరు. పుట్టపర్తి నారాయణాచార్యులుగారు,

కడప.

తమరు దయతో వ్రాసిన ఉత్తరం చేరింది. పంపిన భగవద్గీతకూడా చేరింది తీరికగా రెండురోజులు హాయిగా చదివి ఆనందించాను. భగవద్గీతను ఎందరో పద్యంలో గద్యంలో అనువదించినారు. అవన్నీకూడా మూలాన్ని యింకాక్లిష్ట తరం చేయటానికి పనికివచ్చేవే. పద్యంలో అనువాదంచేసేవారు యతిప్రాసల కోసం కొత్తకొత్తరంగులు పూసుకుంటారు. అట్లాకాక తమ అనువాదం సరళమైన గీతంతోసాగింది. వాడినపదాలుకూడా పాండిత్యానికికాక మూలభావాన్ని వెల్లడించడానికే తోడ్పడుతున్నాయి. మీ అనువాదం బాగుంది. చాలసంతోషం,

"పుట్టపర్తి"

సాహిత్యవిద్యాప్రవీణ, భాషాప్రవీణ

శ్రీ కె. ఎస్. రామానుజాచార్యులుగారు. ఎం. ఎ.,

ప్రిన్సిపాల్ వేదసంస్కృత కళాశాల, నెల్లూరు.

శ్రీయుతులు అగస్త్యరెడ్డి వెంకురెడ్డి. ఎం. ఏ. ఎల్ఎల్‌బి. గారు రచించిన 'గీతాసుధాలహరి'ని స్థాలీపులాకరీతిని పరిశీలించితిని. ఇది ప్రస్థానత్రయమునం దొకటియైన శ్రీభగవద్గీతకు ఆంధ్రపద్యానువాదము. దురవగాహములగు వేదాంత విషయములను అనుసరించుచునే ఇట్లు సర్వజనసుబోధముగ అనువదింప గలుగుట వీరి చక్కని ప్రతిభావ్యుత్పత్తులకు నిదర్శనము. ఇది వీరి ప్రథమ కృతియేయైనను నిరవద్యముందరము.

'గీతాసుధాలహరి' భగవద్గీతార్థజిజ్ఞాసువుల నలరించుగాత. శ్రీ గీతాచార్యుని అనుగ్రహమున వీరు యింకను అనేక రసవత్తర రచనలగావించి సహృదయాం ధ్రులకు ఆనందవర్ధనులు కావలయునని ఆశించుచున్నాను.

సుధీజనవిధేయుడు,

కె. ఎస్. రామానుజాచార్యులు.

కవికులరత్నదీప, భాషాప్రవీణ
ఏలూరుపాటి అనంతరామయ్యగారు,
ఎం. ఏ (సంస్కృతము) ఎం. ఏ (తెలుగు) బి. ఇడి;
ప్రిన్సిపాల్, డా. కె. వి. కె. సంస్కృత కళాశాల,
గుంటూరు.

తమ 'గీతాసుధాలహరి' అక్షరాల సుధాలహరిగా నున్నది. తేటగీతులైనను, వేదాంతమైనను, అనువాదమైనను రచన క్రమపరిణతమై పోనుపోను పొంకము సంతరించుకొన్నది. అనువాదము మూలానికి విరుద్ధముగాకుండా, మూలభావ వివరణప్రవణముగా నున్నది, ప్రణయేన=చనవుచేత, ప్రసభం=దురుసుగా- ఇత్యాదిగా జాత్యమైన పలుకుబడి హృదయస్పర్శిగా నున్నది. సరళమై, ధారాళమై, సులభగ్రాహ్యముగా నున్నది.

అపర్యాప్త, పర్యాప్త శబ్దములుమాత్రము చాలక - చాలి అనునర్థమున ప్రయుక్తములో మీరు తెనిగించినట్లు అపార పరిమితార్థములలో ప్రయుక్తములో విజ్ఞులవలన నేను తెలిసికొనవలసియున్నది.

శ్రీకృష్ణకృపానులబ్ధ కవితాహేవాకసౌరభ్య సమ్ముదితప్రాజ్ఞులయ్యు, ఈ కాలమునగూడ, విద్వద్దయాస్పద భావులనుట మీ హృదయలక్షణమును, యోగ్యతను పట్టి యిచ్చుచున్నది. ఇంతటివారు అనుకృతులు కాని కృతులుకూడ వ్రాయకుందురా ? ఇఁకముందసలే యుండగూడదు. మిమ్ము గనినందున మీ జననీ జనకులు అమృతహృదయులై యుండుటకు తోడు అమృత జన్ములేఅయినారు.

అనువాదపు తీరువలెనే అచ్చుసొరుగూడా పొందిక గలిగి మిమ్మొకసారి చూడవలయుననిపించుచున్నది.

బ్రహ్మజ్ఞులగ్గింపవలసిన శాశ్వత శోభగల సుధాలహరిని గుంటూరులోని ఈ పిచ్చుగుంటుపై గూడ ప్రవహింపఁజేసిన మీ నిర్వ్యాజ కటాక్షమునకు కృతజ్ఞుడ.

ఏలూరుపాటి అనంతరామయ్య.

డాక్టరు. ఐ. పాండురంగారావుగారు, ఎం. ఏ. పిహెచ్.డి.
ఆఫీసర్ ఆన్ స్పెషల్ డ్యూటీ.
యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్.
న్యూఢిల్లీ

# అభినందన

శ్రీ అగస్త్యరెడ్డి వెంకురెడ్డిగారి 'గీతాసుధాలహరి'ని అక్కడక్కడ స్థాలీ పులాకంగా చవిచూచాను, చక్కగా, చిక్కగా, సరళంగా, సహజంగా సాగింది రచన. గీతార్థాన్ని తేటగీతలో తేటతెల్లంగా తెలుగు పాఠకులకు అందించిన అగస్త్యవంశజులు అభినందనీయులు.

పేరుకూడా చక్కగా సారగర్భితంగా ఉంది. గీత 'సుధ'; ఇది 'లహరి' ఆ 'గీతకు' ఇది తేటగీత। గీతాచార్యుని అమృతాయమానమైన వాక్సుధను పలు పురు పలువిధములుగా భావించి అనుభవించి ప్రభవింపజేశారు. ఇలాంటి సుధాను భావల్లో వీరు ఎన్నదగినవారు. అసలు గీతామృతం విసలైన అమృతం. 'దుగ్ధం గీతామృతం మహత్' అని కొనియాడబడిన గీత మర్త్యలోకంలోనే అమరత్వాన్ని సాధించేందుకు సహజమైన సాధనగా ఉపకరిస్తుంది. అందువల్లనే అది మహదమృతమయింది. అట్టిమైన యీ అమృతాన్ని అందరికీ అందుబాటులో ఉండే తేటగీతలో తెల్పిచెప్పటం సామాన్యమైన పనికాదు. అనుష్టుప్పుకు తేటగీత అనువుగానే ఉంటుంది. కాని కొన్నిచోట్ల అతిరిక్తపదాలు చేరటం అవసరమవుతుంది. ఇలాంటి పరిస్థితిలో రెడ్డిగారు చాల మెలకువగా మూలవిధేయులై మసలుకొన్నారు. మూలంలోని భావం పూర్తిగా అనువాదంలో వచ్చేట్టు చూచారు.

శ్రీమద్భగవద్గీతలోని ప్రతి అక్షరం పరబ్రహ్మస్వరూపం 'అక్షరం బ్రహ్మ పరమం'- అని - స్వభావసిద్ధమైన అధ్యాత్మతత్త్వాన్ని స్పష్టమైనభాషలో వివరించే గీతకు మరో గీత గీచి 'ఇదమిత్థ'మని అనువదించటం చాల సున్నితమైనపని. ఈ పనికి పూనుకున్న శ్రీరెడ్డిగారికి శ్రీకృష్ణచైతన్యమూర్తి సహకారం లభించింది.

శైలి గంగాప్రవాహం వలె కొండల్లో, కోనల్లో, బండరాళ్ళల్లో, గుండ్రాళ్ళల్లో, మిట్టల్లో, పల్లాల్లో ఏకధాటిగా కొనసాగింది.

అసలు కావ్యానువాదమే కష్టం. కవితను కవితారూపంలో మరోభాషలో అందించటం రెండు భాషల్లో కవితను సాధించగల సవ్యసాచులకే సాధ్యమౌతుంది. అందులో ఆధ్యాత్మిక కవితను అనువదించటం మరీ దుస్సాధ్యం. ఇలాంటి దుష్కర కార్యాన్ని సుకరం చేసుకున్న కవి హృదయం శ్రీ రెడ్డిగారిది.

ఉదాహరణకు 'నైవ కించిత్ కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్'. ...... అనే శ్లోకంలో, ఆ తర్వాతి శ్లోకంలో వివరించిన పశ్యన్, శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ మొదలయిన ఇంద్రియ వ్యాపారాలను దాదాపు అదేవరుసలో అదే శైలిలో తెనిగించటం అనువాదపద్ధతికి ఆదర్శ నిదర్శనం.

ఇంతకూ గీతామృతం అందరికీ పంచిపెట్టటమే వారి ధ్యేయం. దీనికి గ్రహీతల పాత్రత, జిజ్ఞాస, ఆర్తికూడా చాలా అవసరం. తెలుగులోకానికి ఈ అనువాదం గీతాలోకంలోని ఆలోకాన్ని అందించింది. అక్షరజగత్తులో ఈ కృషి దశదిశలా ప్రసరించి అక్షర పరబ్రహ్మకు అక్షయ నీరాజనంగా వెలగాలని వేవేలు గుల వేల్పును ప్రార్థిస్తున్నాను.

ఇలపావులూరి పాండురంగారావు.

## శ్రీ 'శివారెడ్డి'

అర్జుననకు పూర్వమా కృష్ణపరమాత్మ । చాది పోసె గీత సంస్కృతంలొ
మార్చి తెలుగు లోకి మధురాతిమధురంగ । తెలుగులోకిదెచ్చె వెంకురెడ్డి.

అమిత కష్ట మగును ఆంధ్రానువాదమ్ము । కత్తిమీదసాము, కవివిపట్టి
ఊపుతుంది, దీన చూపెట్టె వోక్రొత్త । ఈ 'అగస్త్యరెడ్డి', యీయువకవి.

గీతాశాస్త్రము తేగల । పాతర యద్దాన్ని తఅచె పైనాక్రిందా
లోతూపాతులు, యీకవి । ఏతన్మాత్రుండె, భాగ్యమియ్యది లక్కా ।

ఎక్కడ నేర్చితి వింతటి । చక్కని కవనమ్ము కందచక్కెర కెనయౌ
ఒక్కొక పద్దెము వెంకన । ఒక్కొక రత్నమ్ము చూచ, ఉదరాబదరా

కవులు కొంతమంది కావ్యాలువిరచిస్తె । చదువ బుద్ధిగాదు వదలకుండ.
కవులు కొంత మంది కావ్యాలు చిత్రిస్తె । ఎదలబుద్ధి గాదు చదువకుండ,

# నెనరు పలుకులు

గురుదేవులు శ్రీ మోచెర్ల రామకృష్ణ కవిశేఖర పూజ్యపాదులు వాత్సల్యంతో ఈ అనుకృతిని ఆమూలాగ్రంగా పరిశీలించి నన్ను ఆశీర్వదించుటకు తోడుపడుటయే గాక, నాపై అపార ఆదరాభిమానాలు చూపుతున్న నా శ్రేయోభిలాషులు సింహానగర సుప్రసిద్ధ న్యాయవాదులు మధుర హృదయులు శ్రీమద్దాలి మల్లికార్జునరావుగారికి :-

అర్థించినంతనే ఆదరంతో ఆంగ్లమున 'తొలినుడి' (Fore word) వ్రాసి పంపి తోషము గూర్చిన సహృదయవతంసులు, మాన్యతములు ఆంధ్రవిశ్వవిద్యాలయ తత్త్వశాస్త్ర ప్రధానాచార్యులు- ప్రొఫెసర్ శ్రీ కె. సచ్చిదానందమూర్తిగారికి :-

ఎతద్విషయమున వారికి లేఖద్వారా నన్ను పరిచయం చేసి ఇతోధికంగా ప్రోత్సహించిన సౌజన్యమూర్తులు శ్రీ ముత్తరాజు రామచంద్రరావు (యూనివర్సిటీ గ్రాంట్సు కమీషన్-రిటైర్డు) గారికి :-

మనవి చేసినంతనే మన్ననతో నన్ను మనసుకెక్కించుకొని ఈ తెనుగు సేతను తీవికగా, తీరుగా, తులనాత్మకంగా పరికించి మధురమంజులమైన 'ఒక మనవి' వ్రాసి తీర్పునిచ్చి, నన్ను ఆంధ్రసాహిత్యలోకానికి, ఆస్తిక జగానికి మునుకే పరిచి. అనురక్తితో ఆశీర్వదించిన -తిక్కయ్య తెనుగు తీయదనం. పోతయ్య పేడి - వాడి కంచయ్య కమ్మదనం తనివార గ్రోలి జీర్ణించుకొని తెనుగు పలుకుల వెలదికి పసిడి ముత్యాల తొడుగులు కైసేయుచున్న మొగమోటము లేని మనీషులు. చతురోక్తిచక్రవర్తులు, కళాప్రపూర్ణులు, డాక్టర్. శ్రీ మధునాపంతుల కోదండరామ శెట్టి మహోదయులకు :-

నన్ను తెలియకనే- నేను పుస్తకము పంపి లేఖలు వ్రాసి అభ్యర్థించినంతనే అవ్యాజానురాగంతో ఏతదనువాదం అవలోకించి, అమూల్యములైన అభిప్రాయము కొసగి నన్ను ఆశాసించిన విద్వద్విమర్శకసత్కవి శ్రేష్ఠులకు :-

మొదటినుండి ముద్రణాద్యనేకాంశములలో నాకు సముచిత సూచనలిచ్చి సందియముల బాపి సముత్సాహ పరచడమే కాక, ఈ నాడు ఆప్యాయంగా చక్కని 'పూర్వికి' వ్రాసి పంపి వేడుక కూర్చిన విద్వత్ప్రముఖులు- ఆర్షవిద్యావిభూషణులు, సహృదయులు డాక్టర్ శ్రీ రఘునాథాచార్య ఆప్తవతంసులకు :-

టి. టి. డి. ఆర్థిక సహాయం పొందే యత్నంలో సాయపడిన పూజనీయులు పౌరసంబంధ నిర్వహణాధికారి శ్రీ ఆర్. సూర్యనారాయణమూర్తిగారికి: 'సప్తగిరి' సంపాదకులు శ్రీ కె. సుబ్బారావుగారికి :-

అనునిత్యము మా యింటికి వచ్చి ఈ అనువాదాన్ని ఆద్యంతము నిండు మనసుతో ఓపికగా, ఓర్పుతో మూలంతో సరిపోల్చుచూ, విని-తర్కించి, సాయపడడంగాక, ప్రూఫులు దిద్దడంలో కూడా నాతోపాటు పరిశ్రమించి సహకరించిన సుహృన్మణులు- నెల్లూరు వేదసంస్కృత కళాశాల న్యాయమీమాంసోపన్యాసకులు శ్రీమద్భాగవతం శ్రీనివాస భట్టాచార్యులు, ఎం. ఏ; గారికి: వ్యాకరణోపన్యాసకులు శ్రీఅమృతవాక్కుల శేషకుమార్ ఎం. ఏ. గారికి ;-

కృతజ్ఞతాపూర్వక ప్రణామములు.

కొండంత అండగా నిల్చి గమ్యాన్ని చేరడానికి ఉత్సాహశక్తులు కలుగజేసి చేయూతనిచ్చిన టి. టి. డి. మెడికల్ ఆఫీసరు చిరంజీవి మా డాక్టరు దువ్వూరు వేణుగోపాలరెడ్డి, ఎం. బి. బియస్. గారికి :-

వ్రాతప్రతిని తయారు చేయడంలో సహకరించిన చి॥ మా వేళ్లపాళెం గోపాలరెడ్డి గారికి; స్నేహామృతము చిందించి ప్రోత్సహించిన అధివక్త శ్రీకనుమూరు శంకరరెడ్డి, బి. ఎ, బిఎల్., పాల్చూరు వెంకటకృష్ణారెడ్డి, ఎం. ఏ. బిఎల్ గార్లకు తదితర ప్రియమిత్రమండలికి హార్దికధన్యవాదాలు- శుభాశీస్సులు.

ముఖపత్రం అందంగా తీర్చి అద్భుతమైన ఆలేఖ్యాన్ని చిత్రించి యిచ్చిన మిత్రులు ప్రకటనంకేగిట్టని సౌమ్యశీలి సింహపురచిత్రకళాతపస్వి శ్రీమొలకల సుబ్రహ్మణ్యం గారికి :-

సహనంతో సహకరించి చక్కగా ముద్రించి యిచ్చిన విక్టరీప్రెస్ అధినేత శ్రీ పి. రమేష్, బి. యస్‌సి. గారికి, సిబ్బందికి, గ్రంథభాగంగాక మిగతాభాగాన్ని అందంగా అచ్చుజేసి అందించిన భారతీ ప్రింటర్స్ అధినేత శ్రీ పామూరు ఎతిరాజులుగారికి నా కృతజ్ఞతలు.

ఈ అధియజ్ఞంలో ఎంతోమంది అధ్వర్యులు - అందరికీ వందనాలు.

ఈ పరమపవిత్ర కార్యంలో పనిగట్టుకొని, నిరుత్సాహపరచి, విఘ్నం చేయడానికి యత్నించిన మహానుభావులు లేకపోలేదు. ఐననూ '-

ఇతడు సుజనుడు దుర్జనుం డతడ టంచు । మంచిచెడుగుల భేదంబు లెంచ కుండ,
అందరు మదాత్మ రూపులే యంచు నెంచి, । మస్తకమ్మును వంచి నమస్కరింతు.

ఏ. వి. రెడ్డి.

న్యాయవిద్యాప్రవీణ,
డాక్టర్. ఎస్. బి. రఘునాథాచార్య, ఎం.ఏ., పిహెచ్.డి.
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం. (సంస్కృతవిభాగము)
తిరుపతి.

# భూమిక

ఖండాంతరాలలో నాగరకత కన్నువిప్పేనాటికే ఉత్తమ నాగరకతకు కాణాచిగా పేరుప్రతిష్ఠలను సంపాదించుకొన్న ఖండం మన భరతఖండం. అణువణువునా అఖండ పరబ్రహ్మస్వరూపాన్ని అవలోకించి, అవగాహించి, ఆరాధించిన జాతి మనది. ప్రపంచ సంస్కృతుల్లో అన్నివిధాల తలమానికమైన సంస్కృతి మనది. కానీ ఒక్క ప్రశ్న- ఈ నాగరకత, ఈ అవలోకనం, ఈ అవగాహన, ఈ సంస్కృతి మనకెలా సంక్రమించాయి ఉదాత్తము, న్యాయము ఐన ఈ సంక్రమణానికి వెనుక మనకేమైనా సంప్రదాయం, చరిత్ర అంటూ ఉన్నాయా? ఇలా ఆలోచిస్తూపోతే, అల్పబుద్ధులమైన మనం విలువకట్టలేనంత వాఙ్మయం, క్షణికమై విలువలేని జీవనాన్ని యాంత్రికంగా సాగించే మనకు సరిగా బోధ పడని మహత్తర సాంప్రదాయం. నైతిక-ధార్మిక నియమాలమధ్య నిస్స్వార్థ భావనా మకరందాలు చిందించే ఆదర్శమైన ప్రాచీన చరిత్ర భారతీయులమైన మనకున్నాయని తెలుసుకొని ఆశ్చర్యపడతాం.

ఏ కాలంలోనైనా ఆయాజాతికి సంబంధించిన ఆదర్శాలు, ఆలోచనలు, సంప్రదాయాలు, చరిత్రలు, ఆనాటి వాఙ్మయంలో తప్పక ప్రతిబింబిస్తాయి. ద్రష్టల వాణిని మహిమను బట్టి అవి భూత-భవిష్య-ద్వర్తమానాలలో చెక్కుచెదరని నిత్య సత్యాలను ప్రకటిస్తాయి. మన జాతీయ వాఙ్మయాన్ని ఈ దృష్టితో పరిశీలిస్తే, వేదాంత శాస్త్ర మత నీతిపరమైన అవగాహనను, స్ఫూర్తిని తరతరాలుగా జాతి జనవాహినిలో ప్రవహింపజేస్తూ, సమాజంలో ప్రతివ్యక్తికీ, మనశ్శాంతిని పుష్కలంగా కలుగజేయగల మహాగ్రంథం భగవద్గీత అని వేరే చెప్పనక్కరలేదు. అసలు శ్రీకృష్ణావతార పరమప్రయోజనం ఈ భగవద్గీతోపదేశమే (దీన్నిగూర్చి 'మన సమస్యలకు భగవద్గీత పరిష్కారాలు') (తిరుమలతిరుపతి దేవస్థానముల ప్రచురణ. తిరుపతి 1989) ఆముఖంలో విపులంగా చర్చించాను.

ఈ భగవద్గీతకు ప్రపంచంలో ఎన్నో భాషల్లో గద్యపద్యానువాదాలు, ఎందఱో మహనీయులు, మహానుభావులు చేసిన వ్యాఖ్యానాలు. ఇంకెందఱో వెలువరించిన విమర్శలు కోకొల్లలుగా ఏర్పడ్డాయి. అయినా నేటి సభ్యసమాజంలో ఇంకా భగవద్గీతను చదువుకొని, అర్థం చేసుకొని, తమ జీవితాల్లో దాని ప్రయోజనాన్ని పొందాలనే ఆకాంక్ష, ఆలోచన అరుదుగానే కనబడుతున్నాయి. అంతధైర్యాన్ని నేటి సమాజం తప్పక పొందాలంటే చదివిన తరువాత మఱచిపోకుండా ఉండే అనువైన అందమైన, అనువాదాలు బాగారావాలి. గీతాసుధాలహరిద్వారా ఈ లోటును తీర్చడానికి ప్రియమిత్రమణులు శ్రీ అగస్త్యరెడ్డి వెంకురెడ్డిగారు చేసిన ప్రయత్నం ఎంతో ప్రశంసనీయం.

'గీతాసుధాలహరి' అనేమాట చెవిలో పడటంతోనే హృదయానికి ఏదో ఒక ఆప్యాయత కలుగుతుంది. ఇందులో రచన సరళంగా సాగింది. ప్రసన్నగంభీరమైన పదవిన్యాసాలతో కమనీయంగా నడచింది కవితాలహరి. మూలంప్రక్కనే అనువాదం ఇవ్వడం ఎంతో ఉచితంగా ఉంది. గోపాలనందనుడు పార్థుణ్ని లేగదూడగా చేసుకొని ఉపనిషద్గోమాతలనుంచి గీతామృతదుగ్ధాన్ని పిండి, బుద్ధిమంతులను చక్కగా ఆస్వాదించమన్నాడు భాషాపరమైన క్లేశంలేకుండా, సర్వాంగసుందరంగా, సహృదయులను ఆహ్లాదపరచే హృద్యమైన గీతాసుధాలహరిని ఆంధ్రావనిలోని ఆధ్యాత్మిక హృదయకేదారాలలో చక్కగా ప్రవహింపజేసి ధన్యజన్ములైనారు శ్రీవెంకురెడ్డిగారు. వీరిని మనసారా అభినందిస్తున్నాను. ఈ అనువాదాన్ని ఆదరించి ఆంధ్రలోకం వీరి ప్రయత్నాన్ని సఫలంచేస్తుందని ఆశిస్తున్నాను.

ఎస్. బి. రఘునాథాచార్య.

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# కృత్యుదయము

వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్,
దేవకీపరమానందం కృష్ణం వందే జగద్గురుమ్.

హరియే మున్ ప్రవచింప పార్థునికి ప్రత్యక్షంబుగా, భారతాం
తరబద్ధంబయి వ్యాసమౌనికృప, అద్వైతామృతంబెప్పుడిం
పరయన్ జిల్కుచు వెల్గు ఓభగవతీ! అష్టాదశాధ్యాయినీ!
స్థిరభక్తిన్ నిను గొల్తు నంబ! భగవద్గీతా! భవచ్ఛేదినీ!

శ్రీమద్భగవద్గీత అపూర్వము, అద్వితీయము అయిన అతిలోకోత్తర గ్రంథ రాజము. ఇది ప్రత్యేకంగా ఏ ఒక్కమతంకోసమో ఆవిర్భవించిన మతగ్రంథం కాదు, ఇది విశ్వమానవశ్రేయఃప్రదమైన సంపూర్ణయోగశాస్త్రము, లోకైక ధర్మగ్రంథము. సకలవేదోపనిషత్తుల సారమేకాక ప్రపంచములోని సర్వవిభిన్న ధర్మముల, సిద్ధాంతముల సారమంతయు క్రోడీకరింపబడి ఇందు చక్కగా సమన్వయింపబడియున్నది. పది పదకొండవ అధ్యాయములందలి వైదిక మతపరములగు పేర్లను మినహాయించిన తక్కినదేదియు ఏ మతస్థునికైనా అనంగీకారము కాజాలదు. నాడు పార్థుని కర్తవ్యోన్ముఖుని గావించడానికి శ్రీకృష్ణభగవానునిచే ప్రవచింపబడినదైనా ఇది నరుని నెపంతో సకల మానవాళికే కావించిన విశ్వ ప్రబోధము.

నిత్యము, అనుక్షణము మనము మన జీవయాత్రలో ఎదుర్కొనే ప్రతి సమస్యకు భగవద్గీతలో మనకు చక్కని సహేతుకమైన సమాధానం లభిస్తుంది. మర్త్యుడమర్త్యుడు కావడానికి సుగమము. సూక్ష్మమూ అయిన దివ్యమార్గంచూపే గీతాశాస్త్రములోని సర్వసమత్వతత్త్వసిద్ధాంతములు సర్వథా సకలమానవ శిరోధార్యములు. జాతికులమతలింగ వివక్షత లేకుండా ఎట్టివాడైనా-ఏస్థితిలో ఉన్నా-ఎట్టివిషమావస్థలో ఉన్నా-వాని వాని అంతఃకరణ ప్రవృత్తికనుగుణంగా మానవలోక చరమగమ్యమైన పునరావృత్తి రహిత శాశ్వత మోక్షానందమును పొందడానికి సులభతరము అనుగుణము. ఆచరణసాధ్యము అయిన సాధన విధానములెన్నో ఇందు స్పష్టంగా నిర్వచింపబడియున్నవి.

ఇది కర్మ భక్తి జ్ఞానముల సమ్మేళనము. మనుజుడు తన కర్తవ్యనిర్వహణలో ధర్మమేదో తెలియక విషమ సందేహావస్థలోపడి విలపిస్తూఉంటే వెన్నుతట్టి వానికి వివేకవంతమైన మార్గాన్ని చూపుతుంది భగవద్గీత. దీనికి నా జీవితమే నాకు ప్రత్యక్షసాక్షము. ఎన్నోమార్లు విషమపరిస్థితులలో నాకు ఓదార్పుగా ఉపకరించింది గీత.

పరమాత్మ తత్త్వాన్ని గూర్చి. దానిని ప్రాపించే విధానాన్ని గూర్చి గీతలో నిర్వచింపబడిన విధంగా ప్రపంచంలో ఏ మతవాఙ్మయంలోను కనిపించదు. దుఃఖభాజనమైన ఈ జననమరణచక్రమునుండి విముక్తి పొందడానికి మానవునికి గీతను మించిన దివ్యసాధనం మతొక్కటి లేదు. "యోగోభవతి దుఃఖహా"-అనికదా. సనాతనము, సత్యము అయిన ఆత్మధర్మాన్ని గుఱించి సూటిగా హృదయములలోనికి చొచ్చుకొని పోయేసూక్తులతో "పోయేది పీది-నీవుమాత్రం కాదు" అనే దేశమతకాలాతీతమైన పరమసత్యాన్ని ఎఱుక పఱచి మానవుని సచ్చిదానందమయమైన మోక్షసామ్రాజ్యభద్రాసనంమీద అధిష్ఠింప జేయడమే భగవద్గీత అంతిమ లక్ష్యము, అందుకే ఇది ధర్మగ్రంథము. ఆత్మ సాక్షాత్కృతియే ధర్మము. ఆత్మవిస్మృతియే అధర్మము. ఇట్టి మహిమాన్వితమైన ఆత్మతత్వాన్ని అందరికీ ఆచరణ సాధ్యంగా ప్రవచిస్తూ ఉండటంబట్టే ఇది విశ్వజనీన గ్రంధమైంది.

ఇందు మొదటి ఆఱు అధ్యాయములు కర్మయోగాన్ని తరువాతి ఆఱు అధ్యాయములు భక్తియోగాన్ని చివరి ఆఱు అధ్యాయములు జ్ఞానయోగాన్ని గుఱించి బోధిస్తున్నా ప్రతి అధ్యాయంలోను వీని మూడింటి చక్కని సమన్వయాన్ని మనము చూడగలము. గీతాశాస్త్ర పరమార్థము నిష్కామకర్మయోగమే కదా. "యోగఃకర్మసుకౌశలమ్" "కర్మయోగోవిశిష్యతి" అని కదా భగవద్గీత.

సామవేద లేక ఛాందోగ్యోపనిషత్తులోని 'తత్త్వమసి' అను మహావాక్యములోని 'త్వం' పదార్థ విచారము నిందు ప్రథమషట్కము; 'తత్' పదార్థ విచారమును ద్వితీయషట్కము; జీవబ్రహ్మైక్యమునుచెప్పు 'అసి' పదార్థ విచారమును తృతీయషట్కము బోధించుచున్నవని తద్విషయజ్ఞులగు మహాత్ములు వ్యాఖ్యానించుచున్నారు.

గీతను సమగ్రంగా అర్థము చేసుకొన్న వారు లేరు. కనుకనే భిన్నభిన్న వ్యాఖ్యానములకును, విచిత్రములైన సిద్ధాంతప్రవచనములకును, వాదోపవాదము

లకును ఇది ఆస్కారమైనది, ఎన్ని వాదనలున్నా భగవద్గీత ప్రవచించే మహా సూక్తులను గుఱించి ఏ ఆస్తికుడును శంకించబోడు. గీతకక్షరరూపం కల్గించి విశ్వమానవాళికి జ్ఞానభిక్షపెట్టి తరించడానికి సులభమైన దివ్యమార్గాన్ని చూపిన వ్యాసభగవానులు మనకు ప్రాతఃస్మరణీయులు. ఆ అపర హరియే లేకున్న మన మీనాడు ఈ గీతామృత పానానికి నోచుకొని యుండువారము కాము. ఆ మహా తపస్వి ఋణము తీర్చుకొనలేదు మానవజాతి.

ఇట్టి మహిమోపేతమైన భగవద్గీతయందు నాకు తొలుదొల్త అయిదాతేడుల ప్రాయమందే పరమభక్తి భావాన్ని కలిగించింది మా మాతామహులు కీ॥ శే॥ శ్రీ దువ్వూరు రాఘవరెడ్డిగారు. వారు అప్పుడప్పుడు

"సర్వశాస్త్రమయీ గీతా, సర్వ వేదమయో హరిః

గీతాస్సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రవిస్తరైః" - అంటూ నాకు బోధిస్తుండేవారు.

తర్వాత గురుదేవులు శ్రీ మోచెర్ల రామకృష్ణకవిశేఖర పూజ్యపాదులు పింహపురమున ఆంధ్రసభలో 'గీతామందిర' ప్రారంభమహోత్సవ శుభదివసమున రచించిన 'పద్యమణిసప్తకి' ని. నేను 1955 లో కాబోలు చూడడం తటస్థించింది. అందలి రెండు పద్యములు నా మనోఫలకం మీద చెఱగని ముద్ర వేసి నా హృదయక్షేత్రంలో భగవద్గీతయందు అసదృశమైన భక్తి బీజాన్ని నాటినవి. మొదట గీతను చదివింది కూడ అప్పుడే. ఆ మహాద్భుతములైన పద్యములు ఇవి.

"నరుని మనంబు శోకసదనంబయి చీకటికోనయైన య
త్తఱి వెలుగిచ్చి అక్షయనిధానసుధారసభిక్షపెట్టి సు
స్థిర పదవీ శుభాప్తికి విశిష్ట పదమ్మును జూపజాలు, స
ద్గురుని సృజించినట్టి యనఘున్ భగవంతు భజింతు వ్యాసునిన్.

వ్యాసమహర్షి వాక్కు సుమవాసనలే మనపూర్వకర్మదు
ర్వాసనలన్ హరించుట ధ్రువంబగుటన్ విధిగా విరూఢవి
శ్వాసముతో వివేకులగు వారు వినన్వలె శౌరి నేర్పు కుం
తీసుతమధ్యముండు గుఱుతించిన తత్త్వచోరహస్యముల్".

ఆ నాడు నాలో ఏర్పడిన తత్పరమైన భక్తి అంతర్నిహితమై అట్లనే ఉండి పోయింది.

చివరకు 1973 వ సంవత్సరము నవంబరు మాసమున గృహసంబంధము లైన కొన్ని విషమసమస్యల విషవలయంలో చిక్కుపడి తీరని మనోవ్యథకు గుఱియై నలిగిపోతున్న సందర్భంలో ఎందుకో అప్రయత్నంగా గీతనందుకొని చదవడం ప్రారంభించాను. ఏ దివ్యశక్తిప్రేరణమో! చదువునపుడు అక్కడక్కడ కొన్ని శ్లోకాలకు కొన్ని తేటగీతి పద్యాలు స్ఫురించినాయి. అనుకోకుండా సంభవించిన యీ పరమాద్భుత సంఘటనకు ఆశ్చర్యం, ఆనందం కలిగినవి. అంతే గీతను సమగ్రంగా అనువదించాలనే ఆలోచన కలిగింది. అంతకుమున్ను గీతను అనువదిస్తానని కలలో కూడ భావింపలేదు. ఆ యోగ్యత కూడ నాకు లేదు. అంతా పరమ కరుణాస్వభావుడైన ఆ గోపాలదేవుని అనుగ్రహమే. అనేకము లగు వ్యాఖ్యానములు సంపాదించి చదవడంతోనే ఏడెనిమిదిమాసాలకు పైగా గడచి పోయినవి.

తర్వాత శ్రీకృష్ణభగవానునిపై సమస్తభారమును మోపి 1974-10-26 న అనువదించడానికి 'శ్రీ'కారంచుట్టి 1974-12-22 తేదీ పూర్తికావించినాను. ఇది చూచిన మిత్రులనేకులు ముద్రణకు ప్రోత్సహించినా కారణాంతరములచే కుదిరినదికాదు.

ఇట్టి స్థితిలో ఒకనాడు తనఅల్లుడు - నా మిత్రులు అయిన డాక్టర్ శ్రీ ఏ. వి. సుబ్రహ్మణ్యం ఎం. బి. బియస్ గారి ద్వారా విషయాన్ని తెలిసికొని, మాననీయులు శ్రీమద్దాలి మల్లికార్జునరావుగారు నన్ను శ్రీమోచెర్ల రామకృష్ణయ్యగారి ఇంటికి తీసుకొని వెళ్ళి ఏతదనువాదవిషయమును ప్రస్తావించి దానిని సరిజూడవల సిందిగా కోరిరి. వారు నాపై అపారమైన శిష్యవాత్సల్యంచేత దానిని సమగ్రంగా పరిశీలించి అమూల్యములైన సూచనలొసగి నా సందేహములనుబాపి 1976-5-11 తేది నా వ్రాతప్రతిని నా కొసంగుచు "నీకిది యశస్సు చేకూరుస్తుంది. త్వరలో ముద్రించండి" అంటూ నన్ను ఆశీర్వదించిరి. ఇన్ని జరిగినా ఏదో అవరోధంతో ముద్రించే సదవకాశము లభ్యపడిందికాదు.

ఇట్లుండ 1979న సంవత్సరములో 'తిరుమలతిరుపతిదేవస్థానము' వారు హిందూధర్మప్రచారపోషకంగా వేదాంత మతగ్రంథముల ప్రచురణార్థము ధనసహాయమొనరించే ప్రకటన పత్రికలలో చూడడం, మిత్రులు ప్రోత్సహించడం- తత్కా-

ర్యోన్ముఖుణ్ని కావడం జరిగింది. ఇన్నాళ్ళు అచ్చుకాకుండా వుండడం ఈ మహ దనుగ్రహం కోసమేనేమో!

ఇక్కడ ఒక్కమాట. "ఎందరో గీతనువ్రాస్తే మళలా దానినే నీవు రాయ దండేనికి?" అనే- ప్రశ్నకు నా సమాధానం.

ఎవరోగంగలోమునిగితే గట్టునున్నవానికి ప్రయోజనముండునా? ఎందరు వ్రాసిననేమి? ఎవరి ఆత్మానుభూతి వారిది.

'శ్రేయాంసి బహువిఘ్నాని'- అన్నట్లు, అడుగడుగునా ఎన్నో అడ్డంకులు- ఎన్నో ఒడుదుడుకులు- అన్నిటినీ అధిగమించి చివరకు శ్రీకృష్ణపరమాత్మ అనుగ్రహలేశమున ఈ 'గీతాసుధాలహరి'- ఇన్నాళ్ళకు, ఇన్నేళ్ళకు వెలుగుచూచే మహద్భాగ్యం కలుగుతున్నందుకు పరమసంతోషంగా ఉన్నది,

నా నేర్చిన కొలది చాల మటుకు మూలానుసరణంగానే అనువదించడానికి ప్రయత్నించాను. ఈ అనువాదపు తీరుతెన్నులగూర్చిచెప్పడానికి సహృదయ పాఠకలోకమే ప్రమాణము, నేను పండితుడనుగాను. నా బుద్ధి లోపంవల్ల జారుపాటు లక్కడక్కడా ఉండవచ్చు; ప్రాజ్ఞులు సౌహార్ద్రముతో లోపములను తెలియ జేసినచో కృతజ్ఞతతో స్వీకరించి ఈ గ్రంధము పునర్ముద్రణభాగ్యమునందు నేని సవరించుకొన గలవాడను, విశ్వప్రయత్నంచేసినా అచ్చుతప్పులులేకుండా చేయడానికి సాధ్యపడిందికాదు. ఇందలిదోషములకు, అచ్చునెరసులకు క్షంతవ్యుణ్ని.

ఈ 'గీతాసుధాలహరి' లోని ఒక్కపదమైనా ఒక్కపాఠకునైనా కదిలించ గలిగితే నా జీవితము చరితార్థమైందని భావిస్తాను. నేను కోరదగింది అంతకంటే లేదు. దీనిని సదసద్వివేకులు, సరసహృదయులూ అయిన ఆంధ్రపాఠకలోకం ఆదరించి ఆశీర్వదిస్తుందని ఆశిస్తున్నాను.

గాంధినగరు - నెల్లూరు.
రౌద్రి- వైశాఖ శుద్ధ పంచమి
19-4-1980

నమస్సులతో
మీ
అ. వెం. రెడ్డి.

'నవరసకవి', 'సాహిత్యరత్న', 'కవిశేఖర', 'ప్రసన్నమధురకవి'-అధివక్త
శ్రీ మోచెర్ల రామకృష్ణయ్యగారు, బి. ఏ., బియల్.,

కవితానికేతన్,
అత్తితోట అగ్రహారము
నెల్లూరు

శ్రీః

## ఆశీస్సు

అమలస్వాంతు, నజాతశత్రుఁ, గవితావ్యాసక్తచిత్తున్, దయా
కమనీయాత్ముని వెంకురెడ్డి ననఘున్, గల్యాణచారిత్రు, బు
ద్ధిమదగ్రియు, బుధోపసేవి, భగవద్గీతాంధ్రపద్యక్రియా
వ్యవహారిణు, అగస్త్యరెడ్డికులునే నాశీర్వదింతున్, గృతిన్.

—మోచెర్ల రామకృష్ణయ్య.

## గురు స్తుతి

కరముల్ మోడ్చి నుతింతు నీ నాకృతిన్ గారుణ్యమేపారఁగాఁ
బరిశీలించి, సుమంగళాక్షతలు ప్రేమఁజల్లి దీవించు స
చ్చరితున్, సత్కవిశేఖరున్, సరసునిన్, సాహిత్యరత్నాంకిత
స్థిరు, మోచెర్లసువంశకౌస్తుభ మణిన్, శ్రీరామకృష్ణార్యునిన్.

# సోదరీ స్మృతి

(21-8-1967 తేది హఠాన్మరణమునొంది మమ్ము దుఃఖాబ్ధిలో ముంచివేసిన మా ప్రియసోదరి శ్రీమతి దువ్వూరు నవనీతమ్మ మా స్మృతిపథంలో ఎన్నటికీ చెఱిగిపోని సాధ్వీశిరోరత్నం. ఆమెకు భగవద్గీతయందుగల భక్తిప్రపత్తులు అనిర్వచనీయములు. ఆమెను నిరంతరం సంస్మరించడం మావిధ్యుక్తధర్మము. శ్రీకృష్ణపరమాత్మ ఆమెకు పునరావృత్తిరహిత శాశ్వత మోక్షానందమును చేకూర్చుగాక!)

పద్మబాంధవుఁడేలేని పగటి వోలె,
శీతకిరణుండులేని నిశీథమట్లు,
అనుఁగుఁజెల్లెలి! నీవు లేనట్టి కతన
అంధకారబంధురంబయ్యె గృహము.

పుట్టుదురు గాక యెందఱో పురుగులట్లు
కులముఁ జెఱుపంగ వారల గొడవ యేల?
కులము వెలయించు నీవంటి గుణవిభూష
యొకతె చాలదె పూజలనొంద సతము.

పుట్టినయింటి గౌరవము పొంగిరి వోవ, ప్రశస్తమైన నీ
మెట్టినయింటి కీర్తిలత మింటికెక్కి ప్రాక, సతీత్వధర్మమే
పట్టున జారనీక, పరివారలతో నతికెక్కినావు, నీ
యట్టి సతీవతంసము మదాత్మసహోదరియౌట, ధన్యుఁడన్.

అనునిత్యమ్మును నీవు భక్తిమెయి నర్చించి, పారాయణం
బును గావించెదు ఆ జగద్ధితకృతిన్ మోక్షార్థివై గీతను బా
వ పలుకే గూర్పుచుఁ దీని నేఁడు పఠించన్ నీవు లేవైతివే
యని వాపోయెదనమ్మ చెల్లి! నవనీతాంబా! సతీరత్నమా!

# XXXI

పాపపంకిలమౌ, యీ ప్రపంచమందు
మంచి రాణింపఁబోదంచు నెంచెనేమొ?
కొంచక హరించి నిన్ను వంచింపఁజేమమ్ము
ఈశ్వరుని లీల తెలియఁగంగ నెవ్వతోప్పు?

మృత్యువన్నది మర్త్యులకెప్పుడైన
సహజమేయంచు నెఱిఁగియు, సంతతమ్ము
నిట్లు మేము మాయావిమోహితులమగుట
తల్లడిలుచుంటి మమ్మ! నిన్ దలఁచి తలఁచి.

# సంపూజనము

మహితగుణకీర్తి మామకమాతృమూర్తి
రాజమాంబిక పాదసరోజములను
భక్తిసుమాంజలులు సమర్పణ మొనర్చి
మూఁడు ప్రొద్దుల మనసార పూజసేతు.

స్మరియింతున్ గురుభక్తిభావమున నిచ్చల్ సచ్చరిత్రున్ నయా
చరణున్, మామక జన్మకారణుని, కష్టంబెద్దియున్ లేక, ఏ
త్రైరకాయమ్ముఁ దొఱంగి *సౌమ్యశివరాత్రిన్ శంభుసాయుజ్యమున్
బొరయం గల్గిన కాశిరెడ్డిని, మహాత్మున్ సాధుసంకీర్తనుఁగా.

పుత్రునకు తల్లిదండ్రుల పూజకంటె
కలదె మహితధర్మమ్ము జగమ్మునందు?
వారికంటె నరునికి దైవమ్ము గలఁడె?
జపతపోదానమంత్రయజ్ఞములు గలవె?

---

* 1969 ఫిబ్రవరి 15వ తేది.

# ప్రాంజలి

శ్రీమదుదార సద్గుణశీల సమున్నతులన్, సుధీజన
గ్రామణులన్ యశోవిభవరమ్యుల, పూజ్యగృహస్థధర్మవి
ద్యామహితాత్ములన్, వరదమాంబను, రాఘవరెడ్డిమౌళి, మా
తామహులన్ నుతించెద వదాన్యుల, ధన్యుల, సాధుమాన్యులన్.

ఆదిలక్ష్మంబ దివ్యగుణావలంబఁ
బుణ్యచరితు వీరారెడ్డి, భూరియశులఁ
దలఁతు, మత్పితామహుల సద్భక్తి నెపుడు
దళితజనకల్పకమ్ముల, ధన్యతముల.

మహితసుగుణధనుల, మత్పితృజ్యేష్ఠుల
జ్ఞాననిధుల ధర్మఖనుల, వెంక
రెడ్డి సుబ్బరామరెడ్డి సుకృతుల, య
శశ్శరీరుల మది సంస్మరింతు.

నను, నేత్రంబులు విప్పునట్టి పసిప్రాయాన దెచ్చి, ప్రేమామృతం
బును వర్షించి, మదీయదేహలతికన్ పోషించి, లాలించి పె
న్చిన, కారుణ్యసుధారసాంబునిధికిన్, పేర్నేటి పుల్లమ్మకున్
అనుఁగుం బిన్నమకే నొసంగెదను, సాష్టాంగప్రణామంబులన్.

ఆమె చేతి గోర్ముద్దల నారగించి
వాస్తవమ్ముగ నేనింత వాఁడనైతి!
ఆమహాతల్లి చేసినయట్టి మేలు
బ్రదికినన్నాళ్ళు విస్మరింపంగనగునె?

## XXXIV

పమ్మిననేర్పుకూర్మి బహుభంగుల మా యిరువంగడాలపా
రమ్మిగ వృద్ధినొందఁగ, విరామ మెఱుంగక సేవసల్పి, మా
యమ్మను మించి మ మ్మతిదయామతిఁ బెంచినయట్టి రామసు
బ్బమ్మకు, పిన్నతల్లికి సహర్షిశము న్నతులన్ ఘటించెదన్.

కారుణ్యమ్మున చేరదీసి, నను, లోకజ్ఞానసంపద్విశే
షారూఢాత్మునొనర్చినట్టి సుగుణోద్యద్భాసితున్ మాతులున్
సారాచారవిచారధర్మనిరతున్, సన్మాన్యు, దువ్వూరు పో
లారెడ్డిన్ వినుతింతు, సజ్జను, బుధశ్లాఘ్యున్, నిరాడంబరున్.

వినయమునకు విజ్ఞతకును
అనుపమ సౌజన్యమునకు నాలంబనమై
తనరిన మాయనుజను, మ
న్ననమెయి, కీర్తింతు సతము నవనీతాంబన్.

## అవతారిక

కాతర్యమ్మువహించి, కంపిలుచు, కింకర్తవ్యతామూఢుఁడై
చేతల్మాని, రణస్థలిన్ నరుఁడు, తాఁజేఁజార్చి గాండీవముల్,
చేతుల్మోడ్చిన, దివ్యబోధసుధవర్షించెన్ ఘనుండెవ్వఁ డా
గీతాచార్యు భజింతు. భక్తసురభిన్ కృష్ణాఖ్యచిన్మేఘమున్.

చేతశ్శుద్ధిఘటించి, మానసికదుశ్చేష్టల్ నివారించి, సం
ప్రీతిన్ దుర్భరిజన్మదుఃఖభయదోద్రేకమ్ములన్మాన్చి, స
ర్వాతీతమ్మగు మోక్షరాజ్యపద విభ్రాజిష్ణుఁగావించు ఆ
గీతాశాస్త్ర సరస్వతిన్ గొలుతు భక్తిన్ నిత్యమిష్టాప్తికై.

గీతయను మహాజ్యోతి వెలిగించి, భవతమ
మోంధకారమ్మునన్ జిక్కి అలమటించు
దీనమానవకోటికి దిక్కుఁజూపి
నట్టి వ్యాసునిభజయింతు. అపరహరిని.

భగవదవతారమూర్తులై ప్రభవమొంది
పరమకృప విశ్వమానవోద్ధరణకొఱకు
దివ్యభాష్యత్రయమ్మునందించి, జ్ఞాన
భిక్షనిడిన మహాత్ముల పేర్మిఁగొలుతు.

ఇందనుకొందఱెందరో కవీంద్రులు వీనులవిందు సేయ, మా
కంద మనోజ్ఞమంజుల సుగంధ సుసారమరంద బిందువుల్
జిందు తెనుంగుబాస విరచించిరి గీతల, వారిముందు నే
నెందును నిల్వఁజాల, క్షమియింపుడు, ధీవరులార! మ్రొక్కెదన్.

XXXVI

స్థిరమతి నెందఱెందరో రచించినగీతల నిప్పుడీవును౯
మఱల రచింపనేలయని న న్నిరసింపఁ దలంపఁ బోకుఁడీ,
పరమపదమ్ముఁజేర్చు భగవద్వచనమ్ముల నెందఱెంద ఱె
క్కరణి రచించిన౯ గొదవగల్గునె? కాదనువారలుందురే?

భవవార్ధి౯ దరియించి కేవలము కైవల్యార్థ సంసిద్ధికై
స్తవనీయమ్మగు యీమహామహిత శాస్త్రమ్ము౯ తెనింగించి, మా
ద్భవము౯ ధన్యముజేసికొందునని, ఉత్సాహించితి౯గాని, నే
కవినై, కీర్తి గడించుకొందు నను కాంక్షంగాదు ముమ్మాటికిన్.



ఓమ్

శ్రీ గణేశాయనమః

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# కృతిసమర్పణము

శ్రీమదఖిలేశ! కేశవా! చిద్విలాస!
నందనందన! నారాయణా! ముకుంద!
భక్తజనమానసోల్లాస! పరమపురుష!
పార్థసారథి! దేవ! తుభ్యం నమోస్తు.

నేను తొలిజన్మమందు మహానుభావ!
ఎట్టిసుకృత మొనర్చితో యేమొ? యిట్టి
దివ్యమగునట్టిగ్రంథ మాంధ్రీకరింపఁ
గంటి, శ్రీకృష్ణ! భవదనుగ్రహమువలన.

దానిచో నీమహోత్కృష్టగ్రంథమేడ!
ఏమిదెలియనివాఁడ! నేనేడనిటులఁ
దెనుఁగొనర్చుటయేడ! ఓవనజనాభ!
శ్రీహరీ! యిదియెల్ల, నీచేతగాక!

పలుకునదినీవె, పలికించువాఁడవీవె,
కార్యకారణంబులునీవె, కర్తవీవె,
ఫలితమునునీవె, మఱి ఫలప్రదుఁడవీవె,
ఏ నిమిత్తమాత్రుండఁగానె? మహాత్మ!

అనఘ! నీకృపఁ బ్రభవించినట్టి దీని
కొనుమ, నీకె సమర్పించుకొంటి దేవ!
చంద్రునకు నూలుపోగను సామెతగను
పరమ కరుణాలవాల! గోపాలకృష్ణ!



శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీతా

## ప్రథమోఽధ్యాయః

### -: అర్జున విషాదయోగః :-

ధృతరాష్ట్ర ఉవాచ:-

ధర్మక్షేత్రే కురుక్షేత్రే
సమవేతా యుయుత్సవః।
మామకాః పాండవాశ్చైవ
కిమకుర్వత సంజయ!॥

సంజయ ఉవాచ:-

దృష్ట్వాతు పాండవానీకం
వ్యూఢం దుర్యోధనస్తదా।
ఆచార్య ముపసంగమ్య
రాజా వచన మబ్రవీత్॥

పశ్యైతాం పాండుపుత్రాణా
మాచార్య! మహతీంచమూమ్
వ్యూఢాం ద్రుపదపుత్రేణ
తవ శిష్యేణ ధీమతా॥

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# గీతా సుధా లహరి

## ఒకటవ అధ్యాయము

### —— : అర్జున విషాదయోగము : ——

ధృతరాష్ట్రుఁడిట్లనియె:-

*శ్రీకరంబైన వరకురుక్షేత్రమందు
యుద్ధ మాచరింపంగ నుద్యుక్తులగుచు,
నాదుతనయులు, బాండునందనులుఁగూడి,
ఏమిచేసిరో? సంజయా! ఎఱుఁగఁజెపుమ. 1

సంజయుఁడిట్లనియె:-

ఎలమి, వ్యూహాకృతిగనొప్పి, యెసకమెసఁగు
పాండ[1]వానీకమెల్లను బాఱఁజూచి,
రాజు దుర్యోధనుండు, సరభసముగను,
గురుని ద్రోణునిఁజేరి, వాకొనియెనిట్లు. 2

శేముషీశాలి భవదీయ శిష్యుఁడైన
ద్రుపదపుత్రునిచేత నద్భుతముఁగొలుప
వ్యూహముగ నిర్మితంబయియొప్పుచున్న
పాండవమహాబలము, గురువర్య! కంటె? 3

---

*పాఠాంతరము:-

*సంజయా! యేమిచేసిరి? సంగరంబు*
*నాచరింప, ధర్మక్షేత్రమైతలిర్పు*
*నట్టి, యా కురుక్షేత్రమ్మునందుఁజేరి*
*పాండుభూపాలసుతులు, మావారు, చెపుమ!*

అత్రశూరా మహేష్వాసా
భీమార్జునసమా యుధి,
యుయుధానో విరాటశ్చ
ద్రుపదశ్చ మహారథః॥ ౪

ధృష్టకేతుశ్చేకితానః
కాశిరాజశ్చ వీర్యవాన్,
పురుజిత్కుంతిభోజశ్చ
శైబ్యశ్చ నరపుంగవః॥ ౫

యుధామన్యుశ్చ విక్రాంత
ఉత్తమౌజాశ్చ వీర్యవాన్,
సౌభద్రో ద్రౌపదేయాశ్చ
సర్వ ఏవ మహారథాః॥ ౬

అస్మాకం తు విశిష్టా యే
తాన్నిబోధ ద్విజోత్తమ!
నాయకా మమ సైన్యస్య
సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే॥ ౭

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ
కృపశ్చ సమితింజయః,
అశ్వత్థామా వికర్ణశ్చ
సౌమదత్తిర్జయద్రథః॥ ౮

అన్యే చ బహవశ్శూరా
మదర్థే త్యక్తజీవితాః,
నానాశస్త్రప్రహరణా
స్సర్వే యుద్ధవిశారదాః॥ ౯

పేరుఁగొన్నట్టివిలుకాండ్రు, వీరవరులు,
నాలమున భీమపార్థులఁ బోలువారు,
సాత్యకియును, విరాటభూజానియును, మ
హారథుండగు నాద్రుపదాధిపుండు; 4

చేకితానుండు, శైబ్యుఁడు, శ్రేష్ఠులైన
ధృష్టకేతుఁడు, పురుజిన్మహీధవుండు,
ఘనుఁడు కుంతిభోజుండును, గాశిరాజు
నందుఁగలరు, పాండవుల సైన్యంబులోన. 5

మహిత విక్రాంతుఁడలయుధామన్యువిభుఁడు,
శూరవరుఁడైన నుత్తమౌజుండు, మఱియు
ద్రౌపదేయులు, నాసుభద్రాసుతుండు,
నందఱును మహారథులె యందరసిచూడ. 6

ఇంక మనవారిలో ముఖ్యులెవరొ? నాదు
బలమునందలి నాయక ప్రముఖులెవరొ?
అవధరింపుఁడు, మీకు సంజ్ఞార్థమేను
బలుకువాఁడను, బ్రాహ్మణాన్వయవతంస! 7

మీరలున్, భీష్మఁడున్, మఱి మీసుతుండు,
సమరజయశీలి యాకృపాచార్యవరుఁడు,
నర్కజుఁడు, సౌమదత్తి-జయద్రథుఁడు, వి
కర్ణుఁడును మనబలమందుఁగలరు, కనుఁడు. 8

చూడనింకెందరెందరో శూరవరులుఁ
బ్రాణముల మన్నిమిత్తమైపాయువార
లస్త్రశస్త్రప్రయోగ విఖ్యాతయశులు,
యుద్ధకోవిదులెల్లనిందున్నవారు. 9

అపర్యాప్తం తదస్మాకం
బలం భీష్మాభిరక్షితమ్,
పర్యాప్తం త్విదమేతేషాం
బలం భీమాభిరక్షితమ్॥

అయనేషు చ సర్వేషు
యథాభాగమవస్థితాః,
భీష్మమేవాభిరక్షంతు
భవంత స్సర్వ ఏవ హి॥

తస్య సంజనయన్ హర్షం
కురువృద్ధః పితామహః,
సింహనాదం వినద్యోచ్చై
శ్శంఖం దధ్మౌప్రతాపవాన్

తత శ్శంఖాశ్చభేర్యశ్చ
పణవానకగోముఖాః,
సహసైవాభ్యహన్యంత
స శబ్దస్తుములోఽభవత్

తత శ్శ్వేతై ర్హయైర్యుక్తే
మహతి స్యందనే స్థితౌ,
మాధవః పాండవశ్చైవ
దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః॥

పాంచజన్యం హృషీకేశో
దేవదత్తం ధనంజయః,
పౌండ్రం దధ్మౌ మహాశంఖం
భీమకర్మా వృకోదరః॥

అరయ భీష్మాభిరక్షితమైన, నాదు
బలమదెల్ల నపారమై పరిఢవిల్లు,
అల్ల భీమాభిరక్షితమైన, పాండ
వ బలమెల్లఁ బరిమితమై పరఁగుచుండె. 10

కడఁగి వ్యూహప్రవేశమార్గముల, మీరు
నియమిత స్థానములయందు నిలిచి, మీరు
జాగరూకులరై, భీష్మ సర్వగతుల
యుద్ధతలమున రక్షించుచుండ్రుగాక! 11

అంత దుర్యోధనునకెంతొ హర్షమొదవ,
విక్రమోపేతుఁ డలకురువృద్ధుఁడగు, పి
తామహుండు భీష్ముఁడు, మహోద్ధతియెలర్ప
సింహనాదమ్ముఁగావించి, చిందమొత్తె. 12

పిదప, వెనువెంట శంఖముల్, భేరులు, పణ
వంబు, లానకంబులు, గోముఖంబులాది
బహుళవిధవాద్యసంకులధ్వనులు నెలఁగె
నొక్కపెట్టున దిక్కులు పిక్కటిల్ల. 13

అంత శ్వేతాశ్వయుక్తమహారథంబు
నందు నద్భుతంబుఁగొలువ నధివసించి,
మాధవుండును, పాండవమధ్యముండు,
దివ్యశంఖంబులూదిరి, దిశలు నెలఁగ. 14

అబ్జనాభుండు పాంచజన్యంబునొత్తె,
నర్జునుండూదె దేవదత్తాహ్వయంబు,
పౌండ్రమను మహాశంఖంబు భయదముగను
నూదె, భీమకర్ముండు, వృకోదరుండు. 15

అనంతవిజయం రాజా
కుంతీపుత్రో యుధిష్ఠిరః,
నకుల స్సహదేవశ్చ
సుఘోషమణిపుష్పకౌ॥ ౧౬

కాశ్యశ్చ పరమేష్వాస
శ్శిఖండీ చ మహారథః,
దృష్టద్యుమ్నో విరాటశ్చ
సాత్యకిశ్చాపరాజితః॥ ౧౭

ద్రుపదో ద్రౌపదేయాశ్చ
సర్వశః పృథివీపతే
సౌభద్రశ్చ మహాబాహుః
శంఖాన్దధ్ముః పృథక్ పృథక్॥ ౧౮

స ఘోషో ధార్తరాష్ట్రాణాం
హృదయాని వ్యదారయత్,
నభశ్చ పృథివీంచైవ
తుములోఽభ్యనునాదయన్॥ ౧౯

అథవ్యవస్థితాన్దృష్ట్వా
ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః,
ప్రవృత్తే శస్త్రసంపాతే
ధనురుద్యమ్యపాండవః॥ ౨౦

హృషీకేశం తదా వాక్య
మిదమాహమహీపతే!॥

అపుడు కౌంతేయుఁడు-యుధిష్ఠిరాధిపుండ
నంతవిజయమ్మునొత్తె విక్రాంతిమెఱయ,
నకులసహదేవులొత్తిరి ప్రకటితముగ
నా సుఘోషమ్ము మణిపుష్పకాహ్వయమ్ము.

పెద్ద విలుకాఁడు-కాశిపృథ్వీపతి, ద్రుప
దాత్మజుండు, శిఖండి-మహారథుండు,
నెన్నఁడేని పరాజయంబెఱుఁగనట్టి
సాత్యకియును, విరాటభూజనవిభుండు;

బాహుబలుఁడైనయట్టి సుభద్రసుతుఁడు,
ద్రౌపదేయులు,ఁ బాంచాలధరణివిభుఁడు,
సర్వయోధులుఁ దమతమ శంఖములను
వేఱువేఱుగ నొత్తిరి, విక్రమమున.

అమిత సంకులమైనట్టి యా రవంబు
అంబరంబును భూమియు నావరించి,
భయదముగఁ బ్రతిధ్వానముల్ పఱఁగఁజేసి,
ధార్తరాష్ట్రులహృదయభేదనమొనర్చె.

[1]శస్త్రసంప్రయోగారంభ సమయమందు,
[2]ప్రదనసన్నద్ధులైన కౌరవులఁగాంచి,
వింట నారి సంధించి, కపిధ్వజుండు,
ఈవిధంబుగఁబల్కె, శ్రీకృష్ణుఁగాంచి.

---

1 శస్త్రములు ప్రయోగించుటకు ప్రారంభించు సమయము

2 యుద్ధసన్నద్ధులైన

అర్జున ఉవాచః-

సేనయోరుభయోర్మధ్యే
రథం స్థాపయ మేఽచ్యుత॥ ౨౧

యావదేతాన్నిరీక్షేఽహం
యోద్ధుకామానవస్థితాన్।
కైర్మయా సహ యోద్ధవ్య
మస్మిన్ రణసముద్యమే॥ ౨౨

యోత్స్యమానానవేక్షేఽహం
య ఏతేఽత్ర సమాగతాః।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే
ర్యుద్ధే ప్రియచికీర్షవః॥ ౨౩

సంజయ ఉవాచః-

ఏవముక్తో హృషీకేశో
గుడాకేశేన భారత!।
సేనయోరుభయోర్మధ్యే
స్థాపయిత్వా రథోత్తమమ్॥ ౨౪

భీష్మద్రోణప్రముఖత
స్సర్వేషాం చ మహీక్షితామ్।
ఉవాచ పార్థ! పశ్యైతాన్
సమవేతాన్ కురూనితి॥ ౨౫

తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః
పితౄనథపితామహాన్।
ఆచార్యాన్ మాతులాన్భ్రాతౄన్
పుత్రాన్ పౌత్రాన్ సఖీంస్తథా॥ ౨౬

శ్వశురాన్ సుహృదశ్చైవ
సేనయోరుభయోరపి।

అర్జునుఁడిట్లనియె:-

దుష్టుఁడగు సుయోధనునకుఁ దోడునిలిచి
యుద్ధమున సాయపడఁగోరు యోధులెవరొ?
సమరమెవ్వరితో నేను సలుపవలెనొ?
ఎవరు నాతోడ సనిసేయ నెంచినారొ?
అట్టి శూరులనెల్ల నేనరయుకొఱకు
నీ యుభయ సేనలనడుమ నిపుడు, నిలుపు
మాధవా! సత్వరమ్ముగ మనరథమ్ము. 21, 22, 23.

సంజయుఁడిట్లనియె:-

అర్జునుండిట్లుపలికిన యాక్షణంబ
మాధవుఁడుభయ సేనలమధ్య, తాను,
ద్రోణ భీష్మాది నిఖిల యోధులకు నెదుట
నమ్మహారథంబు నిలిపి "[1]ఆజికొఱకుఁ
జేరిన సకల కౌరవవీరవరులఁ
గాంచుమర్జున!" యనిచెప్పె క్ష్మాతలేశ! 24, 25

అంత నర్జునుఁ డుభయసైన్యములనున్న
*తండ్రితాతల, గురుల, సోదరుల, సఖుల,
మేనమామల, మామల, మిత్రవరుల,
**హితుల, పుత్రుల, పౌత్రుల నెల్లఁజూచె. 26

---

1 యుద్ధమునకై

*పాఠాంతరము:- తండ్రితాతల, గురుల, భ్రాతలను, సుతుల

** .. హితజనంబుల, మనుమలనెల్లఁజూచె.

తాన్ సమీక్ష్య స కౌంతేయ
స్సర్వాన్ బంధూనవస్థితాన్॥ ౨౭
కృపయా పరయావిష్టో
విషీదన్నిదమబ్రవీత్।

అర్జున ఉవాచ:-

దృష్ట్వేమం స్వజనం కృష్ణ!
యుయుత్సుం సముపస్థితమ్॥ ౨౮

సీదంతి మమ గాత్రాణి
ముఖం చ పరిశుష్యతి।
వేపథుశ్చ శరీరే మే
రోమహర్షశ్చ జాయతే॥ ౨౯

గాండీవం స్రంసతే హస్తాత్
త్వక్చైవ పరిదహ్యతే।
న చ శక్నోమ్యవస్థాతుం
భ్రమతీవ చ మే మనః॥ ౩౦

నిమిత్తాని చ పశ్యామి
విపరీతాని కేశవ।
న చ శ్రేయోఽనుపశ్యామి
హత్వా స్వజనమాహవే॥ ౩౧

న కాంక్షే విజయం కృష్ణ!
న చ రాజ్యం సుఖాని చ।
కిం నో రాజ్యేన గోవింద!
కిం భోగైర్జీవితేన వా?॥ ౩౨

యుద్ధముండేయవచ్చిన యోధవరుల,
సర్వబాంధవులంగాంచి, సవ్యసాచి
పరమకరుణార్ద్రచిత్తుఁడై పలికెనిట్లు,
శోక పరితప్తుఁడగుచు నచ్యుతునితోడ. 27

అర్జునుఁడిట్లనియె:-

సమరముంగోరిచేరిన, స్వజనులఁగన,
వడఁకెదేహమెల్లను. గగుర్పాటుఁగలిగె,
దేవ! నోరెల్లఁదడియారిపోవఁజొచ్చె.
అవయవంబులు శిథిలంబులగుచునుండె. 28, 29

కరమునందుండిజారెను గాండివంబు
[1]కడిమి, చర్మంబు దహియింపఁబడుచునుండె,
ఉల్లమక్కటా! తత్తఱమొందఁదొడఁగె,
నిలువలేనింక రథముపైనేను. కృష్ణ! 30

ఎందుఁ గాంచంగఁబోయిన నిందు, నేఁడు
దుర్నిమిత్తంబులే నాకుఁదోఁచుచుండె,
దురమునందు. నే సకలబంధువులఁజంపి,
ఎట్టి శ్రేయంబుఁ గాంతునో? ఎఱుఁగజాల! 31

జయముఁగోరను. కోరరాజ్యమ్మునేని,
కాంక్షసేయను సుంత సుఖంబులకును;
ఏల రాజ్యంబు? భోగంబులేల? తుదకు
బ్రదికియుండియు ఫలమేమి? వాసుదేవ! 32

---

1 మిక్కిలి

యేషామర్థే కాంక్షితం నో
రాజ్యం భోగాః సుఖాని చ।
త ఇమేఽవస్థితా యుద్ధే
ప్రాణాంస్త్యక్త్వా ధనాని చ॥ ౩౩

ఆచార్యాః పితరః పుత్రా
స్తథైవ చ పితామహాః।
మాతులాః శ్వశురాః పౌత్రాః
శ్యాలాః సంబంధినస్తథా॥ ౩౪

ఏతాన్న హంతుమిచ్ఛామి
ఘ్నతోఽపి మధుసూదన।
అపి త్రైలోక్యరాజ్యస్య
హేతోః. కిం ను మహీకృతే?॥ ౩౫

నిహత్య ధార్తరాష్ట్రాన్నః
కా ప్రీతిస్స్యాజ్జనార్దన।
పాపమేవాశ్రయేదస్మాన్
హత్వైతానాతతాయినః॥ ౩౬

తస్మాన్నార్హా వయం హంతుం
ధార్తరాష్ట్రాన్ సబాంధవాన్।
స్వజనం హి కథం హత్వా
సుఖినస్స్యామ మాదవ!॥ ౩౭

యద్యప్యేతే న పశ్యంతి
లోభోపహతచేతసః।
కులక్షయకృతం దోషం
మిత్రద్రోహే చ పాతకమ్॥ ౩౮

ఎల్ల రాజ్యభోగ సుఖంబు లెవరికొఱకు,
వాంఛసేయుచునుంటిమో, వారె, కృష్ణ!
ప్రాణధనములఁద్యజియింపవచ్చి, నేఁడు
యుద్ధరంగంబులో నిల్చియున్నవారు. 33

సుతులు, తాతలు, దండ్రులు, హితులు, గురులు.
మేనమామలు, మామలు, మిత్రవరులు,
బావమఱఁదులు, మనుమలు, బంధువులును
నిందు మాకందఱును, కృష్ణ! యెంచిచూడ. 34

చంపుదురుగాకనన్వారె, చంపనిమ్ము,
అనఘ! త్రైలోక్యసామ్రాజ్యమబ్బనున్న,
నేను వారలవధియింపఁబూనసన్న,
ఇంక వసుధకై వధియింప నెంతు నొక్కొ? 35

కౌరవులనెల్ల వధియించుకతన మాకు
గలుగనుండెడు సుఖమేమి? పలుకుమనఘ!
ఆతతాయుల, వీరిని హతమొనర్ప
మనకు పాపమేకాదెసంప్రాప్తమగును? 36

అట్టికతన బంధువులతో నమరియున్న
ధార్తరాష్ట్రుల వధియింపఁదగదు మనకు,
ఎల్లస్వజనుల వధియించి, యింకమనము
బావుకొనఁబోవు సుఖమేమి? వాసుదేవ! 37

రాజ్యలోభాంధులౌ ధార్తరాష్ట్రులకట!
కానఁగాఁజాలకున్నారు, కలుగనున్న
స్వకులనాశమ్ముువలని దోషమ్ముగాని,
మిత్రవిద్రోహపాపసమృద్ధిగాని. 38

కథం న జ్ఞేయమస్మాభిః
పాపాదస్మాన్నివ ర్తితుమ్।
కులక్షయకృతం దోషం
ప్రపశ్యద్భిర్జనార్దన!॥ ౩౯

కులక్షయే ప్రణశ్యంతి
కులధర్మాస్సనాతనాః।
ధర్మే నష్టే కులం కృత్స్న
మధర్మోఽభిభవత్యుత॥ ౪౦

అధర్మాభిభవాత్ కృష్ణ!
ప్రదుష్యంతి కులస్త్రియః।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ!
జాయతే వర్ణసంకరః॥ ౪౧

సంకరో నరకాయైవ
కులఘ్నానాం కులస్య చ।
పతంతి పితరో హ్యేషాం
లుప్తపిండోదకక్రియాః॥ ౪౨

దోషైరేతైః కులఘ్నానాం
వర్ణసంకరకారకైః।
ఉత్సాద్యంతే జాతిధర్మాః
కులధర్మాశ్చ శాశ్వతాః॥ ౪౩

ఉత్సన్నకులధర్మాణాం
మనుష్యాణాం జనార్దన!।
నరకే నియతం వాసో
భవతీత్యనుశుశ్రుమ॥ ౪౪

కులవినాశనము వలనఁ గలుగనున్న
నెల్లదోసముల్, చక్కఁగా నెఱుఁగు మనము,
ఇట్టి పాపంబునందుండి యేల యింక
మఱలి చనరాదొకో? చెప్పుమా! ముకుంద! 39

కులము నాశనమొందఁ దత్కులపరంప
రాగతములైన ధర్మముల్ ఱాఁగిపోవు;
ధర్మమడుగంటిపోవ, నధర్మమింక
కులమునంతయు వ్యాపించుకొనదె? కృష్ణ! 40

స్వకులధర్మము నశియించి, జగతిలోన,
కుల మధర్మమునకు కృష్ణ! నిలయమైన
సతులు చెడుదురు, తత్కులసతులుచెడిన
సంభవించునుగా వర్ణసంకరంబు? 41

కులము చెడిపినవారికెన్, కులమునకును,
నరకముంగూర్చు వర్ణసంకరము, చూడ,
కృష్ణ! యెపుడు పిండోదక క్రియలు లేమిఁ
బతితులగుదురు వారల పితరులెల్ల. 42

కులవిఘాతకులగువారు సలుపు, వర్ణ
సంకరంబులౌ యిట్టి దోషముల వలన,
శాశ్వతంబులై జగతి నెసంగునట్టి
జాతి కులధర్మములు, వినాశనమునొందు. 43

స్వకుల ధర్మ వియుక్తులౌవారలెల్ల,
కమలలోచన! నరకలోకంబునందు
శాశ్వతంబుగ వాసంబు సలుపుచుండు
రనుచుఁ బలికెదు, పలుకుల వినమె మనము. 44

అహో! బత! మహత్పాపం
కర్తుం వ్యవసితా వయమ్।
యద్రాజ్యసుఖలోభేన
హంతుం స్వజనముద్యతాః॥ ౪౫

యది మామప్రతీకార
మశస్త్రం శస్త్రపాణయః।
ధార్తరాష్ట్రా రణే హన్యు
స్తన్మే క్షేమతరం భవేత్॥ ౪౬

సంజయ ఉవాచ :-

ఏవముక్త్వార్జునః సంఖ్యే
రథోపస్థ ఉపావిశత్।
విసృజ్య సశరం చాపం
శోకసంవిగ్న మానసః॥ ౪౭

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అర్జునవిషాద
యోగోనామ ప్రథమోఽధ్యాయః

ప్రబలమైన [1]రాజ్యసుఖలోభంబువలన,
స్వజనులందఱ వధియింపఁ జనెడు మనము,
అక్కటక్కట! దారుణంబైన యెట్టి
[2]అఘమునొనరింపఁ గడఁగితిమయ్య! నేఁడు. 45

అనఘ! ఎట్టి ప్రతిక్రియ నాచరింప
నట్టి, శస్త్రమున్ వీడినయట్టి నన్ను,
శస్త్రపాణులు కౌరవుల్ చంపిరేని,
అదియ మిక్కిలి క్షేమంబటంచునెంతు. 46

సంజయుఁడిట్లనియె:-

*ఇట్లు వచియించి పార్థుఁడు కృష్ణుతోడ,
దుఃఖపరితప్త చిత్తంబుతోడ నపుడు
శరయుతంబగు చాపమ్ము జాఱవిడిచి,
రథముపైఁగూలఁ బడియె, [3]ధరాతలేశ! 47

ఇది ఉపనిషత్ప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు యోగశాస్త్రంబును
శ్రీ కృష్ణార్జున సంవాదంబును నగు శ్రీ మద్భగవద్గీతలందు
అర్జున విషాదయోగంబను ఒకటవ అధ్యాయము.

---

1. రాజ్యసుఖమునందలి పేరాసచే. 2. పాపము.

*కృష్ణునింగని యర్జునుండిట్లుపలికె.

3. రాజా (ధృతరాష్ట్రమహారాజా)



# శ్రీమద్భగవద్గీతా

## ద్వితీయోఽధ్యాయః

### -: సాంఖ్యయోగః :-

సంజయ ఉవాచ :-

తం తథా కృపయావిష్ట
మశ్రుపూర్ణాకులేక్షణమ్।
విషీదంతమిదం వాక్య
మువాచ మధుసూదనః॥ ౧

శ్రీభగవానువాచ :-

కుతస్త్వా కశ్మలమిదం
విషమే సముపస్థితమ్।
అనార్యజుష్టమస్వర్గ్య
మకీర్తికరమర్జున! ॥ ౨

క్లైబ్యం మాస్మ గమః పార్థ!
నైతత్త్వయ్యుపపద్యతే।
క్షుద్రం హృదయదౌర్బల్యం
త్యక్త్వోత్తిష్ఠ పరంతప! ॥ ౩

అర్జున ఉవాచ :-

కథం భీష్మమహం సంఖ్యే
ద్రోణం చ మధుసూదన! ।
ఇషుభిః ప్రతియోత్స్యామి
పూజార్హావరిసూదన! ॥ ౪

ఓమ్

# గీతాసుధాలహరి

## రెండవ అధ్యాయము

### -: సాంఖ్యయోగము :-

సంజయుఁడిట్లనియె :-

[1]అశ్రుపూర్ణాకులేక్షణుండగుచు, నట్లు
పరమ కరుణార్ద్రచిత్తుఁడై పరితపించు.
పాండుసుత మధ్యమునివంతఁ బాఱఁజూచి
ఇవ్విధంబుగఁ బలికె శ్రీకృష్ణుఁ డపుడు. 1

భగవానుఁడిట్లనియె :-

అకట ! అజ్ఞానులకు సేవ్యమగుచు, నెపుడు
[2]నాకపథమునకవరోధమైన, అపయ
శస్కరంబైన నిట్టి [3]కశ్మలము పార్థ !
ఈవిషమసమయాన, నీకెట్టులబ్బె ? 2

ఓయి ఫల్గున, [4]క్లైబ్య మొందవలదు
పనికిరాదది నీ వంటివానికెపుడు
పరమ నీచమౌ హృదయ దౌర్బల్యమెల్లఁ
బాఱఁదోలి లేలెమ్ము ! భీభత్స ! యనికె. 3

అర్జునుఁడిట్లనియె:-

అచ్యుతా ! నాచఁబూజింప. నర్హులైన
ద్రోణభీష్మాది గురులపైఁదొడరి. యుద్ధ
మెవ్విధి శరములను గురియించి. నేను
ప్రతిఘటింపఁగలాఁడను భండనమున ? 4

---

1: కన్నీటితో నిండి వ్యాకులములైన నేత్రములుగలవాడై.

2. స్వర్గ మార్గమునకు అటంకమైన; 3. మోహము; 4. పిరికితనము

గురూనహత్వా హి మహానుభావాన్
శ్రేయోభోక్తుం భైక్ష్యమపీహ లోకే।
హత్వార్థకామాంస్తు గురూనిహైవ
భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్॥ ౫

న చైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః।
యానేవ హత్వా న జిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః॥ ౬

కార్పణ్య దోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢ చేతాః।
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్॥ ౭

న హి ప్రపశ్యామి మమాపనుద్యాద్
యచ్ఛోకముచ్ఛోషణ మింద్రియాణామ్।
అవాప్యభూమావసపత్నమృద్ధం
రాజ్యం సురాణామపి చాధిపత్యమ్॥ ౮

సంజయ ఉవాచ :-

ఏవముక్త్వా హృషీకేశం
గుడాకేశః పరంతపః।
న యోత్స్య ఇతి గోవింద
ముక్త్వా తూష్ణీం బభూవ హ॥ ౯

గురువుల, మహానుభావులఁగూల్చుకంటె
నవనిఁబరికింప భిక్షాన్నమైన మేలు;
*గురుల, నర్థకామాలకై కూల్చి, యెట్లు
కుడుతు నింక ఆ నెత్తురుకూడు కృష్ణ ? 5

ఎవ్వరింజంపి మనలేమొ ? ఎదుటనదిగొ
వారె-ధార్తరాష్ట్రులు నిల్చినారు కనుమ !
**మనము పోరాడవలయునో: మానవలెనొ?
ఎవ్వరిజయంబు శ్రేయమో? ఎఱుఁగఁజెపుము ! 6

అమిత[1]కార్పణ్యదోషోపహతుఁడనగుటఁ
దెలియనేరక ధర్మమర్థించుచుంటి ;
శిష్యుఁడనుగాన, నిశ్చితశ్రేయమేదియొ
చెప్పుమా! [2]ప్రపన్నుండ, శాసించి నన్ను. 7

అఖిలభూలోకసామ్రాజ్యమబ్బెనేని,
దేవతాధిపత్యంబు సిద్ధించెనేని,
ఇంద్రియంబుల దహియించు నిట్టిశోక
మే విధమున శాంతిఁగనునో? ఎఱుఁగఁజాల! 8

సంజయుఁడిట్లనియె:-
అరిభయంకరుఁడైనట్టి యర్జునుండు
మధునిషూదనుతోడ నిమ్మాడ్కిఁబలికె,
[3]అతివిషాదాకులహృదయుఁడగుచు నపుడు
యుద్ధమొనరింప లేనంచు నూరకుండె. 9

*అర్థకాముల గురువుల హతమొనర్చి ♦ కుడుతునెవ్విధి నెత్తురుకూడు? కృష్ణ!

**మనముగెల్తుమో? వారలే మనలగెల్తు ♦ రో? యెఱుఁగ, నిందుయుక్తమేదో వచింపు.

1. కృపణత్వము (ఆత్మజ్ఞాన శూన్యత) అను దోషముచే కొట్టుబడినవాఁడనగుటచేత
2. శరణుపొందినవాఁడ; 3. అమితమగు దుఃఖముచేత చెదరిన హృదయముగలవాఁడు.

తమువాచ హృషీకేశః
ప్రహసన్నివ భారత! ।
సేనయోరుభయోర్మధ్యే
విషీదంతమిదం వచః ॥ ౧౦

శ్రీభగవానువాచ :-

అశోచ్యానన్వశోచస్త్వం
ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
గతాసూనగతాసూంశ్చ
నానుశోచంతి పండితాః ॥ ౧౧

నత్వేవాహం జాతు నాసం
న త్వం నేమే జనాధిపాః।
నచైవ న భవిష్యామః
సర్వే వయమతః పరమ్॥ ౧౨

దేహినోఽస్మిన్ యథా దేహే
కౌమారం యౌవనం జరా।
తథా దేహాంతరప్రాప్తిః
ధీరస్తత్ర న ముహ్యతి॥ ౧౩

మాత్రాస్పర్శాస్తు కౌంతేయ!
శీతోష్ణసుఖదుఃఖదాః ।
ఆగమాపాయినో నిత్యా
స్తాంస్తితిక్షస్వ భారత! ॥ ౧౪

అతుల నుభయసైన్యముల మధ్యమున నిలిచి,
పార్థివా! దుఃఖభరమునఁబరితపించు
క్రీడిఁ, గ్రిగంటఁగనుఁగొని, కృష్ణుఁడపుడు
పరిహసించుచు నతనితోఁబలికె నిట్లు. 10

భగవానుఁడిట్లనియె:-

వగవఁదగనట్టివారికి వగచెదీవు
*పండితునివోలె, ప్రజ్ఞలు బలికినావు,
వగవరెన్నఁడు పండితుల్ వసుదలోన
ఉన్న చన్నవారినిగూర్చి, యో కిరీటి ! 11

నేను లేకుండుటనునది లేనెలేదు.
నీవు లేవనుమాటయు నిజముగాదు
ఈ వసుమతీశ్వరులు, మనమెల్లరమును
లేకపోవుట యనునది లేనెలేదు. 12

దేహి యేరీతిఁబడయు నీదేహమందు.
**పార్థ ! కౌమార, యౌవన, వార్ధకముల
నటులె దేహాంతరప్రాప్తి నందుచుండు
దీనికిన్ మోహమొందఁడు, ధీరుఁడెపుడు. 13

[1]పంచతన్మాత్రవిషయ సంబంధమునను.
బడమి శీతోష్ణ సుఖదుఃఖముల్ జనించు.
[2]ఆగమాపాయినులు, ననిత్యములునైన
వానినెల్ల, నీవు సహింపవలయుఁబార్థ! 14

---

*పలుకుచుంటివి, యెన్నెన్నొ పల్గెలిపుడు

**బాల్య యౌవన కౌమార వార్ధకముల

1 శబ్దస్పర్శరూపరసగంధములనెడు విషయములతో ఇంద్రియములకేర్పడు సంయోగము. 2 రాకపోకలు గలిగినవి

యం హి న వ్యథయన్త్యేతే
పురుషం పురుషర్షభ ।
సమదుఃఖసుఖం ధీరం
సోఽమృతత్వాయ కల్పతే ॥ ౧౫

నాసతో విద్యతే భావో
నాభావో విద్యతే సతః ।
ఉభయోరపి దృష్టోఽన
స్త్వనయోస్తత్త్వదర్శిభిః ॥ ౧౬

అవినాశి తు తద్విద్ధి
యేన సర్వమిదం తతమ్ ।
వినాశమవ్యయస్యాస్య
న కశ్చిత్కర్తుమర్హతి ॥ ౧౭

అంతవంత ఇమే దేహా
నిత్యస్యోక్తాః శరీరిణః ।
అనాశినోఽప్రమేయస్య
తస్మాద్యుధ్యస్వ భారత ॥ ౧౮

య ఏనం వేత్తి హంతారం
యశ్చైనం మన్యతే హతమ్ ।
ఉభౌ తౌ న విజానీతో
నాయం హంతి న హన్యతే ॥ ౧౯

న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః ।
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే ॥ ౨౦

సుఖము, దుఃఖంబు సమతను జూచునట్టి
ఏ మహాధీర పురుషునికీజగాన
వ్యథను గలిగింపవో యివి, అట్టివాఁడె
అర్హుఁడగు అమృతత్వంబు నందుకొనఁగ. 15

లేనిదానికి ఉనికది లేనెలేదు,
ఉన్నదానికి లేదు లేకుండు టెపుడు;
అర్జునా ! తత్త్వదర్శులైన వార
లీ యుభయ నిశ్చితార్థము నెఱిఁగియుంద్రు. 16

నిండియుండును దేనిచే నిఖిలజగము
లాపదార్థము నశియింపదంచు నెఱుఁగు,
మట్టి యవ్యయమౌదాని నరయ, నాశ
మొందఁజేయ నర్హుండు లేడొక్కఁడేని. 17

[2]అప్రమేయంబనాశనంబయినయట్టి
శాశ్వతంబగు నాత్మకుఁ జావులేదు;
దేహమె నశించునందుచు, దీనిఁదెలిసి,
సమరముంజేయఁ గడఁగుము, సవ్యసాచి ! 18

చంపుదానిగ, మఱియును జంపఁబడెడు
దానిగ, నెవరీ యాత్మను దలఁచువారొ,
వారలిరువురుఁ దెలియనివారె సుమ్ము;
చంపఁబడదాత్మ మఱియును జంపదెపుడు. 19

ఆత్మ, నిత్యంబు, స్థిరము, ననాదిగాన,
ఎన్నఁడును పుట్టదిది. గిట్టదెన్నఁడేని;
ఉండకుండదు, మఱలఁ దానుండరాదు,
నాశమొందదు దేహంబు నాశమైన. 20

1 మోక్షము 2 ప్రత్యక్షప్రమాణముల కగోచరమైనది

వేదావినాశినం నిత్యం
య ఏనమజమవ్యయమ్ ।
కథం స పురుషః పార్ధ !
కం ఘాతయతి హంతి కమ్ ॥ ౨౧

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥ ౨౨

నైనం ఛిందంతి శస్త్రాణి
నైనం దహతి పావకః ।
న చైనం క్లేదయన్త్యాపో
న శోషయతి మారుతః ॥ ౨౩

అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయ
మక్లేద్యోఽశోష్య ఏవ చ ।
నిత్యః సర్వగతః స్థాణు
రచలోఽయం సనాతనః ॥ ౨౪

అవ్యక్తోఽయమచింత్యోఽయ
మవికార్యోఽయముచ్యతే ।
తస్మాదేవం విదిత్వైనం
నానుశోచితుమర్హసి ॥ ౨౫

అథచైనం నిత్యజాతం
నిత్యం వా మన్యసే మృతమ్ ।
తథాపి త్వం మహాబాహో!
నైవం శోచితుమర్హసి ॥ ౨౬

అర్జునా ! [1]అవినాశనంబనుచు, [2]నవ్య
యమ్మటంచు, నిత్యమనుచు, [3]నజమటంచు
నాత్మ తత్త్వంబు నెఱిఁగిన యట్టి పురుషుఁ
డెవరి నెటుఁజంపుఁ? జంపించు నెవని తాను ? 21

జీర్ణవస్త్రంబులను విసర్జించి నరుఁడు
క్రొత్త పుట్టంబులను గట్టుకొనువిధాన
జీర్ణదేహంబులన్ వీడి, జీవుఁ డెప్పు
డన్య నవదేహములఁ బొంది యలరుచుండు. 22

ఆత్మ ఖండింపఁబడదు శస్త్రాస్త్రములను,
ఆత్మ దహియింపగాఁబడ దగ్నివలన,
జలముచేతను దడుపంగ వలనుపడదు
పవనుచేఁతను [4]శోషింపఁబడదు పార్థ ! 23

తగులఁబెట్టఁబడదు, మఱి తడుపబడదు,
ఛేద్యమొందగాఁబడదు, శోషింపఁబడదు.
[5]స్థాణువును, నచలంబును, [6]సర్వగతము
నగుచు, నిత్యం బనాదియునై తలిర్చు. 24

ఇంద్రియాదుల కెప్పుడు నెఱుకపడని,
ఇట్టి దట్టిది యంచు నూహింపరాని,
ఏ వికారముల్ లేనట్టి యిట్టి యాత్మ
తత్త్వమెఱిఁగి శోకింపఁగఁ దగదు సుమ్ము ! 25

ఇట్టి యాత్మకు చావును, పుట్టుకయును,
గలుగునంచును, నీ మదిఁ దలఁతువేని,
అప్పుడును, నీకు దుఃఖించు టనుచితమ్ము
తెలిసికొనుమయ్య ! దీని కుంతీతనూజ ! 26

---

1 నాశములేనిది 2 క్షయములేనిది 3 పుట్టుకలేనిది 4 ఎండింపబడదు
5 స్థిరమైనది 6 అంతటను వ్యాపించినది

జాతస్య హి ధ్రువో మృత్యు
ధ్రువం జన్మ మృతస్య చ ।
తస్మాదపరిహార్యేఽర్థే
న త్వం శోచితుమర్హసి ॥ ౨౭

అవ్యక్తాదీని భూతాని
వ్యక్తమధ్యాని భారత ।
అవ్యక్తనిధనాన్యేవ
తత్ర కా పరిదేవనా ॥ ౨౮

ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన
మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః ।
ఆశ్చర్యవచ్చైనమన్యః శృణోతి
శ్రుత్వాప్యేనం వేద న చైవకశ్చిత్ ॥ ౨౯

దేహీ నిత్యమవధ్యోఽయం
దేహే సర్వస్యభారత ।
తస్మాత్సర్వాణి భూతాని
న త్వం శోచితుమర్హసి ॥ ౩౦

స్వధర్మమపి చావేక్ష్య
న వికంపితుమర్హసి ।
ధర్మ్యాద్ధియుద్ధాచ్ఛ్రేయోఽన్యత్
క్షత్రియస్య న విద్యతే ॥ ౩౧

పుట్టువెన్నటికైనను గిట్టుకొఱకె,
గిట్టువెన్నటికైనను పుట్టుకొఱకె,
ఇట్టి యనివార్య విషయమందిట్లు నీవు
ఫల్గునా! దుఃఖమొందుట పాడియగునె? 27

*సర్వజీవజాలంబులున్ సవ్యసాచి!
వ్యక్తములుగావు మనకు నాద్యంతములను,
మధ్యమాత్రంబు వ్యక్తమౌ మనకు కొంత,
యింక దీనికై చింతించుటేల నీవు? 28

అద్భుతంబని వీక్షించు నాత్మనొకఁడు,
అమరనొక్కఁడు వల్కు మహాద్భుతమని,
వినును పరమాద్భుతంబని వేఱొకండు,
కాని దీని చందంబును గానరెవరు. 29

అఖిల దేహస్థితుండయి యలరుచుండు
దేహి, యెన్నఁడుఁగూడ వధింపఁబడఁడు,
కాన, నీ సర్వభూత సంఘములఁగూర్చి,
వగలఁ బొగలుట నీకింక పాడియగునె? 30

ఫల్గునా! నీ స్వధర్మంబుఁబట్టి యైన
కంపమొందుట ధర్మంబుగాదు నీకు.
ధరణి, ధర్మయుతమగు యుద్ధంబుకంటె
క్షత్రియునకింక శ్రేయంబుఁ గనఁగ నెద్ది? 31

---

*సకల భూతాళివిషయమై సవ్యసాచి!
పుట్టుటకుఁ బూర్వ మెట్టిదో బోధపడదు
అంతమును గానరాదు రవంత; నడుమ
కొంత తెలియును, దీనికై చింతయేల?

యదృచ్ఛయా చోపపన్నం
స్వర్గద్వారమపావృతమ్ ।
సుఖినః క్షత్రియాః పార్థ!
లభంతే యుద్ధమీదృశమ్ ॥ ౩౨

అథ చే త్త్వం ధర్మ్యమిమం
సంగ్రామం న కరిష్యసి ।
తతస్స్వధర్మం కీర్తిం చ
హిత్వా పాపమవాప్స్యసి ॥ ౩౩

అకీర్తించాపి భూతాని
కథయిష్యంతి తేఽవ్యయామ్ ।
సంభావితస్య చాకీర్తి
ర్మరణాదతిరిచ్యతే ॥ ౩౪

భయాద్రణాదుపరతం
మంస్యంతే త్వాం మహారథాః ।
యేషాం చ త్వం బహుమతో
భూత్వా యాస్యసి లాఘవమ్ ॥ ౩౫

అవాచ్య వాదాంశ్చ బహూన్
వదిష్యంతి తవాహితాః ।
నిందంత స్తవ సామర్థ్యం
తతో దుఃఖతరం ను కిమ్? ॥ ౩౬

హతో వా ప్రాప్స్యసి స్వర్గం
జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।
తస్మాదుత్తిష్ఠ కౌంతేయ!
యుద్ధాయ కృతనిశ్చయః ॥ ౩౭

పొఱఁదెఱచిన స్వర్గకవాటమగుచు
అప్రయత్నంబుగను ప్రాప్తమైన యిట్టి
యుద్ధమే భూమిపతులకునౌదవు, అట్టి
వారెకాదె సుఖాప్యులీవసుధలోన. 32

ధర్మవిహితమై పొందుసు దగిన యట్టి
యుద్ధ మీయది చేయంగ నొల్లవేని
ఏ యశస్సును, నీ ధర్మనిరతి, నేఁడు
పోవుటయెగాక, పాపముఁ బొందఁగలవు. 33

చెప్పుకొందురు జగతిలోఁ దప్పకెపుడు
నీదు దుష్కీర్తినింగూర్చి నిఖిలజనులు.
నరవి మాన్యునకు నపయశమ్ము కంటె
మృత్యువేమేలుగాదె? సురేంద్రతనయ! 34

ఇంతదనుక మాన్యుండవంచెంచినట్టి
యోధులకునెల్ల చులకనై పోదువీవు,
రణమునందుండి, నీవు మఱలుటనుగని
భీతిఁజెందితివంచు భావింతురింక. 35

శత్రువులు నీ పరాక్రమసరణిఁగాంచి
నిందఁగావింతు రెంతయో నిన్నుగూర్చి
పలుకఁగారాని మాటలఁ బలుకుచుందు
రెంతకంటె మించిన దుఃఖమింకఁగలదె? 36

సమరమున చచ్చితవయేని స్వర్గమబ్బు
రణమునఁగెల్తువేని సామ్రాజ్యమబ్బు,
కాన, కృతనిశ్చయుండవై కడఁగుమిపుడె
సమర మొనరింపఁగానీవు, సవ్యసాచి! 37

సుఖదుఃఖే సమే కృత్వా
లాభాలాభౌ జయాజయౌ ।
తతో యుద్ధాయ యుజ్యస్వ
నైవం పాపమవాప్స్యసి ॥ ౩౮

ఏషా తేఽభిహితా సాంఖ్యే
బుద్ధిర్యోగే త్విమాం శృణు ।
బుద్ధ్యా యుక్తో యయా పార్థ !
కర్మబంధం ప్రహాస్యసి ॥ ౩౯

నేహాభిక్రమనాశోఽస్తి
ప్రత్యవాయో న విద్యతే ।
స్వల్పమప్యస్య ధర్మస్య
త్రాయతే మహతో భయాత్ ॥ ౪౦

వ్యవసాయాత్మికా బుద్ధి
రేకేహ కురునందన! ।
బహుశాఖా హ్యనంతాశ్చ
బుద్ధయోఽవ్యవసాయినామ్ ॥ ౪౧

యామిమాం పుష్పితాం వాచం
ప్రవదన్త్యవిపశ్చితః ।
వేదవాదరతాః పార్థ !
నాన్యదస్తీతి వాదినః ॥ ౪౨

కామాత్మానస్స్వర్గపరా
జన్మకర్మఫలప్రదామ్ ।
క్రియావిశేషబహుళాం
భోగైశ్వర్యగతిం ప్రతి ॥ ౪౩

భోగైశ్వర్యప్రసక్తానాం
తయాపహృతచేతసామ్ ।
వ్యవసాయాత్మికా బుద్ధిః
సమాధౌ న విధీయతే ॥ ౪౪

పార్థ! సుఖదుఃఖముల, జయాపజయములను,
లాభనష్టమ్ములెల్లఁ దలంచి నీవు
సమముగా, సంతి యుద్ధంబు సలుపవెమ్మి
దానఁబడయవు పాపమింతయును నీవు. 38

ఇంతవఱకు [1]సద్బుద్ధి నీకెఱుఁగఁజేయ
[2]సాంఖ్యమును జెప్పినాఁడను. సవ్యసాచి!
కర్మబంధమ్ము వదలింపఁగలుగు, బుద్ధి
నెఱుఁగఁజేసెడి యోగమ్ము నింక వినుము! 39

లే[3]దభిక్రమనాశంబు, లేదు లేదు
[4]ప్రత్యవాయము దీన నెవ్వానికేని,
అల్పమైన ఈ [5]యోగమనల్పమైన
[6]సంసరణభీతి మాన్పి, రక్షణము సేయు. 40

అర్జునా! కర్మయోగంబునందు ఆత్మ
చింతనాపరంబగు బుద్ధి వెలుఁగునొకటె:
అవినిశ్చయాత్మకమైనబుద్ధులెన్నొ
వివిధశాఖోపశాఖలై విస్తరిల్లు. 41

విజయ! వేదార్థవాదాలఁ బ్రీతిఁగలిగి
కామములయందు మనసును గలుగువారు
స్వర్గమునకంటె మించినఫలము సున్న
యనుచుఁ జెప్పు సుపుష్పితమైనవాక
జన్మ. కర్మఫలముల. ఐశ్వర్య భోగ
ముల నొసంగెడు బహువిధములగు కర్మ
ముల విశేషాలఁబోధించు మూఢమతుల
పుష్పలంబోలు పలుకుల మోసపోయి
వసుధ నడయాడు నాభోగభాగ్యలకును
నిశ్చయాత్మకబుద్ధి జనించుటరుదు. 42. 43. 44

---

1 జ్ఞానము 2 ఆత్మతత్త్వజ్ఞానమును దెలుపు కపిలమహర్షికృత సాంఖ్యయోగము
3 ప్రారంభనాశనము 4 విరుద్ధఫలితము 5 కర్మయోగము 6 సంసారభయము.

త్రైగుణ్యవిషయా వేదా
నిస్త్రైగుణ్యో భవార్జున ।
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో
నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥ ౪౫

యావానర్థ ఉదపానే
సర్వతస్సంప్లుతోదకే ।
తావాన్ సర్వేషు వేదేషు
బ్రాహ్మణస్య విజానతః ॥ ౪౬

కర్మణ్యేవాధికారస్తే
మా ఫలేషు కదాచన ।
మా కర్మఫలహేతుర్భూః
మా తే సఙ్గోఽస్త్వకర్మణి ॥ ౪౭

యోగస్థః కురు కర్మాణి
సంగం త్యక్త్వా ధనంజయ ।
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా
సమత్వం యోగ ఉచ్యతే ॥ ౪౮

దూరేణహ్యవరం కర్మ
బుద్ధియోగాద్ధనంజయ ।
బుద్ధౌ శరణమన్విచ్ఛ
కృపణాః ఫలహేతవః ॥ ౪౯

విజయ ! వేదముల్ [1]త్రైగుణ్యవిషయకములు,
త్రిగుణములకు, ద్వంద్వములకతీతుఁడవయి,
నిత్యసత్త్వాశ్రయుండవై, నీవు, [2]వీడి
యోగమును క్షేమమును, [3]ఆత్మయోగివగుమ ! 45

నిండి యెల కడలను నీరుండ, నూతి
వలన నేలాటి లాభంబు గలుగు, నంతె
బ్రహ్మవిజ్ఞానవేత్తయౌ బ్రాహ్మణునకుఁ
గలుగుఫలము, వేదంబులవలన పార్థ ! 46

కర్మమందదికారంబు గలదు గాని,
తత్ఫలమునందు లేదు సుంతయును నీకు,
కర్మఫల కారణుండవుగాకుమీవు,
ఉండఁబోకు, కర్మలఁజేయకుండ, పార్థ ! 47

[4]సిద్ధ్యసిద్ధుల యెడ, సమస్థితి వహించి
[5]సంగరహితుండవై నీవు, సంతతంబు
నాచరింపు కర్మల, యోగమందు నిలిచి,
[6]సమతనే యోగమందురు; సవ్యసాచి ! 48

కామ్యవిరహిత, బుద్ధియోగంబు కంటె
కామ్యకర్మము హేయమౌ గాదె జగతి?
ఫలముఁగోరెడువారు [7]కృపణులు; కాన,
అర్జునా ! బుద్ధియోగంబె, ఆశ్రయింపు. 49

---

*1 త్రిగుణాత్మకములగు సంసారసంబంధమైనవి 2 యోగక్షేమములయందు దృష్టిలేక అనగా లేనిదానిని పొందుట, ఉన్నదానిని కాపాడుకొనుటఅనురెండునులేక 3 ఆత్మజ్ఞాని 4 ప్రాప్తాప్రాప్తములందు 5 అభిమానములేనివాడవై 6 సమబుద్ధి 7 అల్పులు.*

ఎపుడు [1]బుద్ధియోగంబుతో నెసఁగువాఁడు
పాపపుణ్యంబు లిహమునఁ బాయఁగలఁడు.
కాన, యత్నింపు బుద్ధియోగంబునందు.
కర్మములఁ గౌశలంబె యోగంబు పార్థ ! 50

బుద్ధియుక్తులౌ జ్ఞానులు పుడమిలోన
కర్మఫలముల నెల్ల త్యాగంబొనర్చి
[2]జన్మబంధవిర్ముక్తులై, సవ్యసాచి !
అందుకొనెద [3]రనామయంబగు పదంబు. 51

ఎపుడు తావక బుద్ధి మోహితముగాదొ
అపుడు నీవు, వినవలసినట్టి, విన్న
యట్టి వానినెల్లను గూర్చి, అవనిలోన
అప్పుడంబుగ వైరాగ్య మందఁగలవు. 52

వేదవిహిత వాక్యంబుల వినుట చేత
చలనమొందు నీబుద్ధి నిశ్చలత నెప్పు
డా సమాధిలో సంలీనమై నిలుచు,
అప్పుడే నీవు యోగంబు నందఁగలవు. 53

అర్జునుఁడిట్లనియె:-

ఓ మహాత్మ ! సమాధియందున్న యట్టి
ఆ స్థితప్రజ్ఞు లక్షణంబౌర ! ఏమి ?
ఎట్లు వర్తించు. మరి యది యేమిపలుకు ?
ఎట్టులుండు నటంచు నా కెఱుఁగఁజెపుము. 54

1 సమత్వబుద్ధితో కూడిన నిష్కామ కర్మయోగము 2 జన్మమను బంధమునుండి విడుదలయినవారై అనగా జన్మరాహిత్యులై 3 దుఃఖరహితమైన స్థానమును.

శ్రీభగవానువాచ:-

ప్రజహాతి యదా కామాన్
సర్వాన్ పార్థ! మనోగతాన్ ।
ఆత్మన్యేవాత్మనా తుష్టః
స్థితప్రజ్ఞ స్తదోచ్యతే ॥ ౫౫

దుఃఖేష్వనుద్విగ్నమనా
స్సుఖేషు విగతస్పృహః ।
వీతరాగభయక్రోధః
స్థితధీర్మునిరుచ్యతే ॥ ౫౬

యస్సర్వత్రానభిస్నేహ
స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్ ।
నాభినన్దతి న ద్వేష్టి
తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ౫౭

యదా సంహరతేచాయం
కూర్మోఽఙ్గానీవ సర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్య
స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ౫౮

విషయా వినివర్తంతే
నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోఽప్యస్య
పరం దృష్ట్వా నివర్తతే ॥ ౫౯

యతతోహ్యపి కౌంతేయ!
పురుషస్య విపశ్చితః ।
ఇంద్రియాణి ప్రమాథీని
హరంతి ప్రసభం మనః ॥ ౬౦

భగవానుఁడిట్లనియె:-

మనసునందుండు కోరికల్మాని యెవఁడు
[1]ఆత్మచేతను తాఁ బ్రత్యగాత్మయందు
సంతతంబును లీనమై సంతసించు
నట్టి వాని [2]స్థితప్రజ్ఞుఁ డంద్రు విజయ! 55

కలఁతఁ జెందక యెట్టి దుఃఖముల యందు,
ఆశ బొందక యెట్టి సౌఖ్యముల యందు,
[3]వీతరాగభయక్రోధుఁడై తలిర్చు
నట్టి [4]మునినె స్థితప్రజ్ఞుఁడంద్రు పార్థ! 56

లేక యభిమాన మెందును లేశమేని
భువి శుభాశుభఫలములఁ బొందినపుడు
మోదఖేదంబులెఱుఁగక పొలుచువాని
ప్రజ్ఞయే [5]ప్రతిష్ఠితమగు పాండుతనయ! 57

అన్నివైపుల నుండి తా నంగములను
కూర్మ మేరీతిగ, ముడుచుకొనునొ, అటులె
ఎల్ల విషయంబులందుండి, యింద్రియముల
కరము మఱలించు వాఁడు, సుస్థిరుఁడు పార్థ! 58

ధర నిరాహారుఁడగు దేహధారి కరయ
విషయములు వీడు, వీడదు విషయవాంఛ;
ఎట్టి రాగంబుఁగూడ నివృత్తినొందు
ఆత్మఁబరమాత్మఁగాంచిన యంతలోన. 59

ఆత్మసిద్ధికై యత్నించునట్టి, యెట్టి
పండితునిఁగాని, మిక్కిలి భ్రమనుగొలిపి
మథనమునుచేసి యాతని మానసమును,
ఇంద్రియమ్ములు, బలిమిమై నీడ్చుచుండు. 60

---

1 తాను తనయాత్మయందు 2 బ్రహ్మజ్ఞాని 3 అనురాగము, భయము, కోపము తొలగినవాడు 4 ఆత్మ మననశీలుని 5 స్థిరతరమైనది.

తాని సర్వాణి సంయమ్య
యుక్త ఆసీత మత్పరః ।
వశే హి యస్యేంద్రియాణి
తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ౬౧

ధ్యాయతో విషయాన్ పుంసః
సంగస్తేషూపజాయతే ।
సంగాత్సంజాయతే కామః
కామాత్క్రోధోఽభిజాయతే ॥ ౬౨

క్రోధాద్భవతి సమ్మోహః
సమ్మోహాత్ స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో
బుద్ధినాశాత్ప్రణశ్యతి ॥ ౬౩

రాగద్వేషవియుక్తైస్తు
విషయానింద్రియైశ్చరన్ ।
ఆత్మవశ్యైర్విధేయాత్మా
ప్రసాదమధిగచ్ఛతి ॥ ౬౪

ప్రసాదే సర్వదుఃఖానాం
హానిరస్యోపజాయతే ।
ప్రసన్నచేతసో హ్యాశు
బుద్ధిః పర్యవతిష్ఠతి ॥ ౬౫

నాస్తి బుద్ధిరయుక్తస్య
న చాయుక్తస్య భావనా ।
న చాభావయతః శాంతి
రశాంతస్య కుతస్సుఖమ్? ॥ ౬౬

అట్టి సర్వేంద్రియముల [1]సంయమ మొనర్చి,
యోగియై [2]మత్పరుండౌచు నుండవలయు;
ఎవని స్వాధీనమందుండు నింద్రియంబు
లతని ప్రజ్ఞనె సుస్థిరమంద్రు పార్థ! 61

విషయచింతనవలన పూరుషునకెపుడు
ప్రభవమొందును సంగంబు వానియందె,
సంగమును బట్టి కామంబు సంభవించు,
కామమునుబట్టి క్రోధంబు గలుగుచుండు. 62

అట్టి క్రోధంబువలన మోహంబుపుట్టు
మోహమున స్మృతివిభ్రమంబు జనియించు,
స్మృతియడంగిన బుద్ధినశించిపోవు;
బుద్ధినశియింప, భ్రష్టుఁడై పోవు తానె. 63

రాగవిద్వేషసంబంధరహితమైన
ఆత్మవశ్యంబులౌ, ఇంద్రియములచేత,
అవని, నిగ్రహాత్ముఁడు, [3]విషయానుభోక్త
యయ్యు, [4]నిర్మలభావంబు నందుచుండు. 64

ఇట్టి నిర్మలచిత్తున కట్టె తృటిలొ
సర్వదుఃఖంబులొక్కటసమసిపోవు.
నిర్మలస్వాంతునకు, పార్థ! నిశ్చయముగ
స్థిరమగుచు, బుద్ధి వెలయును, శీఘ్రముగను. 65

యోగవిరహితునకు బుద్ధి యుండఁబోదు.
[5]భావనాశక్తి శూన్యమౌ వాని కపుడు.
భావనాశూన్యునకు శాంతిఁబడయరాదు
శాంతి లేకున్న నింకెట్లు సౌఖ్య మబ్బు? 66

---

*1 నిగ్రహించి 2 నాయందెలగ్నమయిన చిత్తముగలవాఁడై 3 విషయముల ననుభవించువాఁడయ్యూ 4 మనశ్శాంతిని 5 ఆత్మచింతన.*

ఇంద్రియాణాం హి చరతాం
యన్మనోఽనువిధీయతే ।
తదస్య హరతి ప్రజ్ఞాం
వాయుర్నావమివాంభసి ॥ ౬౭

తస్మాద్యస్య మహాబాహో!
నిగృహీతాని సర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్య
స్తస్య ప్రజ్ఞాప్రతిష్ఠితా ॥ ౬౮

యా నిశా సర్వ భూతానాం
తస్యాం జాగర్తి సంయమీ ।
యస్యాం జాగ్రతి భూతాని
సా నిశా పశ్యతో మునేః ॥ ౬౯

ఆపూర్యమాణమచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశంతి యద్వత్ ।
తద్వత్కామాయం ప్రవిశంతి సర్వే
స శాంతిమాప్నోతి న కామకామీ ॥ ౭౦

విహాయ కామాన్ యస్సర్వాన్
పుమాంశ్చరతి నిస్స్పృహః ।
నిర్మమో నిరహంకారః
స శాంతిమధిగచ్ఛతి ॥ ౭౧

ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ!
నైనాం ప్రాప్య విముహ్యతి ।
స్థిత్వాఽస్యామంతకాలేఽపి
బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥ ౭౨

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే సాంఖ్యయోగోనామ ద్వితీయోఽధ్యాయః

ఎల్లవిషయములఁజరించు, నింద్రియముల
ననుసరించు నెవ్వనిమన, మా మనంబు
మనుజుబుద్ధిహరించును, మారుతంబు
జలము నందలి నావను కలఁచుమాడ్కి. 67

అర్జునా ! అందువలన ఈ యవనిలోన
ఎల్లవిషయంబులందుండి, యింద్రియముల
నిఖిలవిధముల నెవ్వఁడు నిగ్రహించు
నతని ప్రజ్ఞ ప్రతిష్ఠితమై తలిర్చు. 68

ఎల్ల భూతంబులకు రాత్రి యేది యగునొ
అదియె సంయమి మేల్కొను నట్టివేళ,
సకలభూతముల్ మేల్కొను సమయ మరయ
బ్రహ్మవేత్తకు నెప్పుడు రాత్రియగును. 69

ఎంత నీరమ్ము చొచ్చిన నించు కేని
చలనమొందని పూర్ణమౌ జలధివోలె
విషయములు ముట్టినన్ బ్రహ్మవిదుడు, శాంతిఁ
బొందు. కామకామి యెపుడుఁ బొందలేడు. 70

సర్వకామంబులనువీడి, సవ్యసాచి !
ఇల నహంకారమమకారములు త్యజించి
నిస్పృహుండయి యెవ్వఁడు నెగడు చుండు
నట్టి మానవుఁడే శాంతి నందఁగలఁడు. 71

ఇదియె బ్రాహ్మిస్థితి యని పల్కెదరు సుమ్ము!
మోహముంజెందదీస్థితిఁబొందువాఁడు
అంత్యకాలమ్మునన్ దీని యందు నిలచు
వాఁడు బ్రహ్మనిర్వాణంబుఁ బడయఁ గలడు. 72

ఇది ఉపనిషత్ప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రంబును.
శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీమద్భగవద్గీతలందు
సాంఖ్యయోగంబను రెండవ అధ్యాయము.



# శ్రీమద్భగవద్గీతా

## తృతీయోఽధ్యాయః

### -: కర్మయోగః :-

అర్జున ఉవాచ:-

జ్యాయసీ చేత్కర్మణస్తే
మతా బుద్ధిర్జనార్దన ।
తత్కిం కర్మణి ఘోరే మాం
నియోజయసి కేశవ ॥ ౧

వ్యామిశ్రేణేవ వాక్యేన
బుద్ధిం మోహయసీవ మే ।
తదేకం వద నిశ్చిత్య
యేన శ్రేయోఽహమాప్నుయామ్ ॥ ౨

శ్రీభగవానువాచ:-

లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా
పురా ప్రోక్తా మయాఽనఘ ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం
కర్మయోగేన యోగినామ్ ॥ ౩

న కర్మణామనారంభాత్
నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।
న చ సన్న్యసనాదేవ
సిద్ధిం సమధిగచ్ఛతి ॥ ౪

న హి కశ్చిత్ క్షణమపి
జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ
సర్వః ప్రకృతిజైర్గుణైః ॥ ౫

ఓమ్

# గీతా సుధా లహరి

## మూఁడవ అధ్యాయము

### -: కర్మయోగము :-

అర్జునుఁడిట్లనియె:-

బుద్ధియే కర్మమునకంటె పుడమియందు,
ఉత్తమంబని భావించుచుందువేని,
ఇట్టి ఘోరకర్మంబునందేల ? నన్ను
మాధవా ! నియోగింతువో ? బోధపడదు. 1

కలగలుపుమాటలన్ నీవు పలికి, పలికి!
ఏల మోహంబుఁ గొల్పెద విట్లు నాకు?
ఇందు దేనిచే శ్రేయంబు నొందఁగలనొ
నీవు పల్కుమొక్కటి నాకు; నిశ్చయించి. 2

భగవానుఁడిట్లనియె:-

మునుపు నాచేత నీలోకమున కిరీటి!
ద్వివిధ నిష్ఠాక్రమంబులు దెలుపఁబడియె:
జ్ఞానయోగంబుఁ బలికితి సాంఖ్యులకును,
యోగులకు నుడివితి కర్మయోగ విధిని. 3

కర్మముల నాచరింపని కారణమునఁ
గాంచఁజాలఁడు నరుఁడు నైష్కర్మ్యసిద్ధి,
అర్జునా ! సన్న్యసించిన యంతమాత్ర
కర్మసిద్ధియు వానికిఁ గలుగఁ బోదు. 4

కర్మములఁ జేయకుండ నొక్కండుఁ గూడ
నుర్వి నెన్నఁడు క్షణమైన నుండలేడు.
ప్రకృతిజనితగుణములచే [1]సకలజనులు
ఆచరింతురు కర్మంబు [2]లవశులగుచు, 5

---

1 అజ్ఞానులైన ప్రజలు 2 అస్వతంత్రులగుచు.

కర్మేంద్రియాణి సంయమ్య
య ఆస్తే మనసా స్మరన్ ।
ఇన్ద్రియార్థాన్ విమూఢాత్మా
మిథ్యాచారస్స ఉచ్యతే ॥ ౬

యస్త్విన్ద్రియాణి మనసా
నియమ్యారభతేఽర్జున ।
కర్మేన్ద్రియైః కర్మయోగ
మసక్తస్స విశిష్యతే ॥ ౭

నియతం కురు కర్మ త్వం
కర్మ జ్యాయో హ్యకర్మణః ।
శరీరయాత్రాపి చ తే
న ప్రసిద్ధ్యేదకర్మణః ॥ ౮

యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర
లోకోఽయం కర్మబన్ధనః ।
తదర్థం కర్మ కౌన్తేయ !
ముక్తసఙ్గస్సమాచర ॥ ౯

సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా
పురోవాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వ
మేష వోఽస్త్విష్టకామధుక్ ॥ ౧౦

దేవాన్ భావయతానేన
తే దేవా భావయన్తు వః ।
పరస్పరం భావయన్తః
శ్రేయః పరమవాప్స్యథ ॥ ౧౧

ఎల్లకర్మేంద్రియముల జయించి యెవఁడు
చిత్తమున విషయంబులన్ చింతసేయు,
నట్టి మూఢు మిథ్యాచారుఁడంచు, నెపుడుఁ
బలుకుచుందురు విబుధులు, పాండుతనయ ! 6

అడఁచి మనముచే జ్ఞానేంద్రియమ్ము లెవఁడు
కడక, కర్మేంద్రియములచే కర్మయోగ
మాచరించునో, [1]నిస్సంగుఁడై ధరిత్రి,
నట్టి వానిని సుశ్రేష్ఠుఁడంద్రుబుధులు. 7

కాన, నీవు [2]నియతమగుకర్మములను
సలుపుచుండుము, కర్మముల్ సలుపకుండ
నుండుకంటెను, సల్పుటే యుత్తమంబు
సలుపక శరీరయాత్రయు జరుగదెపుడు. 8

ఎన్న, [3]యజ్ఞార్థమౌ కర్మకన్న, నన్య
కర్మము లెపుడు బంధమ్ముఁగలుగఁజేయు,
కాన, యజ్ఞార్థ మీవు సంగమునువీడి
సలుపుచుండుము కర్మముల్ జగతియందు. 9

యజ్ఞములతో ప్రజాపతి యఖిలజనుల
మునుపు సృజియించి వారితో ననియెనిటుల,
"యజ్ఞములచేత సంవృద్ధినందు: డివియె
జగతి నిష్టకామ్యంబు లొసంగు మీకు." 10

దీన నర్చింపుడీ సర్వదేవతలను,
వారు నిత్తురు మీకు మీ వాంచితములు;
ఒకరికొకరిట్లు భావించుచుందురేని
పరమపదమును నందఁబడయుఁగలరు. 11

---

*1 ఆసక్తి, లేక తగులము లేనివాఁడై 2 శాస్త్రముచే విధింపఁబడిన 3 లోకోపకారకమైన లేక భగవత్ప్రీతికరమైన.*

ఇష్టాన్ భోగాన్ హి వో దేవా
దాస్యన్తే యజ్ఞభావితాః ।
తైర్దత్తానప్రదాయైభ్యో
యో భుంక్తే స్తేన ఏవ సః ॥ ౧౨

యజ్ఞశిష్టాశిన స్సన్తో
ముచ్యన్తే సర్వకిల్బిషైః ।
భుంజతే తే త్వఘం పాపా
యే పచన్త్యాత్మకారణాత్ ॥ ౧౩

అన్నాద్భవన్తి భూతాని
పర్జన్యాదన్నసంభవః ।
యజ్ఞాద్భవతి పర్జన్యో
యజ్ఞః కర్మసముద్భవః ॥ ౧౪

కర్మ బ్రహ్మోద్భవం విద్ధి
బ్రహ్మాక్షరసముద్భవమ్ ।
తస్మాత్సర్వగతం బ్రహ్మ
నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥ ౧౫

ఏవం ప్రవర్తితం చక్రం
నానువర్తయతీహ యః ।
అఘాయురిన్ద్రియారామో
మోఘం పార్థ ! స జీవతి ॥ ౧౬

యస్త్వాత్మరతిరేవస్యా
దాత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సన్తుష్ట
స్తస్య కార్యం న విద్యతే ॥ ౧౭

యజ్ఞములచేత నర్చనలంది, వారు
సర్వకామ్యార్థముల మీకొసంగుచుంద్రు,
వారిచేఁ బడసిన వాని వారికొసఁగ
కుండ భక్షించువాఁడు చోరుండుగాడె. 12

[1]యజ్ఞశేషంబు భుజియించునట్టి వారు.
నిఖిలపాపవిముక్తులై నెగడుచుంద్రు;
పచనమొనరింతురెవ్వరు స్వార్థమునకు,
అట్టిపాపులు పాపమే యనుభవింత్రు. 13

ప్రాణులెల్లను అన్నంబువలనఁబుట్టు
వసుధ నన్నమ్ము [2]పర్జన్యువలనఁబొడము.
కలుగు పర్జన్యుఁడో యజ్ఞకారణమున
వెలయు యజ్ఞమ్ము, కర్మమ్ము వలన పార్థ! 14

ఇలను కర్మంబు బ్రహ్మంబువలనఁగలుగు,
కలుగు బ్రహ్మంబు తాను అక్షరము వలన,
సర్వగతమగు బ్రహ్మంబు సంతతంబు
యజ్ఞమందు ప్రతిష్ఠితమై తలిర్చు. 15

ఇటుల వర్తించు ఈ చక్ర మిహమునందు
అనుసరించి ప్రవర్తింపనట్టివాఁడు
ఘోర పాపమ్ముఁజేయుచు కూలబడును
విషయలోలత వ్యర్థజీవితముఁగడపి. 16

ఎవ్వఁడాత్మలో సంప్రీతినెనయుచుండు
ఎవఁడు తా నాత్మలోన సంతృప్తిఁబొందు,
ఆత్మయందెవ్వఁడానందమందుచుండు
ఆతనికి చేయఁదగిన కార్యంబె లేదు. 17

1 భగవదర్పితమై శేషించినది లేక శ్రౌతకర్మవిధించు పంచయజ్ఞశేషము 2 మేఘము.

ఏను, కర్మంబులొనరింపఁ బూననేని
సర్వలోకంబులును వినాశంబునొందు;
*ధర్మసంకరమొనరించి ధరణిలోన
ప్రజలనెల్లరఁ జెఱచినవాఁడనగుదు. 24

పామరులు ఫలాసక్తిచే వసుధనెట్లు
సలుపుచుందురో కర్మమ్ము, సవ్యసాచి!
ఆత్మవిదుఁడు, లోకోపకారార్థమట్లె
సలుపవలయు కర్మము, ఫలాసక్తి విడిచి. 25

అవని ఫలసంగులై కర్మమాచరించు
పామరులబుద్ధి కలవరపఱచకుండ,
జ్ఞాని సత్కర్మముల తాను సలుపుచుండి
వారిచేతను చేయింపవలయుఁ బార్థ! 26

ప్రకృతి, తన గుణంబులచేత వసుధలోన
సర్వవిధకర్మములఁ దానె సల్పుచుండ,
జడుఁ డహంకారమున కర్త సర్వమునకుఁ
దానె యంచును మదిలోనఁ దలఁచుచుండు. 27

ధరణి గుణకర్మవిభజన తత్త్వమెఱుఁగు
నట్టి సుజ్ఞాని, విషయంబులందు నెల్ల
ఇంద్రియంబులు వర్తించు టెఱిఁగి, వాని
యందొకింతయు ¹సంగమ్ము నొందఁ డెపుడు. 28

ప్రకృతిగుణములచే మోహబద్ధులగుచు
సవ్యసాచిరో! గుణకర్మసంగులైన
మందమతుల నల్పజ్ఞుల నెందు నేని
ఆత్మవేత్త చలింపఁజేయంగరాదు. 29

* ధరణి సంకరంబునకు కర్తనయు నేను; 1 ఆసక్తి

మయి సర్వాణి కర్మాణి
సన్న్యస్యాధ్యాత్మచేతసా ।
నిరాశీర్నిర్మమో భూత్వా
యుధ్యస్వ విగతజ్వరః ॥ ౩౦

యే మే మతమిదం నిత్య
మనుతిష్ఠన్తి మానవాః ।
శ్రద్ధావన్తోఽనసూయన్తో
ముచ్యన్తే తేఽపి కర్మభిః ॥ ౩౧

యే త్వేతదభ్యసూయన్తో
నానుతిష్ఠన్తి మే మతమ్ ।
సర్వజ్ఞానవిమూఢాంస్తాన్
విద్ధి నష్టానచేతసః ॥ ౩౨

సదృశం చేష్టతే స్వస్యాః
ప్రకృతేర్జ్ఞానవానపి ।
ప్రకృతిం యాన్తి భూతాని
నిగ్రహః కిం కరిష్యతి ॥ ౩౩

ఇంద్రియస్యేన్ద్రియస్యార్థే
రాగద్వేషౌ వ్యవస్థితౌ ।
తయోర్న వశమాగచ్ఛేత్
తౌ హ్యస్య పరిపన్థినౌ ॥ ౩౪

శ్రేయాన్ స్వధర్మో విగుణః
పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః
పరధర్మో భయావహః ॥ ౩౫

సర్వకర్మములను నీవు సవ్యసాచి!
ఆత్మవిషయకబుద్ధి నాయందెవదలి
ఆశవిడిచి, మమత్వంబు నడఁచివైచి
చింతవిడనాడి, యుద్ధమ్ము సేయలెమ్మ ! 30

శ్రద్ధగలిగి, యెవరసూయబుద్ధివీడి,
ఎల్లవేళలయందు నా యీమతమ్ము
ననుసరింతురో, వారలీ యవనిలోన
కర్మనిర్ముక్తులగుట నిక్కమ్ముసుమ్మ. 31

ఎవరసూయచే నేజెప్పు యీమతమ్ము
ననుసరింపక చరియింతురట్టివారు
జ్ఞానశూన్యులు, బుద్ధివిహీనులగుచు
భ్రష్టులై పోదు రియ్యది వాస్తవమ్మ. 32

జ్ఞానముఁగలట్టివాఁడును, సవ్యసాచి!
తన ప్రకృతి కనుగుణంబుగఁదానునడచు,
*ప్రకృతినే యాశ్రయించిన ప్రాణికోట్లు
ప్రకృతిని జయింప నేర వెప్పాటనేని. 33

కలుగు రాగవిద్వేషముల్ దలఁప నింద్రి
యముల కెప్పుడు నింద్రియార్థములయందు,
వశము కారాదు వానికెవండుగాని,
అవియె నరునకు పరమశత్రువులు సుమ్మ! 34

స్వీయధర్మంబె శ్రేయంబు విగుణమేని,
రమ్యముగసల్పు నన్యధర్మంబుకంటె;
మరణమైన మేలగు స్వధర్మంబునందె:
అన్యధర్మంబు మిగుల భయావహంబు. 35

* ప్రకృతి ననుసరించి చరించుఁ బ్రాణికోటు ♦ లింక నింద్రియ నిగ్రహంబేమిసేయు?

అర్జున ఉవాచ:-

అథ కేన ప్రయుక్తోఽయం
పాపం చరతి పూరుషః ।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ
బలాదివ నియోజితః ॥ ౩౬

శ్రీభగవానువాచ:-

కామ ఏష క్రోధ ఏష
రజోగుణసముద్భవః ।
మహాశనో మహాపాప్మా
విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥ ౩౭

ధూమేనావ్రియతే వహ్నిః
యథాఽఽదర్శో మలేన చ ।
యథోల్బేనావృతో గర్భః
తథా తేనేదమావృతమ్ ॥ ౩౮

ఆవృతం జ్ఞానమేతేన
జ్ఞానినో నిత్యవైరిణా ।
కామరూపేణ కౌంతేయ
దుష్పూరేణానలేన చ ॥ ౩౯

ఇంద్రియాణి మనో బుద్ధిః
అస్యాధిష్ఠానముచ్యతే ।
ఏతైర్విమోహయత్యేష
జ్ఞానమావృత్య దేహినమ్ ॥ ౪౦

అర్జునుఁడిట్లనియె:-

ప్రీతిలేకున్నను బలాత్కరింపఁబడుచు
తాను నిర్బంధితుండగు వానివోలె
పాపములసల్పు పురుషుండు, వాఁడు దేని
చేతఁ బ్రేరింపబడును, వచింపుమనఘ! 36

భగవానుఁడిట్లనియె:-

జగతిని రజోగుణంబున జనన మొంది
తనివిఁదీరని తిండితోఁ దనరి, క్రోధ
పాపభూయిష్ఠమై ధరఁ బరగు నట్టి
కామమే వైరి యోగ మార్గమున నెపుడు. 37

వహ్ని పొగచేత నెట్లు కప్పంగఁబడునో,
అద్దమున కెట్లు మాలిన్యమావరించు,
గర్భ మెట్టుల మావిచేఁ గప్పు వడునో
*కామ మట్టులె జ్ఞానమున్ గప్పు చుండు. 38

అవని నెన్నఁడు పూరింప నలవి గాక
లేశమును తృప్తి యనుమాట లేనిదగుచు.
జ్ఞానులౌవారికెన్ నిత్యశత్రువైన
యట్టి కామమ్ము జ్ఞానమ్ము నావరించు. 39

మనసు నింద్రియంబులు బుద్ధియును దలంప
కామమున కాశ్రయమ్ములౌ గాన; కామ
మౌర! వీనిచే జ్ఞానంబునావరించి,
మోహమున ముంచుచుండును దేహి నెపుడు. 40

---

* అట్టులే జ్ఞానమున్ కామమావరించు.

అందుచే, అప్రమత్తుండవౌచు, ముందు
నీవు నీ యింద్రియమ్ముల నిగ్రహించి,
జ్ఞాన విజ్ఞాన నాశకంబైన యట్టి
పాపరూపకామము రూపుమాపవలయు. 41

దేహమునకన్న మిన్న యింద్రియగణంబు
మనసు వాని కంటెను గొప్ప, మనసుకన్న
బుద్ధి శ్రేష్ఠంబు, ఫల్గునా! బుద్ధికంటె
*ఆత్మ సుశ్రేష్ఠమని యెంచు రవని యందు. 42

[1]ఇట్టి యాత్మతత్త్వంబు నీవింక నెఱిగి
నెమ్మనంబును ఆత్మచే నిగ్రహించి,
నేమమున, [2]దురాసదమైన, కామరూప
శత్రువుని సంహరింపుము, సవ్యసాచి! 43

ఇది ఉపనిషత్ప్రతిపాదంబును బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రంబును,
శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీమద్భగవద్గీతలందు
కర్మయోగంబను మూడవ అధ్యాయము.

---

*అధికముగను సాక్షీభూతమైన యాత్మ. *1* బుద్ధికంటె నతీతమైన పరమాత్మ తత్త్వము
2 నిగ్రహింపరాని



# శ్రీమద్భగవద్గీతా

## చతుర్థోఽధ్యాయః

### -: జ్ఞానయోగః :-

శ్రీభగవానువాచ:-

ఇమం వివస్వతే యోగం
ప్రోక్తవానహమవ్యయమ్ ।
వివస్వాన్ మనవే ప్రాహ
మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥ ౧

ఏవం పరంపరాప్రాప్తం
ఇమం రాజర్షయో విదుః ।
స కాలేనేహ మహతా
యోగో నష్టః పరంతప ॥ ౨

స ఏవాయం మయా తేఽద్య
యోగః ప్రోక్తః పురాతనః ।
భక్తోఽసి మే సఖా చేతి
రహస్యం హ్యేతదుత్తమమ్ ॥ ౩

అర్జున ఉవాచ:-

అపరం భవతో జన్మ
పరం జన్మ వివస్వతః ।
కథమేతద్విజానీయాం
త్వమాదౌ ప్రోక్తవానితి ॥ ౪

ఓమ్

# గీతాసుధాలహరి

## నాల్గవ అధ్యాయము

### -: జ్ఞానయోగము :-

భగవానుఁడిట్లనియె:-

[1]అవ్యయంబైన యీ యోగ మా [2]వివస్వ
తునకుఁ దెల్పితిని, వివస్వతుండు దీని
మనువునకుపదేశించె, ఆ మనువు దీని
నెఱుక పఱచె నిక్ష్వాకుధాత్రీశునకును. 1

ఫల్గునా! పరంపరగను వచ్చు దీని
నెఱుఁగఁజాలిరి రాజర్షులెల్ల మున్ను;
కాలమెంతయు ఈరీతిఁ గడచి చనఁగ
అంతరించెను ఈయోగ మవని లోన. 2

అటుల నెంతో పురాతనమై చెలంగు
అతిరహస్యమ్ము, శ్రేష్ఠమ్ము నైన దీని
భక్తుఁడవు, సఖుండవుఁ గాన పాండుతనయ!
ఎఱుఁగఁబల్కితి నీకునే, యిపుడు నేను. 3

అర్జునుఁడిట్లనియె:-

ఎన్న సూర్యుండు నీకన్న మున్ను బుట్టె
నీవు తరువాతివాఁడవు, నీవదెట్లు
లతని కెఱిఁగించితివి దీని నాదియందు?
నమ్మ శక్యము గాదిది నాకు, కృష్ణ! 4

---

1 నాశరహితమైన; 2 సూర్యుఁడు

శ్రీభగవానువాచ:-

బహూని మే వ్యతీతాని
జన్మాని తవ చార్జున! ।
తాన్యహం వేద సర్వాణి
న త్వం వేత్థ పరంతప! ॥

అజోఽపిసన్నవ్యయాత్మా
భూతానామీశ్వరోఽపిసన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ
సంభవామ్యాత్మమాయయా ॥

యదా యదా హి ధర్మస్య
గ్లానిర్భవతి భారత! ।
అభ్యుత్థానమధర్మస్య
తదాత్మానం సృజామ్యహమ్ ॥

పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే ॥

జన్మ కర్మ చ మే దివ్యం
ఏవం యో వేత్తి తత్త్వతః ।
త్యక్త్వా దేహం పునర్జన్మ
నైతి మామేతి సోఽర్జున! ॥

వీతరాగభయక్రోధా
మన్మయా మాముపాశ్రితాః ।
బహవో జ్ఞానతపసా
పూతా మద్భావమాగతాః ॥

భగవానుఁడిట్లనియె:-

నీకు నాకును పూర్వమీ లోకమందు,
ఎన్నియో జన్మములు గతియించి పోయె;
వాని నన్నింటి నెఱుఁగుదు నేను, కాని
నీవెఱుంగవు సుంతయు నిశ్చయముగ. 5

అవ్యయాత్మకుండనునయ్యు [1]అజుఁడనయ్యు,
*సర్వభూతంబులకు మహేశ్వరుఁడనయ్యు,
నేను నా ప్రకృతిని నా యధీనపఱచి
ఆత్మ మాయచే జననంబు నందుచుందు. 6

ధర్మ మడుగంటి యెప్పు డధర్మమునకు
అధికమౌ వృద్ధి గల్గునో, యప్పుడెల్ల
నాదు సంకల్పబలమున, నన్ను నేను
జగతి, సృజియించు కొనుచుందు, సవ్యసాచి! 7

సాధుజనుల సంరక్షణ సలుపు కొఱకు,
అఖిల దుర్మార్గులను దునుమాడు కొఱకు,
పృథ్వి యందు ధర్మమ్ము స్థాపించుకొఱకు,
యుగయుగంబున జన్మించుచుందు పార్థ! 8

తెలియు నెవ్వఁడు నా యిట్టి దివ్యమైన
జన్మకర్మంబులను, వాఁడు సవ్యసాచి!
దేహమును త్యజించియు ఇంక తిరిగి యెపుడు
పొందనేరఁడు జన్మమ్ము; పొందు నన్నె. 9

భయము, రాగమ్ము, క్రోధమ్ము, వదలి, శరణుఁ
బొంది నన్నె, చిత్తము నాయందె యునిచి,
జ్ఞానతపమున పరిశుద్ధులైనవార
లెందరో నా స్వరూపమ్ము నొందినారు. 10

---

*1* *పుట్టుకలేనివాడు* *సకల భూతంబులకు నియామకుఁడనయ్యు*

యే యథా మాం ప్రపద్యన్తే
తాం స్తథైవ భజామ్యహమ్ ।
మమ వర్త్మానువర్తన్తే
మనుష్యాః పార్థ! సర్వశః ॥ ౧౧

కాంక్షంతః కర్మణాం సిద్ధిం
యజన్త ఇహ దేవతాః ।
క్షిప్రం హి మానుషే లోకే
సిద్ధిర్భవతి కర్మజా ॥ ౧౨

చాతుర్వర్ణ్యం మయా సృష్టం
గుణకర్మ విభాగశః ।
తస్య కర్తారమపి మాం
విద్ధ్యకర్తారమవ్యయమ్ ॥ ౧౩

న మాం కర్మాణి లిమ్పన్తి
న మే కర్మఫలే స్పృహా ।
ఇతి మాం యోఽభిజానాతి
కర్మభిర్న స బధ్యతే ॥ ౧౪

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ
పూర్వైరపి ముముక్షుభిః ।
కురు కర్మైవ తస్మాత్త్వం
పూర్వైః పూర్వతరం కృతమ్ ॥ ౧౫

కిం కర్మ కిమకర్మేతి
కవయోఽప్యత్ర మోహితాః ।
తత్తే కర్మ ప్రవక్ష్యామి
యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥ ౧౬

ఎవరెటుల నన్ను భజియింతు రేను నటులె
వారల ననుగ్రహింతును, పాండుతనయ!
మనుజు లెల్ల విధముల నా మార్గమెపుడు
ననుసరించి చరింతు రీ యవనియందు. 11

కర్మఫలసిద్ధిఁ గోరి, లోకమున మనుజు
లెల్ల దేవతలను భజియించు చుంద్రు,
కర్మఫలసిద్ధి, మనుజలోకంబునందుఁ
గలుగు చుండును గాదె శీఘ్రముగ పార్థ? 12

అవని గుణకర్మవిభజన ననుసరించి
సృష్టి చేసితి వర్ణచతుష్టయమ్ము;
కర్త నైనను, నే కర్త కానటంచు
అవ్యయుడనంచు తెలియుమీ సవ్యసాచి! 13

నన్ను కర్మంబులంటవు, నాకు తత్ఫ
లమ్ము నందిచ్ఛలేదు, లేశమ్ముఁగూడ;
ఎవఁడు నన్నిట్లు చక్కఁగా నెఱుఁగఁగలఁడొ
కర్మ బంధమ్ముల కతఁడు కట్టువడఁడు. 14

మోక్షకాములై మును మన పూర్వులెల్లఁ
దెలిసి దీనిని, కర్మముల్ సలిపినారు,
పార్థ! నీవు ననాదిగ వారొనర్చి
నట్టి కర్మంబులనె భువి నాచరింపు. 15

కర్మమెట్టిదొ? యెట్టిదకర్మమగునొ?
ఎఱుఁగ నేరరు పండితులేని సుంత
దేని నెఱిఁగిన, [1]అశుభముఁ దీఱి, ముక్తుఁ
డగుదువో దానిఁ దెల్పెద నాలకింపు. 16

1 సంసారసంబంధమైన దుఃఖములు

కర్మణోహ్యపి బోద్ధవ్యం
బోద్ధవ్యం చ వికర్మణః ।
అకర్మణశ్చ బోద్ధవ్యం
గహనా కర్మణో గతిః ॥ ౧౭

కర్మణ్యకర్మ యః పశ్యేత్
అకర్మణి చ కర్మ యః ।
స బుద్ధిమాన్మనుష్యేషు
స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥ ౧౮

యస్య సర్వే సమారంభాః
కామసంకల్పవర్జితాః ।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం
తమాహుః పండితం బుధాః ॥ ౧౯

త్యక్త్వా కర్మఫలాసంగం
నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభిప్రవృత్తోఽపి
నైవ కించిత్కరోతి సః ॥ ౨౦

నిరాశీర్యతచిత్తాత్మా
త్యక్తసర్వపరిగ్రహః ।
శారీరం కేవలం కర్మ
కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ ౨౧

ఏది [1]కర్మమో దాని నీ వెఱుఁగవలయు,
ఎఱుఁగవలయు [2]వికర్మమదేదొ నీవు,
ఎయ్యది [3]యకర్మమో దాని నెఱుఁగవలయు,
కర్మగతులఁ దెలియ దుర్ఘటము సుమ్మ. 17

కర్మమందు నకర్మ, మకర్మమందు
కర్మభావంబు నెవ్వఁడు గాంచు, నతఁడు
సకల సత్కర్మముల నవి సలుపువాఁడు
బుద్ధిమంతుండు, యోగియై పొలుచు నెపుడు. 18

కామసంకల్పవర్జితకర్ములెవరొ?
జ్ఞానపావకనిర్దగ్ధకర్ములెవరొ?
అట్టి వారిని పండితులంచు బుధులు
వ్యవహరించుచునుండురీయవనియందు. 19

సతతసంతృప్తుఁడును [1]నిరాశ్రయుఁడు నగుచు,
కర్మఫలముల యందు సంగంబు వీడి
సర్వకర్మములను లెస్స సలుపుచున్న
వాఁడె యయ్యు, నకర్ముండె వాఁడుపార్థ! 20

అఖిల సంగ్రహంబుల వీడి, ఆశ లేక
ఆత్మనిగ్రహుండయి, దేహయాత్రకొఱకె
అవని కర్మంబులను సల్పునట్టివాఁడు
పాప మిసుమంతఁ బొందఁడు, పాండుతనయ! 21

*1 విహితకర్మము 2 నిషిద్ధకర్మము 3 కర్మాభావము అనఁగా అనాసక్తముగా నాచరించుటచే కలుగు ఆత్మజ్ఞానస్థితి 1 దేనిని ఆశ్రయించనివాఁడు*

యదృచ్ఛాలాభసంతుష్టో
ద్వంద్వాతీతో విమత్సరః ।
సమస్సిద్ధావసిద్ధౌ చ
కృత్వాపి న నిబధ్యతే ౨౨

గతసంగస్య ముక్తస్య
జ్ఞానావస్థితచేతసః ।
యజ్ఞాయాచరతః కర్మ
సమగ్రం ప్రవిలీయతే ॥ ౨౩

బ్రహ్మార్పణం బ్రహ్మహవిః
బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।
బ్రహ్మైవ తేన గంతవ్యం
బ్రహ్మకర్మసమాధినా ॥ ౨౪

దైవమేవాపరే యజ్ఞం
యోగినః పర్యుపాసతే ।
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం
యజ్ఞేనైవోపజుహ్వతి ॥ ౨౫

శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే
సంయమాగ్నిషు జుహ్వతి ।
శబ్దాదీన్విషయానన్యే
ఇంద్రియాగ్నిషు జుహ్వతి ॥ ౨౬

ఎప్పుడును యదృచ్ఛాలాభతృప్తుఁడగుచు
ద్వంద్వములకతీతుఁడయి. మత్సరము వీడి
సిద్ధ్యసిద్ధుల సమబుద్ధిఁ జెలఁగువాఁడు
కర్మలొనరించెనేనియు కట్టువడడు. 22

అవని, [1]నిస్సంగుఁడై, [2]ముక్తుఁడగుచు నెపుడు
చిత్తమును జ్ఞానమంద, ఆయత్తపఱచి,
యజ్ఞములకయి, కర్మంబులాచరించు
వాని కర్మంబులవి పూర్తిగానశించు. 23

[3]యజ్ఞపాత్రంబు బ్రహ్మమే. [4]అగ్ని బ్రహ్మ.
మరయఁగ [5]హవిస్సు *బ్రహ్మంబె యగును, [6]హోత
బ్రహ్మమే- బ్రహ్మకర్మతాత్పర్యకలన
నందఁదగిన ఫలంబు, బ్రహ్మంబె సుమ్ము. 24

ఎలమిమై కర్మయోగులు సలుపుచుంద్రు
యజ్ఞముల్ దేవసంబంధమైన వాని.
ఒనర బ్రహ్మాగ్నిలో జ్ఞానయోగులెల్ల
వేల్చుచున్నారు. కర్మహవిస్సు. పార్థ! 25

ఇలను కొందఱు [7]శ్రవణముఖేంద్రియముల
[8]సంయమాగ్నిని హోమంబు సలుపుచుంద్రు
విజయ! కొందఱు శబ్దాదివిషయములను
నాచరింత్రు హోమము నింద్రియాగ్నులందు. 26

---

1 దేనియందును అభిమానము లేనివాఁడు 2 రాగద్వేషాదుల, ధర్మాధర్మసంబంధముల విడిచినవాఁడు 3 స్రుక్కు, స్రువము మున్నగు హోమసాధనములుంచిన పాత్ర 4 హోమాగ్ని 5 అగ్నిహోత్రమునందు వేల్చుటకు సిద్ధముచేయబడిన అన్నము, నేయి మొదలగు హోమద్రవ్యములు 6 హోమముచేయు ఋత్విక్కు *హుతము మఱియు హోత 7 చెవి, మొదలగు ఇంద్రియములు 8 నిగ్రహమనెడి యగ్ని.

ఎప్పుడును యదృచ్ఛాలాభతృప్తుఁడగుచు
ద్వంద్వములకతీతుఁడయి, మత్సరము వీడి
సిద్ధ్యసిద్ధుల సమబుద్ధిఁ జెలఁగువాఁడు
కర్మలొనరించెనేనియు కట్టువడఁడు. 22

అవని, [1]నిస్సంగుఁడై, [2]ముక్తుఁడగుచు నెపుడు
చిత్తమును జ్ఞానమంద, ఆయత్తపఱచి,
యజ్ఞములకయి, కర్మంబులాచరించు
వాని కర్మంబులవి పూర్తిగానశించు. 23

[3]యజ్ఞపాత్రంబు బ్రహ్మమే. [4]అగ్ని బ్రహ్మ.
మరయఁగ [5]హవిస్సు *బ్రహ్మంబె యగును, [6]హోత
బ్రహ్మమే- బ్రహ్మకర్మతాత్పర్యకలన
నందఁదగిన ఫలంబు, బ్రహ్మంబె సుమ్మ. 24

ఎలమిమై కర్మయోగులు సలుపుచుంద్రు
యజ్ఞముల్ దేవసంబంధమైన వాని.
ఒనర బ్రహ్మాగ్నిలో జ్ఞానయోగులెల్ల
వేల్చుచున్నారు, కర్మహవిస్సు. పార్థ! 25

ఇలను కొందఱు [7]శ్రవణముఖేంద్రియముల
[8]సంయమాగ్నిని హోమంబు సలుపుచుంద్రు
విజయ! కొందఱు శబ్దాదివిషయములను
నాచరింత్రు హోమము నింద్రియాగ్నులందు. 26

---

1 దేనియందును అభిమానము లేనివాఁడు 2 రాగద్వేషాదుల, ధర్మాధర్మసంబంధముల విడిచినవాఁడు 3 స్రుక్కు, స్రువము మున్నగు హోమసాధనములుంచిన పాత్ర 4 హోమాగ్ని 5 అగ్నిహోత్రమునందు వేల్చుటకు సిద్ధముచేయబడిన అన్నము, నేయి మొదలగు హోమద్రవ్యములు 6 హోమముచేయు ఋత్విక్కు *హుతము మఱియు హోత 7 చెవి, మొదలగు ఇంద్రియములు 8 నిగ్రహమనెడి యగ్ని.

[1]ఇంద్రియప్రాణకర్మంబులెల్ల నెపుడు
ఇలను గొందఱు హోమంబు సలుపుచుంద్రు
దీక్షమీఱఁగ జ్ఞానసందీప్తమైన
ఆత్మసంయమయోగాగ్నియందుఁ బార్థ! 27

అరయ ద్రవ్యతపోయోగయజ్ఞములను
చేయుదురు కొంతమంది. [2]స్వాధ్యాయమనెడి
జ్ఞానయజ్ఞముల్ కొందఱు సలుపుచుంద్రు
యతనశీలురు. [3]సంశితవ్రతులు నగుచు. 28

వసుధయందు. ప్రాణాయామపరులు కొంద
ఱతులితముగ. ప్రాణాపానగతుల నిల్పి
ప్రాణమందు నపాన, మపానమందు
ప్రాణమును హోమమొనరింత్రు, పాండుపుత్ర! 29

ధీరులగు కొందఱు, నియతాహారులగుచు.
ప్రాణముల హోమమొనరింత్రు ప్రాణములను.
యజ్ఞవేత్తలు వీరెల్ల యజ్ఞములనె
[4]విగతకల్మషులగుచును వెలయుచుంద్రు. 30

[5]యజ్ఞశిష్టామృతాహారులైనవారు
పడయుచుంద్రు, సనాతనబ్రహ్మపదము,
యజ్ఞముల నాచరింపని యట్టివారి
[6]కిహమెలేదన్న, పరలోక మింకఁగలదె? 31

1 సర్వేంద్రియములయొక్కయు, పంచప్రాణములయొక్కయు వ్యాపారములనన్నింటిని
2 వేదాధ్యయనము 3 దృఢవ్రతములుగలవారు 4 నశించిన పాపముగలవారు
5 యజ్ఞములయందు శేషించిన అమృతరూపమైన అన్నమును భుజించువారు
6 ఈ లోకము.

ఏవం బహువిధాయజ్ఞా
వితతా బ్రహ్మణో ముఖే ।
కర్మజాన్విద్ధి తాన్ సర్వాన్
ఏవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥ ౩౨

శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్
జ్ఞానయజ్ఞః పరంతప! ।
సర్వం కర్మాఖిలం పార్థ!
జ్ఞానే పరిసమాప్యతే ॥ ౩౩

తద్విద్ధి ప్రణిపాతేన
పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం
జ్ఞానినస్తత్త్వదర్శినః ॥ ౩౪

యజ్జ్ఞాత్వా న పునర్మోహం
ఏవం యాస్యసి పాండవ! ।
యేన భూతాన్యశేషేణ
ద్రక్ష్యస్యాత్మన్యథో మయి ॥ ౩౫

అపి చేదసి పాపేభ్యః
సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞానప్లవేనైవ
వృజినం సన్తరిష్యసి ॥ ౩౬

యథైధాంసి సమిద్ధోఽగ్నిః
భస్మసాత్కురుతేఽర్జున! ।
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి
భస్మసాత్కురుతే తథా ॥ ౩౭

*బ్రహ్మ ముఖమునందుండి యీవగిది, బహుళ
విధ యజనములు వెలువడి విస్తరిల్లె.
అవియు నెల్ల కర్మజములటంచు నీవు
తెలియ, బంధముక్తుఁడవు కాఁగలవు పార్థ! 32

ద్రవ్యమయ యజ్ఞమునకంటె తఱచిచూడ
జ్ఞానయజ్ఞంబె శ్రేయంబు సవ్యసాచి!
అఖిల కర్మంబులును జ్ఞానమందె యెపుడు
పరిసమాప్తిని బొందును, పాండుతనయ! 33

తత్త్వదర్శుల జ్ఞానుల దరికి నరిగి
వారికెన్ భక్తి సాష్టాంగపడుచు మ్రొక్కి,
ప్రశ్నగావించి, సేవించి, వారి వలన
పొందుమా జ్ఞానముపదేశమంది, పార్థ! 34

దేనిఁదెలియ నీ మోహంబు దీఱి చనునొ
అర్జునా! దేనిచేత నీ యాత్మయందు,
నట్లె నాయందు, సర్వభూతాళిఁ గాంచ
గలవొ, అదియె జ్ఞానంబని తెలియు మీవు. 35

పాపులందెల్ల మిక్కిలి పాపివైన
ఇప్పుడీజ్ఞానమనియెడు తెప్ప చేత,
సర్వపాపవారాసిని, సవ్యసాచి!
సులభముగ నీవు, తరియింపఁగలవు, నిజము. 36

ప్రజ్వరిల్లుచునుండెడు వహ్ని యెట్లు
కష్టెలను గాల్చి భస్మంబుగా నొనర్చు,
నట్లె సర్వకర్మముల, జ్ఞానాగ్ని కాల్చి
భస్మమొనరించివేయును, పాండుతనయ! 37

న హి జ్ఞానేన సదృశం
పవిత్రమిహ విద్యతే ।
తత్స్వయం యోగసంసిద్ధః
కాలేనాత్మని విన్దతి ॥ ౩౮

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం
తత్పరస్సంయతేంద్రియః ।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిం
అచిరేణాధిగచ్ఛతి ॥ ౩౯

అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ
సంశయాత్మా వినశ్యతి ।
నాయం లోకోఽస్తి న పరో
న సుఖం సంశయాత్మనః ॥ ౪౦

యోగసన్న్యస్తకర్మాణం
జ్ఞానసంఛిన్నసంశయమ్ ।
ఆత్మవన్తం న కర్మాణి
నిబధ్నన్తి ధనంజయ! ॥ ౪౧

తస్మాదజ్ఞానసంభూతం
హృత్స్థం జ్ఞానాసినాత్మనః ।
ఛిత్త్వైనం సంశయం యోగం
ఆతిష్ఠోత్తిష్ఠ భారత! ॥ ౪౨

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞానయోగోనామ చతుర్థోఽధ్యాయః

ఏదియును జ్ఞాన తుల్యంబుగాదు, జగతి
నింత కంటె పవిత్రమదేది లేదు:
క్రమముగా యోగ సంసిద్ధిఁ గన్నవాఁడు,
పొందఁగలఁడు దీనిని, తన యందె పార్థ! 38

శ్రద్ధయున్ తత్పరత్వము, సంయమనము
గలుగువాఁడు, జ్ఞానంబును గాంచఁగలఁడు,
జ్ఞానమున్ బడసినవాఁడు, తాను, పొందు
శ్రేష్ఠమగు శాంతిపదమును శీఘ్రముగనె. 39

జ్ఞాన శూన్యుండు, శ్రద్ధావిహీనుఁ డమిత
సంశయాత్ముండు నశియించు సత్వరముగ;
సంశయాత్మున కెన్నఁడు, సవ్యసాచి!
లే దిహము, పరంబును లేదు, లేదు సుఖము. 40

యోగసన్న్యస్తకర్ముఁడై యొప్పువాని,
జ్ఞానసంఛిన్న సంశయుఁడైనవాని,
ఆత్మసంలగ్నచిత్తుఁడై యలరువానిఁ,
గట్టనేరవు కర్మంబు లెట్టులేని. 41

కాన, నజ్ఞానమున నీకుఁ గలిగినట్టి,
అఖిల సంశయంబులను జ్ఞానాసిచేత
ఛేదనమొనర్చి, యోగ సంసిద్ధి నొంది,
సమర మొనరింప, లేలెమ్ము! సవ్యసాచి! 42

ఇది ఉపనిషత్ప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రంబును,
శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీమద్భగవద్గీతలందు
జ్ఞానయోగంబను నాలుగవ అధ్యాయము.

ఓమ్

# గీతా సుధా లహరి

## ఐదవ అధ్యాయము

### -: కర్మసన్న్యాసయోగము :-

**అర్జునుఁడిట్లనియె:-**

ఒక్కపరి కర్మసన్న్యాస మొక్కసారి
కర్మయోగంబు నుడువంగఁ గడఁగుచుంటి
వెద్ది రెండింట శ్రేష్ఠమో? ఎఱుఁగఁ జెపుమ
నిశ్చయముచేసి యొక్కటి నీవు, కృష్ణ! 1

**భగవానుఁడిట్లనియె:-**

కర్మసన్న్యాస కర్మయోగములు రెండు
అవని ముక్తిప్రదంబులే యగును; కాని
కర్మసన్న్యాస కర్మయోగముల లోన
కర్మయోగంబె శ్రేష్ఠమై క్రాలుచుండు. 2

ద్వేషకాంక్షలు మదినుండి వెడల నడచు
నాతఁడే నిత్యసన్న్యాసి యగును పార్థ!
ద్వంద్వముల కతీతుండయి పరగువాఁడు
పడయు సులభముగ సంసారబంధముక్తి. 3

కవ్వడీ! సాంఖ్యకర్మయోగములు వేఱు
టండ్రు బాలురట. పండితులనరు: చెప్ప
నాచరించిన నీరెంటియందు నొకటి,
ఉభయఫలసిద్ధిఁ బొందుచు నుందురయ్య! 4

సాంఖ్యయోగంబుచే నెట్టి స్థానమబ్బు,
కలుగు నద్దియె కర్మయోగులకుఁ గూడ,
కర్మసాంఖ్యయోగముల నొక్కటిగఁ దెలియు
వాఁడె, నిజముగఁ దెలిసినవాఁడు, పార్థ! 5

సన్న్యాసస్తు మహాబాహో!
దుఃఖమాప్తుమయోగతః ।
యోగయుక్తో మునిర్బ్రహ్మ
న చిరేణాధిగచ్ఛతి ॥ ౬

యోగయుక్తో విశుద్ధాత్మా
విజితాత్మా జితేంద్రియః ।
సర్వభూతాత్మభూతాత్మా
కుర్వన్నపి న లిప్యతే ॥ ౭

నైవ కించిత్కరోమీతి
యుక్తో మన్యేత తత్త్వవిత్ ।
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్
అశ్నన్గచ్ఛన్ స్వపన్ శ్వసన్॥ ౮

ప్రలపన్ విసృజన్ గృహ్ణన్
ఉన్మిషన్నిమిషన్నపి ।
ఇంద్రియాణీంద్రియార్థేషు
వర్తన్త ఇతి ధారయన్ ॥ ౯

బ్రహ్మణ్యాధాయ కర్మాణి
సంగం త్యక్త్వా కరోతి యః ।
లిప్యతే న స పాపేన
పద్మపత్రమివామ్భసా ॥ ౧౦

కాయేన మనసా బుద్ధ్యా
కేవలైరింద్రియైరపి ।
యోగినః కర్మ కుర్వన్తి
సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే॥ ౧౧

కవ్వడీ! యిట్టి కర్మయోగంబు లేక,
కర్మసన్న్యాసమందుట కష్టతరము;
యోగసంయుక్తుఁడై యొప్పుచుండు మౌని
బ్రహ్మపదము శీఘ్రంబుగఁ బడయఁగలఁడు. 6

యోగయుక్తుండు. శుద్ధాత్మ నొప్పువాఁడు
నిగ్రహాత్ముఁడు, కడు జితేంద్రియుఁడు, నెపుడు
నఖిలజీవులఁ, దనవలె నరయువాఁడు,
కర్మములొనర్ప లిప్తుండు గాఁడు సుమ్ము. 7

కనుచు, వినుచు. తాకుచును. మూర్కొనుచు, తినుచు
నడచుచును. నిద్రనొందుచు, నుడువుచు. మఱి
శ్వాస-పీల్చుచు. విడుచుచు, తీసికొనుచు,
కనులఁ-దెఱచుచు, మూయుచుఁగాని. యెపుడు.

[1]ఇంద్రియార్థంబులఁ జరియించుచుండు
నింద్రియంబులె కర్మములెల్లఁ జేయు
'నేను చేయుట లేదంచు' నిశ్చయముగ
అరసి వర్తించు. [2]తత్త్వజ్ఞుఁడైన యోగి. 8, 9

అవనితలమున నెవఁడు బ్రహ్మార్పణముగ
సంగమునువీడి, కర్మముల్ సలుపుచుండు.
నట్టి వాఁడు పాపములచే నంటువడడు
[3]పద్మపత్రస్థితాంబువు పగిది. పార్థ! 10

ఆత్మసంశుద్ధి కొఱకునై అవనిలోన.
తనువుచే, బుద్ధిచేతను. మనసుచేత,
ఇంద్రియంబులచే యోగీంద్రులెపుడు
కర్మములు సల్పుచుంద్రు. సంగమ్ముఁ గొనక 11

---

1 విషయములు 2 ఆత్మజ్ఞాని 3 తామరాకుపై నీటిబొట్టువలె

యుక్తః కర్మఫలం త్యక్త్వా
శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్ ।
అయుక్తః కామకారేణ
ఫలేసక్తో నిబధ్యతే ॥ ౧౨

సర్వకర్మాణి మనసా
సన్న్యస్యాఽఽస్తే సుఖం వశీ ।
నవద్వారే పురే దేహే
నైవ కుర్వన్నకారయన్ ॥ ౧౩

న కర్తృత్వం న కర్మాణి
లోకస్య సృజతి ప్రభుః ।
న కర్మఫలసంయోగం
స్వభావస్తు ప్రవర్తతే ॥ ౧౪

నాదత్తే కస్యచిత్పాపం
న చైవ సుకృతం విభుః ।
అజ్ఞానేనావృతం జ్ఞానం
తేన ముహ్యన్తి జన్తవః ॥ ౧౫

జ్ఞానేన తు తదజ్ఞానం
యేషాం నాశితమాత్మనః ।
తేషామాదిత్యవద్జ్ఞానం
ప్రకాశయతి తత్పరమ్ ॥ ౧౬

తద్బుద్ధయస్తదాత్మానః
తన్నిష్ఠాస్తత్పరాయణాః ।
గచ్ఛన్త్యపునరావృత్తిం
జ్ఞాననిర్ధూతకల్మషాః ॥ ౧౭

విద్యావినయసంపన్నే
బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే చ
పండితాః సమదర్శినః ॥ ౧౮

ఇహైవ తైర్జితస్సర్గో
యేషాం సామ్యే స్థితం మనః ।
నిర్దోషం హి సమం బ్రహ్మ
తస్మాద్బ్రహ్మణి తే స్థితాః ॥ ౧౯

న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య
నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్ ।
స్థిరబుద్ధిరసమ్మూఢో
బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః ॥ ౨౦

బాహ్యస్పర్శేష్వసక్తాత్మా
విందత్యాత్మని యత్సుఖమ్ ।
స బ్రహ్మయోగయుక్తాత్మా
సుఖమక్షయమశ్నుతే ॥ ౨౧

యే హి సంస్పర్శజా భోగా
దుఃఖయోనయ ఏవ తే ।
ఆద్యన్తవన్తః కౌన్తేయ!
న తేషు రమతే బుధః ॥ ౨౨

శక్నోతీహైవ యస్సోఢుం
ప్రాక్ఛరీరవిమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం
స యుక్తస్స సుఖీ నరః ॥ ౨౩

విద్యయు, వినయముంగల్గు, విప్రు నందు,
గోవు నందు, ఏనుఁగునందు, కుక్కయందు,
శునకమాంసంబుఁ దిను హీనజనునియందు,
పండితులు సమదృష్టితోఁ బరగుచుంద్రు. 18

అన్నిఁటిని సమదృష్టితో నరయువార
లవనియందు జీవన్ముక్తు లౌదు రయ్య!
బ్రహ్మ మన్నిట సమతను బఱగు కతన
బ్రహ్మ మందె స్థిరంబుగ వారలుంద్రు. 19

మోహమును వీడి, సుస్థిరబుద్ధిఁ గలిగి,
బ్రహ్మమందు విలీనమౌ బ్రహ్మవేత్త
ప్రియము చేకూరినను సంప్రీతిఁ జెందఁ
డప్రియముఁ గల్గినన్ వ్యథ నందఁబోడు. 20

బాహ్యవిషయాసు సంసక్తి వదలివైచి
ఆత్మయందే సుఖంబుఁ గా నందు, అట్టి
అక్షయసుఖంబు, బ్రహ్మయుక్తాత్ముఁడై, అ
తండనుభవించు ననుట తథ్యంబు, పార్థ! 21

విషయభోగంబులెల్ల భావించి చూడ
సర్వి నాద్యంతములు గల్గి యుండు కతన,
దుఃఖహేతుభూతంబులై, తోఁచుచుండు;
కాన, జ్ఞాని రమింపఁడు, వానియందు. 22

తనువు త్యజియించుటకు మున్న, ధరణి నెవఁడు
కామమునను, క్రోధమ్మునన్ గలుగుచుండు
వేగము భరింప శక్తుఁడో, విజయ! అతఁడె
యోగయుక్తుండు, సుఖియునై యొప్పుచుండు. 23

యోఽన్తః సుఖోఽన్తరారామః
తథాఽన్తర్జ్యోతిరేవ యః ।
స యోగీ బ్రహ్మనిర్వాణం
బ్రహ్మభూతోఽధిగచ్ఛతి ॥ ౨౪

లభన్తే బ్రహ్మనిర్వాణం
ఋషయః క్షీణకల్మషాః ।
ఛిన్నద్వైధా యతాత్మానః
సర్వభూతహితే రతాః ॥ ౨౫

కామక్రోధవియుక్తానాం
యతీనాం యతచేతసామ్ ।
అభితో బ్రహ్మనిర్వాణం
వర్తతే విదితాత్మనామ్ ॥ ౨౬

స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాన్
చక్షుశ్చైవాన్తరే భ్రువోః ।
ప్రాణాపానౌ సమౌ కృత్వా
నాసాభ్యన్తరచారిణౌ ॥ ౨౭

యతేంద్రియమనోబుద్ధిః
మునిర్మోక్షపరాయణః ।
విగతేచ్ఛాభయక్రోధో
యస్సదా ముక్త ఏవ సః ॥ ౨౮

భోక్తారం యజ్ఞతపసాం
సర్వలోకమహేశ్వరమ్ ।
సుహృదం సర్వభూతానాం
జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి ॥ ౨౯

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే కర్మసన్న్యాసయోగో నామ పంచమోఽధ్యాయః.

అంతరారాముఁ డంతస్సుఖాత్ముఁ డెవఁడో,
అట్లె. ఎవ్వఁడంతర్జ్యోతియై వెలుంగు
చుండునో, అట్టి యోగి, తా నొందుచుండు
బ్రహ్మభూతుఁడై, బ్రహ్మనిర్వాణసుఖము. 24

దోషరహితులు, సంశయదూరులైన
వారలున్, నియతాత్ములై పరగువారు,
అఖిలభూతహితాసక్తులైన ఋషులు
బ్రహ్మనిర్వాణ సౌఖ్యంబుఁ బడయఁగలరు. 25

క్రోధకామముల్ మొదలంట రూపుమాపి
నేర్పు మీఱంగ చిత్తంబు నిగ్రహించి,
ఆత్మ తత్త్వమ్ము నెఱిఁగిన యతుల కిహప
రముల, బ్రహ్మనిర్వాణసౌఖ్యము లభించు. 26

బాహ్యవిషయముల్ తుదముట్టఁ దాఱఁదరిమి,
సొరిది భ్రూమధ్యమంబునఁ జూడ్కి నిల్పి,
నాసికాభ్యంతరమ్మున నడచు. ప్రాణ
గతి. నపానగతి. సమముగా నొనర్చి;

మనసు నింద్రియబుద్ధుల మదమడంచి
కోపభయరాగములనెల్ల రూపుమాపి
మోక్షతత్పరచిత్తుఁడౌ మునివరుండు
నిత్యముక్తుఁడై ఫల్గునా! నెగడుచుండు. 27, 28

యజ్ఞతపములకును. భోక్త నగుదునంచు,
సర్వలోకములకు మహేశ్వరుఁడనంచు,
అఖిల జీవుల కాప్తుండ నంచు. నన్నుఁ
గనెడు జ్ఞానియే, శాంతిని గాంచుఁ బార్థ! 29

ఇది ఉపనిషత్ప్రతిపాదకంబును. బ్రహ్మవిద్యయు. యోగశాస్త్రంబును.
శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీమద్భగవద్గీతలందు
కర్మసన్న్యాసయోగమను అయిదవ అధ్యాయము.



# శ్రీమద్భగవద్గీతా

## షష్ఠోఽధ్యాయః

### -: ఆత్మసంయమయోగః :-

శ్రీభగవానువాచ:-

అనాశ్రితః కర్మపలం
కార్యం కర్మ కరోతి యః ।
స సన్న్యాసీ చ యోగీ చ
న నిరగ్నిర్న చాఽక్రియః ॥ ౧

యం సన్న్యాసమితి ప్రాహుః
యోగం తం విద్ధి పాండవ ।
నహ్యసన్న్యస్తసంకల్పో
యోగీ భవతి కశ్చన ॥ ౨

ఆరురుక్షోర్మునేర్యోగం
కర్మ కారణముచ్యతే ।
యోగారూఢస్య తస్యైవ
శమః కారణముచ్యతే ॥ ౩

యదా హి నేంద్రియార్థేషు
న కర్మస్వనుషజ్జతే ।
సర్వసంకల్పసన్న్యాసీ
యోగారూఢస్తదోచ్యతే ॥ ౪

ఓమ్

# గీతా సుధా లహరి

## ఆఱవ అధ్యాయము

### -: ఆత్మసంయమయోగము :-

భగవానుఁడిట్లనియె:-

సంగమును వీడి కర్మముల్ సలుపునట్టి
వాఁడె సన్న్యాసి. యోగియుఁ వాఁడె, పార్థ!
[1]అగ్నియుఁ క్రియలను వీడినంత మాత్ర
కాఁడు సన్న్యాసి, యోగియుఁ గాఁడు వాఁడు. 1

ఏది సన్న్యాసమని యందు రెల్లబుధులు
నదియె యోగమంచును దెలియంగవలయు,
అరయ సంకల్పమును వీడనట్టి మనుజుఁ
డొక్కరుండును యోగి కాఁడుర్విలోన. 2

*యోగ మారోహణము సేయనున్న మునికి
జగతి, కర్మంబె చక్కని సాధనంబు;
యోగమారోహణము చేసి యున్న మునికి
[2]శమమె సాధనమందురు, సవ్యసాచి! 3

ఇంద్రియార్థంబులందున నేని. మఱియు
కర్మములయందు నేని సంగమును గొనక
అఖిల సంకల్పరహితుఁడై యలరుచుండు
నట్టివాని యోగారూఢుఁడందు రవని. 4

---

*1 వైదికకర్మకు సంబంధించిన అగ్నిహోత్రాదులు, తపోదానాది కర్మలు*

** ఆరురుక్షువై యలరారునట్టిమునికి ♦ కర్మమే యనువగు యోగకారణంబు;*
*జ్ఞానియై చెలువారెడు వాని కరయ ♦ కర్మ నివృత్తియే తగు కారణంబు.*

*2 కర్మనివృత్తి.*

ఉద్ధరేదాత్మనాఽఽత్మానం
నాత్మానమవసాదయేత్ ।
ఆత్మైవహ్యాత్మనోబన్ధుః
ఆత్మైవరిపురాత్మనః ॥ ౫

బంధురాత్మాత్మనస్తస్య
యేనాత్మైవాత్మనాజితః ।
అనాత్మనస్తు శత్రుత్వే
వర్తేతాత్మైవ శత్రువత్ ॥ ౬

జితాత్మనః ప్రశాంతస్య
పరమాత్మా సమాహితః ।
శీతోష్ణసుఖదుఃఖేషు
తథా మానావమానయోః ॥ ౭

జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా
కూటస్థో విజితేంద్రియః ।
యుక్త ఇత్యుచ్యతే యోగీ
సమలోష్టాశ్మకాంచనః ॥ ౮

సుహృన్మిత్రార్యుదాసీన-
మధ్యస్థద్వేష్యబంధుషు ।
సాధుష్వపి చ పాపేషు
సమబుద్ధిర్విశిష్యతే ॥ ౯

యోగీ యుఞ్జీతసతతం
ఆత్మానం రహసి స్థితః ।
ఏకాకీ యతచిత్తాత్మా
నిరాశీరపరిగ్రహః ॥ ౧౦

*తన్ను తానుద్ధరించుకో దగును గాని,
తన్ను పడఁగొట్టుకొనుట యుక్తంబుగాదు:
బంధువౌనుమ్మ! స్వాధీనపడిన యాత్మ
ప్రబల శత్రువు, స్వాధీనపడని యాత్మ. 5

ఎవని మన మాత్మచేత జయింపఁబడునో
అతని యాత్మకదియె బంధువగుచుఁ దనరు,
అట్లుకాదేని ఆతని ఆత్మకదియె,
శాత్రవుని వోలె అపకృతి సలుపుచుండు. 6

అడరు శీతోష్ణదుఃఖసౌఖ్యములయందు,
నట్లె, మానావమానములందుఁగాని,
ఆత్మను జయించి శాంతిచే నలరుచుండు
నతఁడు, పరమాత్మలో లీనమౌచు వెలయు. 7

జ్ఞాన విజ్ఞాన తృప్తాత్ముఁడైన వాఁడు
ఎన్న కూటస్థుఁడును, విజితేంద్రియుండు,
హేమలోష్టాశ్మముల సమదృష్టిఁ జూచు
యోగి, వచియింపఁగాఁబడు యుక్తుడనుచు. 8

ద్వేష్యులందు. మిత్రామిత్ర విహితులందు,
తగ నుదాసీనులందు, మధ్యస్థులందు,
బంధులందు, సాధులయందు, పాపులందు
సమమతినుండు నతఁడె యోగిసత్తముండు. 9

ఒంటి నేకాంతమునందుండి, యోగి, పార్థ!
ఆత్మనిగ్రహమూనుచు, ఆశవదలి,
సర్వ సంగ్రహంబు వీడి, సంతతంబు
నాత్మయోగంబుఁ జూచుచు నలరవలయు. 10

* ఆత్మచే తాను పెంపొందవలయును గాని । ఆత్మచేత నధోగతి నందరాదు,
ఆత్మయే బంధువు, మరి యాత్మే రిపువు । [illegible]

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య
స్థిరమాసనమాత్మనః ।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం
చేలాజినకుశోత్తరమ్ ॥ ౧౧

తత్రైకాగ్రం మనః కృత్వా
యతచిత్తేంద్రియ క్రియః ।
ఉపవిశ్యాసనే యుంజ్యాత్
యోగమాత్మవిశుద్ధయే ॥ ౧౨

సమం కాయశిరోగ్రీవం
ధారయన్నచలం స్థిరః ।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం
దిశశ్చానవలోకయన్ ॥ ౧౩

ప్రశాంతాత్మా విగతభీః
బ్రహ్మచారివ్రతే స్థితః ।
మనస్సంయమ్య మచ్చిత్తో
యుక్త ఆసీత మత్పరః ॥ ౧౪

యుఞ్జన్నేవం సదాఽఽత్మానం
యోగీ నియతమానసః ।
శాంతిం నిర్వాణపరమాం
మత్సంస్థామధిగచ్ఛతి ॥ ౧౫

నాత్యశ్నతస్తు యోగోఽస్తి
నచైకాన్తమనశ్నతః ।
నచాతిస్వప్నశీలస్య
జాగ్రతో నైవచార్జున ॥ ౧౬

ఎత్తు పల్లము గాకుండ నెసఁగునట్టి,
సమతలమ్మున, శుభ్రమౌ స్థలమునందు
ఒగి, కుశాజినాంబరముల నొప్పుచున్న
ఆసనంబును స్థిరముగా నమరనిలిపి,
మనసునేకాగ్రముగఁ జేసి, మమతవీడి,
నిఖిల చిత్తేంద్రియక్రియల్ నిగ్రహించి,
ఆత్మసంశుద్ధికై యందు నధివసించి
యోగమభ్యాస మొనరించు చుండవలయు. 11, 12

కాయము, శిరము, కంఠమ్ము, కదలనీక
సమముగా సుస్థిరుండయి అమరనిలిపి,
దిక్కులందు దేశంబును దిరుగనీక
దృష్టి, నాసికాగ్రమున కేంద్రీకరించి,
బ్రహ్మచర్యంబు నూనుచు, భయము విడిచి
స్వాంతమును జయించి, శాంతస్వభావుఁడగుచు,
చిత్తమెప్పుడు నా యందె హత్తుకొలిపి,
యోగమున మత్పరుండయి, యుండవలయు. 13, 14

నిరత మీరీతి మనసును నిగ్రహించి,
యోగమందు సుస్థిరుఁడయి, యుండు యోగి,
పరమ నిర్వాణరూపసంభరితమైన
దివ్యశాంతిని బడయును, సవ్యసాచి! 15

అధికభోజి, నిరాహారుఁడైన యతఁడు
అమితముగ నిద్రఁజెందెడు నట్టి వాఁడు,
కొంచెమును నిద్రలేక మేల్కొనెడు వాఁడు,
పడయఁజాలఁ డీయోగంబు, పాండుతనయ! 16

యుక్తాహారవిహారస్య
యుక్తచేష్టస్య కర్మసు ।
యుక్తస్వప్నావబోధస్య
యోగో భవతి దుఃఖహా ॥ ౧౭

యదా వినియతం చిత్తం
ఆత్మన్యేవావతిష్ఠతే ।
నిస్స్పృహస్సర్వకామేభ్యో
యుక్త ఇత్యుచ్యతే తదా ॥ ౧౮

యథా దీపో నివాతస్థో
నేంగతే సోపమా స్మృతా ।
యోగినో యతచిత్తస్య
యుఞ్జతో యోగమాత్మనః ॥ ౧౯

యత్రోపరమతే చిత్తం
నిరుద్ధం యోగసేవయా ।
యత్ర చైవాత్మనాత్మానం
పశ్యన్నాత్మని తుష్యతి ॥ ౨౦

సుఖమాత్యంతికం యత్తత్
బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్ ।
వేత్తి యత్ర న చైవాయం
స్థితశ్చలతి తత్త్వతః ॥ ౨౧

ప్రాప్తమగునిద్ది-భవహరమైన యోగ
మరయ, మితభోజన విహారనిరతులైన
పురుషులకు. [1]యుక్తనిద్రావబోధనియమ
కలితమతులకు, యుక్తచేష్టులకుఁబార్థ! 17

నేర్పుమీఱంగ చిత్తమ్ము నిగ్రహించి,
ఆత్మలో నిశ్చలంబుగ నమర నిలిపి
నిఖిలకామవిముక్తుఁడై నెగడు వాని
యుక్తుఁడంచును వర్ణించుచుంద్రు పార్థ! 18

గాలిలేనట్టి చోటునఁ గదలకుండు
నట్టి, దీపమును వచింతురయ్య విజయ!
ఆత్మయోగమ్ము నిత్యమ్ము నభ్యసించు
యోగి నియతచిత్తమ్మున కుపమ గాగ. 19

[2]యోగసేవానిరుద్ధమై యొప్పునట్టి
చిత్త మెచ్చోట [3]ఉపరతిఁ జెందుచుండు
నాత్మఁ బరమాత్మఁ గాంచుచు నబ్బురముగ
నెందు తాను సంతుష్టిని బొందుచుండు; 20

ఇంద్రియాతీతమై. బుద్ధి నెఱుఁగఁగలుగు
పరమ సౌఖ్యంబు నెచ్చటఁ బడయుచుండు
నట్టి సుస్థిరస్థితియందు నలరు యోగి
చలనమొందక నిల్చును సవ్యసాచి! 21

1 మితమైన నిద్ర, మెలకువ గలిగియుండుట యను నియమముపై నొప్పినవారు
2 యోగాభ్యాసముచేత నిగ్రహింపబడిన 3 శాంతి

యం లబ్ధ్వా చాపరం లాభం
మన్యతే నాధికం తతః ।
యస్మిన్ స్థితో న దుఃఖేన
గురుణాపి విచాల్యతే॥ ౨౨

తం విద్యాద్దుఃఖసంయోగ-
వియోగం యోగసంజ్ఞితమ్।
స నిశ్చయేన యోక్తవ్యో
యోగోఽనిర్విణ్ణచేతసా ॥ ౨౩

సంకల్పప్రభవాన్కామాం
స్త్యక్త్వా సర్వానశేషతః ।
మనసైవేంద్రియగ్రామం
వినియమ్య సమన్తతః ॥ ౨౪

శనైశ్శనైరుపరమేత్
బుద్ధ్యా ధృతిగృహీతయా ।
ఆత్మసంస్థం మనః కృత్వా
న కించిదపి చింతయేత్ ॥ ౨౫

యతో యతో నిస్సరతి
మనశ్చంచలమస్థిరమ్ ।
తతస్తతో నియమ్యైతత్
ఆత్మన్యేవ వశం నయేత్ ॥ ౨౬

ప్రశాంతమనసం హ్యేనం
యోగినం సుఖముత్తమమ్ ।
ఉపైతి శాంతరజసం
బ్రహ్మభూతమకల్మషమ్ ॥ ౨౭

ఏది గని యన్యలాభమదేది గాని
హెచ్చుటంచును మదిలోన నెంచకుండు.
దేని యందుండి. యెన్నఁడుఁగాని విజయ!
ఎట్టి దుఃఖమునకు చలియింపకుండు; 22

దాని, దుఃఖవిరహితమై తనరునట్టి
యోగమంచును మదిలోన నూహసేసి
చెలఁగి, యొక్కింత విసుపును జెందకుండ,
సాధనమొనర్పఁ దగును. నిశ్చయముగాను. 23

పార్థ! సంకల్పమునఁబుట్టు వాంఛలెల్ల
నిరవశేషంబుగాగను పరిహరించి.
ఎల్ల విషయంబులందుండి, యింద్రియముల.
నెమ్మనంబున నేర్పుగా నిగ్రహించి.
ధైర్యముతఁబూని. బుద్ధిచేఁ దగినయట్లు,
స్వాంతమును మెల్లమెల్లగ నాత్మయందు
నిలిపి, క్రీడింపవలయు. చింతలనుమాని. 24, 25

చంచలంబస్థిరంబగు స్వాంతమెచట
నెచట చరియించుచుండునో, అచటనుండి.
దాని మఱలించి. పనకు స్వాధీనముగను
జేసి. ఆత్మలోపలఁ బ్రతిష్ఠింపవలయు. 26

శాంతచిత్తుండు, విగతరాజసగుణుండు,
బ్రహ్మభూతుండు, కల్మషరహితుఁడైన
యట్టియోగి. సర్వోత్తమంబైన సుఖము
చూఱఁగొనుచుండు. ఫల్గునా! సులభముగను. 27

యుఞ్జన్నేవంసదాఽఽత్మానం
యోగీ విగతకల్మషః ।
సుఖేన బ్రహ్మసంస్పర్శం
అత్యంతం సుఖమశ్నుతే ॥ ౨౮

సర్వభూతస్థమాత్మానం
సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా
సర్వత్ర సమదర్శనః ॥ ౨౯

యో మాం పశ్యతి సర్వత్ర
సర్వం చ మయి పశ్యతి ।
తస్యాహం న ప్రణశ్యామి
స చ మే న ప్రణశ్యతి ॥ ౩౦

సర్వభూతస్థితం యోమాం
భజత్యేకత్వమాస్థితః ।
సర్వథా వర్తమానోఽపి
స యోగీ మయి వర్తతే॥ ౩౧

ఆత్మౌపమ్యేన సర్వత్ర
సమంపశ్యతియోఽర్జున! ।
సుఖం వా యది వా దుఃఖం
స యోగీ పరమో మతః ॥ ౩౨

నిరత మీరీతి మనసును నిగ్రహించి,
విగతకల్మషుఁడగుచును, వెలయు యోగి,
బ్రహ్మసాక్షాత్కృతింగాంచి, పరమ సుఖము
నందుకొనుచుండుఁ దా సునాయాసముగను. 28

యోగయుక్తాత్ముఁడై యెప్పుడున్నవాఁడు,
అన్నిటను సమదర్శనుండగుచుఁ జూచు
తాను తనయాత్మ సర్వభూతంబులందు,
అఖిల భూతాత్మలను తన యాత్మయందె. 29

అఖిల భూతంబులందు నన్నరయునెవఁడు,
అఖిల భూతంబు లెవఁడు నాయందు నరయు,
*నట్టివానికి నిత్యుండనగుదు నేను,
అటులె నాకును నిత్యుఁడై యలరు నతఁడు. 30

అఖిలభూతస్థితుండనై యలరు నన్ను
భేదభావంబులేక సేవించుయోగి
ఎన్నివిధములఁ దాఁ జరియించుచున్న,
వాఁడు నాయందె వర్తించువాఁడె సుమ్మ! 31

[1]ఆత్మసామ్యమ్ముచేత నీయఖిలమందు
సుఖము దుఃఖమ్ము సమతను జూచువాఁడె,
యోగివర్యులలోన సర్వోత్తముఁడయి
పరగుచుండును జగతిలో పాండుతనయ! 32

---

*మంతం, నతనికి నేను, నతండు నాకు ♦ నొకరికొకరము కన్పడుచుందు మెప్పుడు.
1 తన యాత్మవంటిదే తక్కిన ప్రాణుల యాత్మయను భావమున.

అర్జున ఉవాచ:-

యోఽయం యోగస్త్వయా ప్రోక్తః
సామ్యేన మధుసూదన! ।
ఏతస్యాహం న పశ్యామి
చంచలత్వాత్ స్థితిం స్థిరామ్ ॥ ౩౩

చంచలం హి మనః కృష్ణ!
ప్రమాథి బలవద్దృఢమ్ ।
తస్యాహం నిగ్రహం మన్యే
వాయోరివ సుదుష్కరమ్ ॥ ౩౪

శ్రీభగవానువాచ:-

అసంశయం మహాబాహో!
మనో దుర్నిగ్రహం చలమ్ ।
అభ్యాసేన తు కౌంతేయ!
వైరాగ్యేణ చ గృహ్యతే ॥ ౩౫

అసంయతాత్మనా యోగో
దుష్ప్రాప ఇతి మే మతిః ।
వశ్యాత్మనా తు యతతా
శక్యోఽవాప్తుముపాయతః ॥ ౩౬

అర్జున ఉవాచ:-

అయతిః శ్రద్ధయోపేతో
యోగాచ్చలితమానసః ।
అప్రాప్య యోగసంసిద్ధిం
కాం గతిం కృష్ణ! గచ్ఛతి? ॥ ౩౭

అర్జునుఁడిట్లనియె:-

అంచితంబుగ నీవు బోధించినట్టి
యిట్టి సమయోగతత్త్వంబు, కృష్ణ! నేను
కొంచెమేనియు తిరముగఁ గాంచఁజాల
చిత్తమిది చంచలంబయి చెలఁగుకతన. 33

దృఢము, చంచలము, బలిష్ఠమీమనంబు,
కడు భ్రమప్రమాదములను గలుగఁజేయుఁ
గాన, దీని నిగ్రహము, దుష్కరమె యగును
గాలి నెవ్వఁడు బంధింపఁ గలఁడు, కృష్ణ! 34

భగవానుఁడిట్లనియె:-

మానసము చంచలంబనుమాట నిజమె,
నిగ్రహింపఁగరాదు, సందియములేదు;
కాని, అరికట్టగావచ్చు దీని పార్థ!
నిరతమభ్యాస వైరాగ్యనియతిచేత. 35

ఆత్మసంయమనమ్ము లేనట్టివాని
కిమ్మహాయోగ మతి దుర్లభమ్ము సుమ్ము;
యత్నపరుఁడైనవాఁడు, వశ్యాత్ముఁడెపుడు
పడయఁగల్గును దీని [1]నుపాయమునను, 36

అర్జునుఁడిట్లనియె:-

శ్రద్ధగలిగియు నియమానుసారిగాక,
యోగమున చిత్తచాంచల్యమొందు కతన,
యోగసంసిద్ధినొందక యున్నవాని
కెట్టిగతిపట్టునో? తెల్పవే ముకుంద! 37

---

1 అభ్యాసవైరాగ్యములను ఉపాయమునవే

కచ్చిన్నోభయవిభ్రష్టః
ఛిన్నాభ్రమివ నశ్యతి।
అప్రతిష్ఠో మహాబాహో!
విమూఢో బ్రహ్మణః పథి ॥ ౩౮

ఏతన్మే సంశయం కృష్ణ!
ఛేత్తుమర్హస్యశేషతః।
త్వదన్యస్సంశయస్యాస్య
ఛేత్తా నహ్యుపపద్యతే ॥ ౩౯

శ్రీభగవానువాచ:-

పార్థ! నైవేహ నాముత్ర
వినాశస్తస్యవిద్యతే।
న హి కల్యాణకృత్కశ్చిత్
దుర్గతిం తాత! గచ్ఛతి ॥ ౪౦

ప్రాప్యపుణ్యకృతాన్ లోకాన్
ఉషిత్వా శాశ్వతీస్సమాః।
శుచీనాం శ్రీమతాం గేహే
యోగభ్రష్టోఽభిజాయతే ॥ ౪౧

అథవా యోగినామేవ
కులే భవతి ధీమతామ్।
ఏతద్ధి దుర్లభతరం
లోకే జన్మ యదీదృశమ్ ॥ ౪౨

[1]అప్రతిష్ఠుండు సజ్ఞానియైనవాఁడు-
బ్రహ్మపథమున. [2]ఉభయ విభ్రష్టుఁడగుచు,
చెదరిఁగొట్టగఁబడిన [3]వారిదమువోలె
నాశమొందక నిల్చునా? సళినయన! 38

సాంగముగ నిట్టి నా సందియమ్ముఁబాప,
నీవె తగినట్టి వాఁడవు, నీరజాక్ష!
దీని నా సందియమ్మును దీర్చి వైవఁ
గలఁడె యన్యుండు కృష్ణ! నీకన్న నింక? 39

భగవానుఁడిట్లనియె:-

నాశమేలేదు వాని కెన్నండుగాని,
ఇహమునందేని, పరమందునేని, వత్స!
పుణ్యకార్యంబు లొనరించు పూతచరితుఁ
డెన్నడేని దుర్గతి నందునే? కిరీటి! 40

అర్జునా! యోగవిభ్రష్టుఁడైనవాఁడు
పుణ్యకర్మల లోకముల్ బొంది, యందు
చిరతరమ్ముగ వాసమ్ముఁజేసి, శుచుల
భాగ్యవంతుల గృహముల, బ్రభవమొందు. 41

అటులఁ గాదేని, ధీమంతులైనయట్టి
యోగిజనవంశమందుఁ దా నుద్భవించు,
నీదృశంబైన పుట్టుక, యిహము నందు
దొరకుటన్నను నెంతయో దుర్లభమ్ము. 42

1 అస్థిరుడు 2 ఇహ పరముల రెంటికిని చెడినవాడై లేక కర్మమునుండియు, యోగము నుండియు చెడినవాడై 3 మేఘము.

తత్ర తం బుద్ధిసంయోగం
లభతే పౌర్వదైహికమ్ ।
యతతే చ తతో భూయః
సంసిద్ధౌ కురు నందన! ॥ ౪౩

పూర్వాభ్యాసేన తేనైవ
హ్రియతే హ్యవశోఽపి సః ।
జిజ్ఞాసురపి యోగస్య
శబ్దబ్రహ్మాతివర్తతే ॥ ౪౪

ప్రయత్నాద్యతమానస్తు
యోగీ సంశుద్ధకిల్బిషః ।
అనేకజన్మసంసిద్ధః
తతోయాతి పరాంగతిమ్ ॥ ౪౫

తపస్విభ్యోఽధికోయోగీ
జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।
కర్మిభ్యశ్చాధికో యోగీ
తస్మాద్యోగీ భవార్జున! ॥ ౪౬

యోగినామపి సర్వేషాం
మద్గతేనాన్తరాత్మనా ।
శ్రద్ధావాన్ భజతే యో మాం
స మే యుక్తతమో మతః ॥ ౪౭

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే ఆత్మసంయమయోగో నామ- షష్ఠోఽధ్యాయః.

యోగికులమున నిట్లు తా నుద్భవించి,
పూర్వ జన్మార్జితంబగు బుద్ధిఁ బొంది,
దాని సంస్కారబలమున తాను, మఱల,
సిద్ధిఁనొందఁగ, యత్నమ్ముఁ జేయుచుండు. 43

[1]అవశుఁడయ్యును యోగంబు నందఁగలఁడు
వాఁడు పూర్వజన్మాభ్యాసవశముచేత;
అర్జునా! యోగజిజ్ఞాసువైనవాఁడు,
నవనియందు [2]శబ్దబ్రహ్మ మధిగమించు, 44

Acc No. 9524

సంతతంబును యత్నంబు సలుపు యోగి
పాపనిర్ముక్తుఁడౌచును పాండుపుత్ర!
చెలఁగి బహుజన్మపరిపాక సిద్ధుఁడగుచుఁ,
బడయు సర్వోత్తమంబగు బ్రహ్మపదము. 45

294.5924
VEN

యోగి జగతిలో నధికుఁడై యొప్పుచుండు,
తాపసులకంటె, జ్ఞానవిత్తములకంటె,
కర్మఠులకంటె, నింక యీ మర్మమెఱిఁగి
యత్నమొనరింపుమా! యోగివగుట కీవు. 46

202000

అర్జునా! అంతరాత్మ నాయందె నిలిపి,
నన్ను శ్రద్ధతో భజియించుచున్నవాఁడు
యోగులందెల్ల శ్రేష్ఠుఁడౌ యోగియంచు
నేను భావించుచుందును, నిశ్చయముగ. 47

ఇదిఉపనిషత్ప్రతిపాదకంబును. బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రంబును,
శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీమద్భగవద్గీతలందు
ఆత్మసంయమయోగమను ఆఱవ అధ్యాయము.

---

1 ప్రయత్నములేనివాడయ్యు 2 వేదోక్త కర్మానుష్ఠానఫలమును దాటివేయుట లేక ప్రకృతిబంధమునుండి విముక్తుడై జ్ఞానానందస్వరూపమగు ఆత్మను పొందుట.



# శ్రీమద్భగవద్గీతా

## సప్తమోఽధ్యాయః

### -: విజ్ఞానయోగః :-

శ్రీభగవానువాచ:-

మయ్యాసక్తమనాః పార్థ!
యోగం యుఞ్జన్మదాశ్రయః।
అసంశయం సమగ్రం మాం
యథా జ్ఞాస్యసి తచ్ఛృణు ॥ ౧

జ్ఞానం తేఽహం సవిజ్ఞానం
ఇదం వక్ష్యామ్యశేషతః ।
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్
జ్ఞాతవ్యమవశిష్యతే ॥ ౨

మనుష్యాణాం సహస్రేషు
కశ్చిద్యతతి సిద్ధయే ।
యతతామపి సిద్ధానాం
కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥ ౩

భూమిరాపోఽనలో వాయుః
ఖం మనో బుద్ధిరేవ చ ।
అహంకార ఇతీయం మే
భిన్నా ప్రకృతిరష్టధా ॥ ౪

అపరేయమితస్త్వన్యాం
ప్రకృతిం విద్ధి మే పరామ్ ।
జీవభూతాం మహాబాహో!
యయేదం ధార్యతే జగత్ ॥ ౫

ఓమ్

# గీతా సుధాలహరి

## ఏడవ అధ్యాయము

### -: విజ్ఞానయోగము :-

భగవానుఁడిట్లనియె:-

ఉల్లమెప్పుడు నాయందె యుంచి, యోగ
మభ్యసించుచు, నీవు నన్నాశ్రయించి,
ఎటుల పరిపూర్ణుఁడనగు నన్నెఱుఁగఁగలవొ
నిశ్చయంబుగ, వివరింతు నీకు వినుమ! 1

దేనిఁ దెలిసిన పిమ్మటఁ దెలియఁదగిన
విషయమెద్దియు నుండదో, వినుము నీకు
నట్టి యనుభవజ్ఞానమ్మునంత నిపుడు
తెలియఁజేసెద నింక, పూర్తిగను పార్థ! 2

సిద్ధి నొందఁగ యత్నమ్ము సేయువాఁడె
వందొ వేయింటఁ దానొకఁడుండుటరుదు,
ఇంక నిశ్చయంబుగను నన్నెఱుఁగువాఁడె
వందొ వేలసిద్ధులయందొకండె యుండు. 3

నీరు, నిప్పును, గాలియు, నింగి, నేల,
మనసు, బుద్ధి, అహంకారమనఁగఁ బార్థ!
అష్టవిధ భేదములతోడ నలరుచుండు
నెపుడు నాదుప్రకృతి, దీని నెఱుఁగుమిపు. 4

ఇద్ది అపరాప్రకృతి, దీని కెఱరమగుచు
నీ యఖిల జగముల ధరియించునెద్ది
జీవభూతమై, యదియె, సుశ్రేష్ఠమైన
యట్టి, మత్ప్రకృతి, తెలియుమా! కిరీటి! 5

ఏతద్యోనీని భూతాని
సర్వాణీత్యుపధారయ ।
అహం కృత్స్నస్య జగతః
ప్రభవః ప్రలయస్తథా ॥ ౬

మత్తః పరతరం నాన్యత్
కించిదస్తి ధనంజయ! ।
మయి సర్వమిదం ప్రోతం
సూత్రే మణిగణా ఇవ ॥ ౭

రసోఽహమప్సు కౌంతేయ!
ప్రభాస్మి శశిసూర్యయోః ।
ప్రణవస్సర్వవేదేషు
శబ్దః ఖే పౌరుషం నృషు ॥ ౮

పుణ్యో గంధః పృథివ్యాం చ
తేజశ్చాస్మి విభావసౌ ।
జీవనం సర్వభూతేషు
తపశ్చాస్మి తపస్విషు ॥ ౯

బీజం మాం సర్వభూతానాం
విద్ధి పార్థ! సనాతనమ్ ।
బుద్ధిర్బుద్ధిమతామస్మి
తేజస్తేజస్వినామహమ్ ॥ ౧౦

బలం బలవతాం చాహం
కామరాగవివర్జితమ్ ।
ధర్మావిరుద్ధో భూతేషు
కామోఽస్మి భరతర్షభ! ॥ ౧౧

ఇట్టి ద్వివిధంబులైన ప్రకృతులె పార్థ!
భూతసంసృష్టికెల్లను మూలమగును:
అట్లె, యీజగతికి హేతువగుదు నేనె
ప్రభవమునకును, మఱియును ప్రళయమునకు. 6

లేదు నాకంటె శ్రేష్ఠమింకేదిగాని,
ఈ చరాచర విశ్వంబులెల్ల నెపుడు
వెలయుచుండును నాయందె తెలిసికొనుము
దారమునఁ గూర్పఁబడిన రత్నమ్ములట్లు. 7

నీటరసమేన, నభమున నినదమేన,
దినకర నిశాకరులయందు దీప్తి నేన,
కనఁగ వేదంబులందు 'ఓం'కారమేన
ఎల్లనరులందు పౌరుషంబేనె పార్థ! 8

ధారుణిస్థలి పుణ్యగంధంబు నేనె,
జాతవేదునియందు తేజమ్ము నేనె,
ప్రాణిచయములకెల్ల జీవనము నేనె,
తాపసోత్తములందు సత్తపము నేనె. 9

భూతజాలంబులకు నెల్ల పుడమిలోన
శాశ్వతంబైనయట్టి బీజమ్ము నేనె,
బుద్ధిమంతులయందలి బుద్ధి నేనె,
సకల తేజస్వులందు తేజమ్ము నేనె. 10

కవ్వడీ! బలాఢ్యులయందు, కామరాగ
వర్జితంబయి యుండెడి బలము నేన
అఖిలభూతసంఘంబులయందుఁ జాత
మహితధర్మానుకూలం కామంబు నేన. 11

యే చైవ సాత్త్వికా భావా
రాజసాస్తామసాశ్చ యే।
మత్త ఏవేతి తాన్విద్ధి
న త్వహం తేషు తే మయి ॥ ౧౨

త్రిభిర్గుణమయైర్భావైః
ఏభిస్సర్వమిదం జగత్ ।
మోహితం నాభిజానాతి
మామేభ్యః పరమవ్యయమ్ ॥ ౧౩

దైవీ హ్యేషా గుణమయీ
మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యంతే
మాయామేతాం తరంతి తే ॥ ౧౪

న మాం దుష్కృతినో మూఢాః
ప్రపద్యంతే నరాధమాః ।
మాయయాఽపహృతజ్ఞానా
ఆసురం భావమాశ్రితాః ॥ ౧౫

చతుర్విధా భజంతే మాం
జనాస్సుకృతినోఽర్జున ।
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ
జ్ఞానీ చ భరతర్షభ ॥ ౧౬

సాత్త్వికము, రాజసము, తామసంబులైన
భావములు సమస్తమును, నావలనఁగలుగు,
కాని, తద్భావములయందు లేను నేను,
అవియె నాయందునుండు పృథాత్మజాత! 12

పార్థ! త్రిగుణమయమగు ఈ భావవితతి
వలన, మోహితంబగు నీ ప్రపంచమెల్ల,
వానికి విలక్షణుండ నవ్యయుఁడనైన
నన్నుఁ దెలియంగనేరదెన్నఁటికినైన. 13

విజయ! త్రిగుణాత్మకంబు, దైవికమునైన
యట్టి, నామాయ దాట శక్యంబుగాదు,
నన్నె శరణంబు నొందుచు నున్నవారు
సులభముగ దీనిఁ దరియింపఁగలరు సుమ్మ. 14

పాపకర్ములు మూఢులై పరగువారు,
మాయచే జ్ఞానముంబాసి మసలువారు,
అసురభావంబునూను నరాధములును,
నన్నుపాసింపఁజాల రెన్నండుఁగాని. 15

అరయ [1]నార్తుఁడు, [2]నర్థార్థియైనవాఁడు,
[3]జ్ఞానియగువాఁడు, [4]జిజ్ఞాసువైనవాఁడు,
ఈ నలుదెగల పుణ్యాత్ము లీధరిత్రి
నన్నుఁ భజియించుచుందురనాతరంబు. 16

1 జన్మబంధమునుగూర్చి దుఃఖించువాఁడు 2 ధర్మముకొఱకు అర్థమునుగోరువాఁడు
3 ఆత్మజ్ఞానము గలిగినవాఁడు 4 ఆత్మతత్త్వమును తెలియ తహతహపడువాఁడు

తేషాం జ్ఞానీ నిత్యయుక్తః
ఏకభక్తిర్విశిష్యతే ।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థం
అహం స చ మమ ప్రియః ॥ ౧౭

ఉదారాః సర్వ ఏవైతే
జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ।
ఆస్థితః స హి యుక్తాత్మా
మామేవానుత్తమాం గతిమ్ ॥ ౧౮

బహూనాం జన్మనామంతే
జ్ఞానవాన్మాం ప్రపద్యతే ।
వాసుదేవస్సర్వమితి
స మహాత్మా సుదుర్లభః ॥ ౧౯

కామైస్తైస్తైర్హృతజ్ఞానాః
ప్రపద్యంతేఽన్యదేవతాః ।
తం తం నియమమాస్థాయ
ప్రకృత్యా నియతాస్స్వయా ॥ ౨౦

యో యో యాం యాం తనుం భక్తః
శ్రద్ధయార్చితుమిచ్ఛతి ।
తస్య తస్యాచలాం శ్రద్ధాం
తామేవ విదధామ్యహమ్ ॥ ౨౧

వారిలో నిత్యయుక్తుండు, భక్తి నన్నె
సేవఁజేసెడి జ్ఞానియే శ్రేష్ఠతముఁడు;
అట్టి వానికి నగుదు నత్యంతహితుఁడ
అటులనే అతఁడును హితుండగును నాకు. 17

అందరు నుదారులేగాని, అందు జ్ఞాని
యన్న నో పార్థ! తలఁతు నా యాత్మగాగ,
అతఁడు యుక్తాత్ముఁడై నన్నె యన్యహంబు
నుత్తమప్రాప్యముగ నమ్మియుండుఁగాదె! 18

ఇల ననేకజన్మంబుల నెత్తి తుదకు
జ్ఞానియై 'వాసుదేవుఁడే' సర్వమంచు
నెంచి నిరతంబు నన్ను భజించుచుండు
నా మహాత్ముఁడు దుర్లభుండగును విజయ! 19

కోరికలచేత జ్ఞానంబుఁ గోలుపోయి,
ఫల్గునా! తమ ప్రకృతికి బద్ధులగుచు
మానవులు, నిష్ఠలును, నియమములనూని,
అన్యదేవతారాధన మాచరింత్రు. 20

ఎవ్వఁ డే యే స్వరూపంబు నిచ్ఛగించి
శ్రద్ధ నర్చింప యత్నంబు సలుపుచుండు,
నతని కా యా స్వరూపంబునందు, అట్టి
శ్రద్ధఁగలిగించుచుందు నిశ్చలముగాగ. 21

స తయా శ్రద్ధయా యుక్తః
తస్యారాధనమీహతే ।
లభతే చ తతః కామాన్
మయైవ విహితాన్ హితాన్ ॥ ౨౨

అన్తవత్తు ఫలం తేషాం
తద్భవత్యల్పమేధసామ్ ।
దేవాన్దేవయజో యాన్తి
మద్భక్తా యాన్తి మామపి ॥ ౨౩

అవ్యక్తం వ్యక్తిమాపన్నం
మన్యంతే మామబుద్ధయః ।
పరం భావమజానంతో
మమావ్యయమనుత్తమమ్ ॥ ౨౪

నాహం ప్రకాశః సర్వస్య
యోగమాయాసమావృతః ।
మూఢోఽయం నాభిజానాతి
లోకో మామజమవ్యయమ్ ॥ ౨౫

వేదాహం సమతీతాని
వర్తమానాని చార్జున! ।
భవిష్యాణి చ భూతాని
మాం తు వేద న కశ్చన ॥ ౨౬

అతఁడు నట్టి శ్రద్ధాసమన్వితుఁడు నగుచు,
నట్టి దేవతారాధన మాచరించి,
తన్ముఖమున నా చే [1]విహితంబులైన
యట్టి యిష్టకామ్యంబుల నందుచుండు. 22

దేవతలఁగొల్చువార లా దేవతలనె
పొందుదురు, ఆ అల్పబుద్ధులైన
వారికి లభించు ఫలమశాశ్వతమె సుమ్ము!
పడయుచుందురు నన్నె మద్భక్తవరులు. 23

అవ్యయము నుత్తమోత్తమంబైన యట్టి
నా [2]పరస్వభావంబుఁ గానంగలేక,
అవని మూఢులు కొందఱవ్యక్తు నన్ను
వ్యక్తరూపునిగా మది నరయుచుంద్రు 24

*యోగమాయావృతంబుగా నున్న కతన,
ఎఱుఁగ దీ మూఢమగులోక మే నజుండ
నవ్యయుఁడనంచు, అజ్ఞానులైనవారి
దృష్టియందుఁ, బ్రకాశింప నేను పార్థ! 25

ఈ చరాచర జగములందెల్ల నేను
జరుగుచున్నట్టి, జరిగిన, జరుగనున్న
సర్వభూతగతులను విస్పష్టముగను
ఎఱుఁగువాఁడను; కాని, నన్నెఱుఁగఁడెవఁడు. 26

---

1. నిర్ణయింపఁబడిన 2. మాయాతీతమైన స్వరూపమును.

* యోగమాయావృతుండనైయున్నకతన,

ఇచ్ఛాద్వేషసముత్థేన
ద్వంద్వమోహేన భారత! ।
సర్వభూతాని సమ్మోహం
సర్గే యాన్తి పరన్తప! ॥ ౨౭

యేషాం త్వన్తగతంపాపం
జనానాం పుణ్యకర్మణామ్ ।
తే ద్వంద్వమోహనిర్ముక్తాః
భజంతే మాం దృఢవ్రతాః ॥ ౨౮

జరామరణమోక్షాయ
మామాశ్రిత్య యతంతి యే ।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నం
అధ్యాత్మం కర్మ చాఖిలమ్ ॥ ౨౯

సాధిభూతాధిదైవం మాం
సాధియజ్ఞం చ యే విదుః ।
ప్రయాణకాలేఽపి చ మాం
తే విదుర్యుక్తచేతసః ॥ ౩౦

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విజ్ఞానయోగోనామ సప్తమోఽధ్యాయః.

అనఘ! రాగవిద్వేషసంజనితమైన
యట్టి, [1]ద్వంద్వరూపమగు మోహమ్ముచేత,
పుట్టినప్పటినుండియు భూతవితతి
మోహజంబాలమునఁబడి మునుఁగుచుండు. 27

పుణ్యకర్మలచేత ఈ పుడమి నెవరు
పాపవర్జితులౌదురో, వారలెల్ల,
ద్వంద్వమోహ నిర్ముక్తులై, భక్తి, నన్నె
దృఢతరవ్రతముల భజియించుచుంద్రు. 28

జగతిలో జరామరణ మోక్షమున కెవరు
యత్న మొనరించుచుంద్రు నన్నాశ్రయించి,
*వారఖిల కర్మముల, పరబ్రహ్మతత్త్వ
మును గ్రహింతురు, సంపూర్ణముగ కిరీటి! 29

కవ్వడీ! అధిభూతునిగ, అధిదైవ
తాధి యజ్ఞమయునిగ నన్నరయుచుండు
నట్టివారు, మరణకాలమందు నేని
[2]యుక్తచేతసులై తెలియుదురు నన్ను. 30

ఇదిఉపనిషత్ప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రంబును,
శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీమద్భగవద్గీతలందు
విజ్ఞానయోగమను ఏడవ అధ్యాయము.

---

1 సుఖదుఃఖాది ద్వంద్వరూపమగు వ్యామోహముచేత.

*వారఖిల కర్మమధ్యాత్మ బ్రహ్మతత్త్వ

2 మనోనిగ్రహులై లేక యోగారూఢులై.



# శ్రీమద్భగవద్గీతా

## అష్టమోఽధ్యాయః

## -: అక్షరపరబ్రహ్మయోగః :-

అర్జున ఉవాచ:-

కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం
కిం కర్మ పురుషోత్తమ! ।
అధిభూతం చ కిం ప్రోక్తం
అధిదైవం కిముచ్యతే ॥ ౧

అధియజ్ఞః కథం కోఽత్ర
దేహేఽస్మిన్మధుసూదన! ।
ప్రయాణకాలే చ కథం
జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥ ౨

శ్రీభగవానువాచ:-

అక్షరం బ్రహ్మ పరమం
స్వభావోఽధ్యాత్మముచ్యతే ।
భూతభావోద్భవకరో
విసర్గః కర్మసంజ్ఞితః ॥ ౩

అధిభూతం క్షరోభావః
పురుషశ్చాధిదైవతమ్ ।
అధియజ్ఞోఽహమేవాత్ర
దేహే దేహభృతాంవర ॥ ౪

ఓమ్

# గీతా సుధా లహరి

## ఎనిమిదవ అధ్యాయము

### -: అక్షరపరబ్రహ్మయోగము :-

అర్జునుఁడిట్లనియె:-

అరయ నెయ్యది బ్రహ్మ? మధ్యాత్మమెద్ది?
ఏది యధిభూత? మాకర్మమెట్టిదియగు,
దేని నధిదైవమందురు, వీనినెల్ల
వివరముగ నాకుఁ దెల్పుమా! విబుధవంద్య! 1

దేవ! అధియజ్ఞుఁడెవ్వడీ దేహమందు?
వాని నెవ్విధి గుర్తింప వలనుపడును?
అంత్యకాలాన నియతాత్ములైనవార
లెట్లు తెలియంగఁగలరు నిన్నెఱుఁగఁ జెపుమ! 2

భగవానుఁడిట్లనియె:-

[1]పరమ [2]మక్షరమైనది బ్రహ్మమండ్రు
అరయఁగా [3]స్వభావమునె అధ్యాత్మమండ్రు
భూతభావసముద్భవహేతువైన
త్యాగరూపక్రియ కర్మమండ్రు పార్థ! 3

అవని. క్షరభావమునె అధిభూతమందు,
అరయ పురుషుండె అధిదైవమనఁగనొప్పు,
ఫల్గునా! యీ దేహంబునం బరఁగునట్టి,
ఏనె అధియజ్ఞుఁడనఁబడుచు నెఱుఁగుమీవు. 4

---

*1 నిరతిశయమైన 2 నాశరహితమైన 3 ఆత్మభావము లేక ప్రత్యగాత్మ రూపము.*

అంతకాలే చ మామేవ
స్మరన్ముక్త్వా కళేబరమ్ ।
యః ప్రయాతి స మద్భావం
యాతి నాస్త్యత్ర సంశయః ॥ ౫

యం యం వాపి స్మరన్ భావం
త్యజత్యన్తే కళేబరమ్ ।
తం తమేవైతి కౌంతేయః
సదా తద్భావభావితః ॥ ౬

తస్మాత్సర్వేషు కాలేషు
మామనుస్మర యుధ్య చ ।
మయ్యర్పితమనోబుద్ధిః
మామేవైష్యస్యసంశయః ॥ ౭

అభ్యాసయోగయుక్తేన
చేతసా నాన్యగామినా
పరమం పురుషం దివ్యం
యాతి పార్థానుచిన్తయన్ ॥ ౮

కవిం పురాణమనుశాసితారం
అణోరణీయాంసమనుస్మరేద్యః ।
సర్వస్య ధాతారమచింత్యరూపం
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥ ౯

ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ ।
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్
స తం పరం పురుషముపైతి దివ్యమ్ ॥ ౧౦

మరణసమయంబునందు నెమ్మదిని నన్నె,
చింతసేయుచు తనువు త్యజించునట్టి
వాఁడు, నాదు భావంబునే పడయఁగలఁడు;
సందియంబిందులేదు లేశమ్ముఁ గూడ. 5

ఎవ్వఁడేభావమును స్మరియించుకొంచు,
అంత్యమున వీడి చనునో కాయమ్ము, వాఁడు
దానినే సతతంబును దలఁచుచుండు
గాన, ఆభావమునె పొందఁగలఁడు పార్థ! 6

అందుచే సర్వకాలంబులందు నన్నె
స్మరణసేయుచు సమరమ్ము సలుప లెమ్ము!
మనసు బుద్ధియు నాకె అర్పణమొనర్ప
పొందుదువు నన్నె, సందియంబిందులేదు. 7

ఉరుతరాభ్యాసయోగంబునూని పార్థ!
నెమ్మిమీర నేకాగ్రచిత్తమ్ముచేత
దివ్య, పరమపురుషుని చింతించుచున్న
వాఁడు, తద్దివ్యపురుషునే పడయఁగలఁడు. 8

సర్వశాసకు, సర్వజ్ఞు, సకలలోక
రక్షకు, నచింత్యరూపు, పురాణపురుషు,
దివ్యు, సూక్ష్మాతిసూక్ష్ము, [1]నాదిత్యవర్ణు,
గాఢమోహాంధకార వికారదూరు; 9

మరణసమయాన, నిశ్చల మానసమున
యోగబలముతో సద్భక్తియుక్తుఁడగుచు,
బొమలనడుమ నిల్కడగ ప్రాణమును నిలిపి
స్మరణసేయువాడొందు తత్పరమపురుషు. 10

1 సూర్యసన్నిభుఁడు (స్వయంప్రకాశరూపుడు)

యదక్షరం వేదవిదో వదన్తి
విశన్తి యద్యతయో వీతరాగాః ।
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥ ౧౧

సర్వద్వారాణి సంయమ్య
మనో హృది నిరుధ్య చ ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణం
ఆస్థితో యోగధారణమ్ ॥ ౧౨

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ
వ్యాహరన్మామనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్ దేహం
స యాతి పరమాం గతిమ్ ॥ ౧౩

అనన్యచేతాస్సతతం
యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ!
నిత్యయుక్తస్య యోగినః ॥ ౧౪

మాముపేత్య పునర్జన్మ
దుఃఖాలయమశాశ్వతమ్ ।
నాప్నువన్తి మహాత్మానః
సంసిద్ధిం పరమాం గతాః ॥ ౧౫

ఆబ్రహ్మభువనాల్లోకాః
పునరావర్తినోఽర్జున! ।
మాముపేత్య తు కౌంతేయ!
పునర్జన్మ న విద్యతే ॥ ౧౬

ఏది అక్షరమందురో వేదవిదులు,
కాంక్షతు దేనిని యతులు రాగమ్ము వీడి,
దేనికై బ్రహ్మచర్యంబుఁ బూనుచుందు,
రట్టి పదముఁ దెల్పెద సంగ్రహముగ నీకు. 11

నియతి నింద్రియ ద్వారముల్ నిగ్రహించి,
మదిని హృదయాంతరంబున కుదురపఱచి,
ప్రాణమును సహస్రారచక్రమునఁజేర్చి,
యోగధారణంబూని, సర్వోత్తమమగు
బ్రహ్మవాచక 'మోం'కారవర్ణ ముచ్చ
రించుచును, భక్తి నన్ను స్మరించుకొంచు,
ఎవ్వడీకాయముఁ త్యజియించి చనునో
వాఁడు పడయఁగా గల్గును పరమగతిని. 12, 13

ధరణియందు అనన్యచిత్తమున నన్ను
జీవితాంతమెవఁడు చింతసేయుచుండు,
అట్టి నిత్యయోగారూఢుఁడైనవాని
కర్జునా! కడు సులభుండ నగుదు నేను. 14

వినుము, పరమ సంసిద్ధిబొందిన మహాత్మ
లెల్ల, నన్నుఁబొందుచు పార్థ! యెన్నడేని,
అస్థిరంబును, దుఃఖాలయంబునైన
యట్టి, ఆ పునర్జన్మంబు నందఁబోరు. 15

అనఘ! ఆబ్రహ్మలోకపర్యంత మెట్టి
భువనముల కేగినన్ జన్మఁబొందవలయు,
నన్నుఁ బడసిన వారలెన్నండుఁగాని,
తిరిగి జన్మింపరింక కుంతీకుమార! 16

సహస్రయుగపర్యన్తం
అహర్యద్బ్రహ్మణో విదుః ।
రాత్రిం యుగసహస్రాన్తాం
తేఽహోరాత్రవిదో జనాః ॥ ౧౭

అవ్యక్తాద్వ్యక్తయస్సర్వాః
ప్రభవన్త్యహరాగమే ।
రాత్ర్యాగమే ప్రలీయన్తే
తత్రైవావ్యక్తసంజ్ఞకే ॥ ౧౮

భూతగ్రామస్స ఏవాయం
భూత్వా భూత్వా ప్రలీయతే ।
రాత్ర్యాగమేఽవశః పార్థ!
ప్రభవత్యహరాగమే ॥ ౧౯

పరస్తస్మాత్తు భావోఽన్యో-
ఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః ।
యస్స సర్వేషు భూతేషు
నశ్యత్సు న వినశ్యతి ॥ ౨౦

అవ్యక్తోఽక్షరఇత్యుక్తః
తమాహుః పరమాం గతిమ్ ।
యం ప్రాప్య న నివర్తన్తే
తద్ధామ పరమం మమ ॥ ౨౧

పురుషస్సపరః పార్థ!
భక్త్యా లభ్యస్త్వనన్యయా ।
యస్యాన్తఃస్థాని భూతాని
యేన సర్వమిదం తతమ్ ॥ ౨౨

ఇల [1]నహోరాత్రపరిమాణమెఱుఁగువారు,
బ్రహ్మకు సహస్రయుగములు పగలుగా, స
హస్రయుగములు రాత్రిగా నలరునంచు
చక్కఁగాఁ జెప్పుచుందురు నిక్కమరసి. 17

బ్రహ్మదేవుని పగటి యారంభమందు
పార్థ! వ్యక్తప్రపంచ మవ్యక్తమైన
ప్రకృతినుండి పుట్టు; నదియె బ్రహ్మదేవు
రాత్రి రాగ నడంగుఁ దత్ప్రకృతి యందె. 18

అస్వతంత్రమై భూతచయమ్ము లెల్ల
పుట్టిపుట్టి యడంగును బ్రొద్దుగ్రుంక;
ప్రొద్దు పొడిచినంత మఱల పుట్టువొందు
చుండు, కర్మవశ్యమగుచు పాండుతనయ! 19

అరయ, అవ్యక్తమునకంటె అన్యమైన
ఉత్తమంబగు అవ్యక్తమొండు గలదు:
ఫల్గునా! ఆ సనాతనబ్రహ్మమెపుడు
నాశమొందదు, భూతముల్ నాశమైన. 20

అరయ నక్షరమంచు నవ్యక్తమంచు,
పరమగతియంచు నెద్దాని పలుకుచుందు,
రేది బడసిన జన్మంబులేదొ మఱల,
అదియె నా మత్పరంధామపదము పార్థ! 21

ఎవనియందుండు భూతంబులెల్ల, ఎవఁడు
నిఖిలజగముల వ్యాపించి నిండియుండు,
అట్టి పురుషవరేణ్యుఁడనన్యమైన
భక్తి చేతనే వశుఁడగు, పాండుతనయ! 22

1 రాత్రింబవళ్ళ కాలతత్త్వమును దెలిసినవారు.

యత్ర కాలే త్వనావృత్తిం
ఆవృత్తిం చైవ యోగినః ।
ప్రయాతా యాన్తి తం కాలం
వక్ష్యామి భరతర్షభ! ॥ ౨౩

అగ్నిర్జ్యోతిరహశ్శుక్ల-
షణ్మాసా ఉత్తరాయణమ్ ।
తత్రప్రయాతా గచ్ఛన్తి
బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥ ౨౪

ధూమో రాత్రిస్తథాకృష్ణ-
షణ్మాసా దక్షిణాయనమ్ ।
తత్ర చాన్ద్రమసం జ్యోతిః
యోగీ ప్రాప్య నివర్తతే ॥ ౨౫

శుక్లకృష్ణే గతీహ్యేతే
జగతశ్శాశ్వతే మతే ।
ఏకయా యాత్యనావృత్తిం
అన్యయాఽఽవర్తతే పునః ॥ ౨౬

నైతే సృతీ పార్థ! జానన్
యోగీ ముహ్యతి కశ్చన ।
తస్మాత్సర్వేషు కాలేషు
యోగయుక్తో భవార్జున! ॥ ౨౭

వేదేషు యజ్ఞేషు తపస్సుచైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్ ।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థానముపైతి చాద్యమ్ ॥ ౨౮

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే అక్షరపరబ్రహ్మయోగోనామ అష్టమోఽధ్యాయః.

మరణమొందిన యోగులు మఱలనెపుడు
పుట్టుచుందురో, తిరిగియు పుట్టఁబోరో,
అట్టి కాలప్రభావమ్మునంత నీకు
తెలియఁజేసెద వినుము కుంతీతనూజ! 23

అరయ షణ్మాసముల సుత్తరాయణమున
శుక పక్షాగ్ని వాసరజ్యోతులందు,
తనువు త్యజియించు బ్రహ్మవేత్తలు సతమ్ము
బ్రహ్మమునె పొందుచుందురు పాండవేయ! 24

దక్షిణాయన షణ్మాసతరుణములను
కృష్ణపక్షధూమనిశల మృతినిఁబొందు
యోగి, చంద్రసంబంధమౌ జ్యోతినొంది
మఱల పుట్టుచునుండును మహితలమున. 25

శుక్లకృష్ణగతులు రెండుఁజూడ నెపుడు
శాశ్వతంబులై వరలును జగతిలోన,
ఇందు నొక్కటి జన్మరాహిత్యమొసఁగు,
మఱియొకటి పొందఁజేయు, జన్మమ్ము మఱల. 26

ఇట్టి ద్వివిధమార్గంబుల నెఱుఁగు యోగి
యొక్కఁడేనియు మోహమ్ము నొందఁబోడు
కాన, యోగయుక్తుండవు గమ్ము నీవు
సర్వకాలంబులందు నో సవ్యసాచి! 27

దీని విధమెల్ల చక్కఁగాఁదెలియుయోగి,
వేదయజ్ఞతపోదానవిహితగతులఁ
గలుగు ఫలమునకధికమౌ ఫలముఁబొంది,
ఆద్యమగు పరమపదమ్ము నందఁగలఁడు. 28

ఇది ఉపనిషత్ప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రంబును,
శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీమద్భగవద్గీతలందు
అక్షరపరబ్రహ్మయోగమను ఎనిమిదవ అధ్యాయము.



# శ్రీమద్భగవద్గీతా

## నవమోఽధ్యాయః

### -: రాజవిద్యారాజగుహ్యయోగః :-

శ్రీభగవానువాచ:-

ఇదం తు తే గుహ్యతమం
ప్రవక్ష్యామ్యనసూయవే ।
జ్ఞానం విజ్ఞానసహితం
యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥ ౧

రాజవిద్యా రాజగుహ్యం
పవిత్రమిదముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం
సుసుఖం కర్తుమవ్యయమ్ ॥ ౨

అశ్రద్దధానాః పురుషా
ధర్మస్యాస్య పరంతప! ।
అప్రాప్య మాం నివర్తంతే
మృత్యుసంసారవర్త్మని ॥ ౩

మయా తతమిదం సర్వం
జగదవ్యక్తమూర్తినా ।
మత్స్థాని సర్వభూతాని
న చాహం తేష్వవస్థితః ॥ ౪

న చ మత్స్థాని భూతాని
పశ్య మే యోగమైశ్వరమ్ ।
భూతభృన్నచ భూతస్థో
మమాత్మా భూతభావనః ॥ ౫

ఓమ్

# గీతా సుధా లహరి

## తొమ్మిదవ అధ్యాయము

### -: రాజవిద్యారాజగుహ్యయోగము :-

భగవానుఁడిట్లనియె:-

దేనిఁ దెలిసిన, నశుభముల్ దీఱిచనునొ,
అట్టి గూఢాతిగూఢమై యలరుచుండు
దాని, విజ్ఞానసహితమౌ జ్ఞానమింక
తెలియఁజేసెద, వినుము, కుంతీకుమార! 1

ప్రథితవిద్యల యందిది రాజవిద్య,
పరమగోప్యమ్ము, ధర్మ్యమ్ము, పావనమ్ము,
అనుభవైకసువేద్యమ్ము, అవ్యయమ్ము,
అభ్యసింపంగ మిగుల సౌఖ్యమ్ము సుమ్మ! 2

ఇట్టి ధర్మంబునందొక యించుకేని
శ్రద్ధలేనట్టి వారలు, సవ్యసాచి!
మరణరూపక సంసారమార్గమందు
తిరుగుచుందురు, నన్ను గుర్తింపలేక. 3

పూర్తిగా, మామకావ్యక్తమూర్తిచేత
వ్యాప్తమైయుండు నిఖిలప్రపంచమెపుడు,
అఖిలభూతజాతమ్ము నా యందె యుండు,
వాని యందెన్నఁడేనున్నవాఁడఁ గాను. 4

భూతములును నాయందు లేవు, కనుమైశ్వ
రమగు, మద్యోగమీవు; భూతములనెల్ల
తాను భరియించి రక్షించుఁగాని, మామ
కాత్మ యీభూతజాతంబునందు లేదు. 5

యథాఽఽకాశస్థితో నిత్యం
వాయుస్సర్వత్రగో మహాన్ ।
తథా సర్వాణి భూతాని
మత్స్థానీత్యుపధారయ ॥ ౬

సర్వభూతాని కౌంతేయ
ప్రకృతిం యాన్తి మామికామ్ ।
కల్పక్షయే పునస్తాని
కల్పాదౌ విసృజామ్యహమ్ ॥ ౭

ప్రకృతిం స్వామవష్టభ్య
విసృజామి పునః పునః ।
భూతగ్రామమిమం కృత్స్నం
అవశం ప్రకృతేర్వశాత్ ॥ ౮

న చ మాం తాని కర్మాణి
నిబధ్నంతి ధనంజయ! ।
ఉదాసీనవదాసీనం
అసక్తం తేషు కర్మసు ॥ ౯

మయాఽధ్యక్షేణ ప్రకృతిః
సూయతే సచరాచరమ్ ।
హేతునానేన కౌంతేయః
జగద్విపరివర్తతే ॥ ౧౦

అవజానన్తి మాం మూఢాః
మానుషీం తనుమాశ్రితమ్ ।
పరం భావమజానన్తో
మమ భూతమహేశ్వరమ్ ॥ ౧౧

సర్వగతమగు వాయువు శాశ్వతముగ
ఆకసమ్మున నెటులుండు, నటులె విజయ!
ఎపుడు ఈభూతజాలమ్ములెల్లఁ గూడ,
నరయ నాయందునుండునంచెఱుగు మింక. 6

అఖిలజీవజాలములు కల్పాంతమందు
లీనమగు మదీయ ప్రకృతిలోన పార్థ!
నేనె కల్పాదియందు నవ్వాని మఱల,
సృష్టి యొనరించువాఁడ, సురేంద్రతనయ! 7

అరయ, తమతమ ప్రకృతి తా ననుసరించి,
అస్వతంత్రమైయుండు భూతాళినెల్ల,
ప్రకృతి వశమున మాటిమాటికి కిరీటి!
ఏ సృజించెదనంచు నీవెఱుఁగుమయ్య! 8

ఇట్టి కర్మంబులందు నాకెపుడు సక్తి
యుండదావంత, నే తటస్థుండనగుచుఁ
బరగుచుండెదఁ గాన నో పాండుతనయ!
కర్మబంధమునందు నేను కట్టుపడను. 9

ప్రకృతి సృజియించు సచరాచరప్రపంచ
మంతయును ఆత్మనగు నేను సాక్షిగాఁగ;
ఇట్టి హేతువుచేతనే యీ జగమ్ము
సతతము వర్తించుచుండును, సవ్యసాచి! 10

అఖిలభూతమహేశుండనౌ మదీయ
మైన పరమాత్మతత్త్వమ్ము నరయలేక,
మనుజదేహాశ్రితుండనై మసలుచున్న
నన్నవజ్ఞ గావింతురజ్ఞానులెపుడు. 11

మోఘాశా మోఘకర్మాణో
మోఘజ్ఞానా విచేతసః ।
రాక్షసీమాసురీంచైవ
ప్రకృతిం మోహినీం శ్రితాః ॥ ౧౨

మహాత్మానస్తు మాం పార్థ!
దైవీం ప్రకృతిమాశ్రితాః ।
భజంత్యనన్యమనసో
జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్ ॥ ౧౩

సతతం కీర్తయంతో మాం
యతంతశ్చ దృఢవ్రతాః ।
నమస్యన్తశ్చ మాం భక్త్యా
నిత్యయుక్తా ఉపాసతే ॥ ౧౪

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే
యజంతో మాముపాసతే ।
ఏకత్వేన పృథక్త్వేన
బహుధా విశ్వతోముఖమ్ ॥ ౧౫

అహం క్రతురహం యజ్ఞః
స్వధాహమహమౌషధమ్ ।
మన్త్రోఽహమహమేవాజ్యం
అహమగ్నిరహం హుతమ్ ॥ ౧౬

వ్యర్థకాములు మఱియును వ్యర్థమతులు,
వ్యర్థకర్ములు, అవివేకులైనవారు,
రాక్షసాసురమోహినీప్రకృతి నాశ్ర
యించి, నిరతమ్ము జగతిఁ జరించుచుంద్రు. 12

ఇఁక మహాత్ములో? దైవప్రకృతి సమాశ్ర
యించుచు, అనన్యచిత్తులై యెపుడు నన్ను,
అఖిలభూతకారణునిగ, అవ్యయునిగ
నెంచి, సద్భక్తితో భజియించుచుంద్రు. 13

నన్ను నిరతంబు కీర్తించుచున్నవారు,
యత్నపరులు, దృఢవ్రతు లతుల భక్తి
యుక్తి నెలఁగువారలు, నిత్యయోగులెల్ల,
శ్రేష్ఠముగ నన్నె మది నుపాసించుచుంద్రు. 14

జ్ఞానయజ్ఞమ్ముచేత కొందఱు భజింత్రు,
కొందఱేకస్వరూపుగా, కొందఱేమొ
భిన్నరూపునిగా నెంచి, వివిధగతుల,
పూజఁగావింత్రు విశ్వతోముఖుని నన్ను. 15

నేనె [1]క్రతువును, [2]యజ్ఞముఁ నేనె, [3]పైతృ
కాన్నమును నేనె, మంత్రమ్ము, నౌషధంబు
నేనె, మఱి [4]యగ్నియు [5]హవిస్సు నేనె యగుదు
[6]హుతము సైతము నేనేకదోయి పార్థ! 16

1 అగ్నిష్టోమాదులు 2 పంచమహాయజ్ఞములు (బ్రహ్మ, పితృ, దేవ, భూత, మనుష్య యజ్ఞములు) 3 పితృపిండము 4 హోమాగ్ని 5 అగ్నిహోత్రమునందు వేల్చుటకు నెయ్యి మున్నగు ద్రవ్యములచే జనులు పెట్టిన అన్నము 6 హోమకర్మము

పితాహమస్య జగతో
మాతా ధాతా పితామహః ।
వేద్యం పవిత్రమోంకార
ఋక్సామ యజురేవ చ ॥ ౧౭

గతిర్భర్తా ప్రభుస్సాక్షీ
నివాసశ్శరణం సుహృత్ ।
ప్రభవః ప్రలయః స్థానం
నిధానం బీజమవ్యయమ్ ॥ ౧౮

తపామ్యహమహం వర్షం
నిగృహ్ణామ్యుత్సృజామి చ ।
అమృతంచైవ మృత్యుశ్చ
సదసచ్చాహమర్జున! ॥ ౧౯

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే ।
తే పుణ్యమాసాద్య సురేన్ద్రలోకం
అశ్నన్తి దివ్యాన్దివి దేవభోగాన్ ॥ ౨౦

తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి ।
ఏవం త్రయీధర్మమనుప్రపన్నా
గతాగతం కామకామా లభన్తే ॥ ౨౧

అనన్యాశ్చిన్తయన్తో మాం
యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం
యోగక్షేమం వహామ్యహమ్ ॥ ౨౨

తలఁప జగతికి తల్లియుఁదండ్రి నేనె,
ధాతయును నేనె, మఱియును తాత నేనె
వేదములు నేనె. పరమ పవిత్రమైన
ప్రణవమును నేనె. తెలియుము పాండుతనయ! 17

భర్తయు, సఖుండు, గతియును, ప్రభువు నేనె,
శరణమును, నిధియును, నివాసమ్ము నేనె,
అనఘ! సృష్టిస్థితిప్రళయములు నేనె,
సాక్షియును, అవ్యయమగు బీజమ్ము నేనె. 18

వానఁగురిపించి, నిలిపెడివాఁడ నేనె,
వేడిమినిఁ గల్గఁజేసెడివాఁడ నేనె,
మృత్యువును నేనె. మఱియు [1]నమృతము నేనె,
జగతి [2]సదసత్తులున్ నేనె, సవ్యసాచి! 19

వేదవిదులు యజ్ఞముల సేవించి నన్ను
సోమపానంబుఁ గావించి శుద్ధులగుచు,
పుణ్య దేవేంద్రలోకమ్ముఁ బొంది, యచట
దివ్యభోగసౌఖ్యంబులఁ దేలుచుంద్రు. 20

నాకసౌఖ్యమ్ము నీరీతి ననుభవించి,
పుణ్యము క్షయింప, మనుజులై పుట్టుచుంద్రు;
కామములఁగోరు వైదికపరుల్మరిట్లు
ఫల్గునా! [3]గతాగతములఁ బడయుచుంద్రు. 21

అర్జునా! అనన్యమనస్కులగుచు, నెవరు
చింత సేయుచు, నన్నుపాసించుచుందు,
రట్టి నిత్యాభియుక్తులై యలరువారి
యోగమ్ము, క్షేమము, వహించుచుందు నేనె. 22

1 మరణరాహిత్యము 2 సత్తు, అసత్తు (వ్యక్తము, అవ్యక్తము) 3 రాకపోకలు (జననమరణములు)

యేఽప్యన్యదేవతాభక్తా
యజన్తే శ్రద్ధయాన్వితాః ।
తేఽపి మామేవ కౌన్తేయ!
యజన్త్యవిధిపూర్వకమ్ ॥ ౨౩

అహం హి సర్వయజ్ఞానాం
భోక్తా చ ప్రభురేవ చ ।
న తు మామభిజానన్తి
తత్త్వేనాతశ్చ్యవన్తి తే ॥ ౨౪

యాన్తి దేవవ్రతాన్ దేవాన్
పితౄన్ యాన్తి పితృవ్రతాః ।
భూతాని యాన్తి భూతేజ్యా
యాన్తి మద్యాజినోఽపి మామ్ ॥ ౨౫

పత్రం పుష్పం ఫలం తోయం
యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహం భక్త్యుపహృతం
అశ్నామి ప్రయతాత్మనః ॥ ౨౬

యత్కరోషి యదశ్నాసి
యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌన్తేయ!
తత్కురుష్వ మదర్పణమ్ ॥ ౨౭

శుభాశుభఫలైరేవం
మోక్ష్యసే కర్మబన్ధనైః ।
సన్న్యాసయోగయుక్తాత్మా
విముక్తో మాముపైష్యసి ॥ ౨౮

అన్యదేవతాభక్తులై, అహరహమ్ము
శ్రద్ధ వెలయించి పూజలు సలుపువార,
[1]లవిధిపూర్వకముగ నన్నె అర్చసేయు
వారలగుదురు, పాండుభూపాలతనయ! 23

సర్వయజ్ఞంబులకును ఈ జగతియందు,
నేనె భోక్తను, ప్రభుఁడను నేనె యంచు,
నాదు తత్త్వమ్ము నెఱుఁగక నడచు వారు,
[2]పతనమొందుచునుందురు వాస్తవముగ. 24

దేవతల, భూతముల, పితృదేవతలను,
పూజలొనరించువారెల్లఁ బొందుచుంద్రు
వరుసగ తదీయలోకముల్, పురుషవరా!
నన్ను సేవించువారలో? నన్నె గాంత్రు. 25

ఫలము, పత్రమ్ము, పుష్పమ్ము, జలము నేని
భక్తితో నా కెవఁడు సమర్పణమొనర్చు,
అట్టి పరిశుద్ధమానసుండైన వాని
[3]భక్త్యుపాయనమును, గొనువాఁడ నేను. 26

ఎద్ది చేయుదువో, భుజియింతు వెద్ది,
ఎద్ది హోమంబొనర్తువో, ఎద్ది దాన
మొసఁగెదవో, యెట్టి తపము చేయుదువో, నీవు
వానినెల్లను, నాకె యర్పణమొనర్పు. 27

ఇవ్విధి శుభాశుభఫలంబులిచ్చునట్టి,
కర్మబంధాళినుండి [4]మోక్షమ్ము నొంది,
అనఘ! [5]సన్న్యాసయోగయుక్తాత్ముఁడవు, [6]వి
ముక్తుఁడవునయి, నను నీవు పొందఁగలవు. 28

---

1 అజ్ఞానముతో (ఆత్మతత్త్వమునెఱుఁగనిబుద్ధితో) 2 పునర్జన్మమును బొందుచుందురు 3 భక్తితోసమర్పించిన కానుకను 4 విడుదలబడి 5 కర్మఫలత్యాగరూపకమగు యోగముతో గూడినవాఁడు 6 బంధరహితుఁడవై

సమోఽహం సర్వభూతేషు
న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ।
యే భజన్తి తు మాం భక్త్యా
మయి తే తేషు చాప్యహమ్ ॥ ౨౯

అపిచేత్సుదురాచారో
భజతే మామనన్యభాక్ ।
సాధురేవ స మన్తవ్యః
సమ్యగ్వ్యవసితో హి సః ॥ ౩౦

క్షిప్రం భవతి ధర్మాత్మా
శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి ।
కౌంతేయ! ప్రతిజానీహి
న మే భక్తః ప్రణశ్యతి ॥ ౩౧

మాం హి పార్థ! వ్యపాశ్రిత్య
యేఽపి స్యుః పాపయోనయః ।
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాః
తేఽపియాన్తి పరాం గతిమ్ ॥ ౩౨

కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా
భక్తా రాజర్షయస్తథా ।
అనిత్యమసుఖం లోకం
ఇమం ప్రాప్య భజస్వ మామ్ ॥ ౩౩

మన్మనా భవ మద్భక్తో
మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి యుక్త్వైవం
ఆత్మానం మత్పరాయణః ॥ ౩౪

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే రాజవిద్యారాజగుహ్య
యోగోనామ నవమోఽధ్యాయః.

సముఁడనై యుండు సర్వభూతములయందు,
ప్రియుఁడు లేఁడెందు నాకు నప్రియుఁడు లేఁడు,
భక్తి నన్ను భజించెడు వారలెపుడు
నుండ్రు నాయందు, వారియందుందు నేను. 29

కడు దురాచారపరుఁడైనఁగాని, సతము
నన్ననన్యభక్తి భజించుచున్నయెడల,
పరమసాధువుగా నెంచఁబడుచునుండు
అతఁడు స్థిరతరచిత్తుఁడై యలరుకతన. 30

అతఁడు శీఘ్రతరముగ, ధర్మాత్ముఁడగుచు,
పరమ శాశ్వతశాంతిని బడయఁగలఁడు;
నాదు భక్తుఁడెన్నఁటికిని నాశమొంద
డంచు, దృఢముగా ప్రకటింపుమవనిలోన. 31

పరమపాపాత్ములైనను, వైశ్యులైన,
శూద్రసంభవులైనను, సుదతులైన,
ఎట్టివారైన, నన్నాశ్రయించిరేని,
పరమపదమును అవలీలఁ బడయఁగలరు. 32

ఇంక, పుణ్యులు భక్తులై యెసఁగు విప్ర
వరుల, రాజర్షులనుగూర్చి పలుకనేల?
ఇహమశాశ్వతము, సుఖవిహీనమంచు
నెంచి, నిరతమ్ము నన్ను భజించుమయ్య! 33

స్వాంతమున నన్నె నిల్పి, నా భక్తుఁడగుము,
నన్నె అర్చించి, సేయుము నాకె ప్రణతి,
నీవు నీయాత్మ నాయందె నిలుప నిట్లు,
అందెదవు నన్నె, మత్పరాయణుఁడవగుచు. 34

ఇతి ఉపనిషత్ప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రంబును,
శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీమద్భగవద్గీతలందు
రాజవిద్యారాజగుహ్యయోగమను తొమ్మిదవ అధ్యాయము.



# శ్రీమద్భగవద్గీతా

## దశమోఽధ్యాయః

### -: విభూతియోగః :-

శ్రీభగవానువాచ:-

భూయ ఏవ మహాబాహో!
శృణు మే పరమం వచః ।
యత్తేఽహం ప్రీయమాణాయ
వక్ష్యామి హితకామ్యయా ॥ ౧

న మే విదుస్సురగణాః
ప్రభవం న మహర్షయః ।
అహమాదిర్హి దేవానాం
మహర్షీణాం చ సర్వశః ॥ ౨

యో మామజమనాదిం చ
వేత్తి లోకమహేశ్వరమ్ ।
అసమ్మూఢస్స మర్త్యేషు
సర్వపాపైః ప్రముచ్యతే ॥ ౩

బుద్ధిర్జ్ఞానమసమ్మోహః
క్షమా సత్యం దమశ్శమః ।
సుఖం దుఃఖం భవోఽభావో
భయం చాఽభయమేవ చ ॥ ౪

అహింసా సమతాతుష్టిః
తపో దానం యశోఽయశః ।
భవన్తి భావా భూతానాం
మత్తఏవ పృథగ్విధాః ॥ ౫

ఓమ్

# గీతాసుధాలహరి

## పదియవ అధ్యాయము

### -: విభూతియోగము :-

భగవానుఁడిట్లనియె:-

నేను నీకుపదేశించు దాని, భక్తి
నాలకించుచునున్న నీ మేలుఁగోరి
పలుకుచున్నాఁడ, మఱియొక పరమమైన
వాక్యమును, వినుమ తత్పూర్తి, పాండుతనయ! 1

నా ప్రభావమావంత దానంగనేర
రమరనికరంబులైన మహర్షులైన;
అన్నివిధముల దేవమహర్షులకును,
నేనెకాదె మూలంబయి నెగడువాఁడ. 2

అజుఁడనంచు అనాద్యుడనంచు, నన్ను
అఖిలలోకమహేశ్వరుండంచు నెఱుఁగు
వాఁడు, మనుజులలో మౌఢ్యవర్జితుఁడయి,
పాపములనుండి విడువంగఁబడును, పార్థ! 3

బుద్ధియును, జ్ఞానమును, అసమ్మోహనమ్ము,
సత్యమును, సుఖదుఃఖముల్, శమముఁదమము,
భయమభయమును, [1]భవమ్మభావమ్ము, క్షమయు,
సమతయును, తృప్తియును, అహింసయును, మఱియు
తపము, దానమ్ములును, యశమపయశమ్ము
ననెడు బహువిభావపయమ్ము లెపుడు
ప్రాణులకుఁ గల్గుచుండు నావలన పార్థ! 4, 5

---

1 జన్మవినాశములు.

మహర్షయస్సప్త పూర్వే
చత్వారో మనవస్తథా ।
మద్భావా మానసా జాతా
యేషాం లోకఇమాః ప్రజాః ॥ ౬

ఏతాం విభూతిం యోగం చ
మమ యోవేత్తి తత్త్వతః ।
సోఽవికంపేన యోగేన
యుజ్యతే నాత్ర సంశయః ॥ ౭

అహం సర్వస్య ప్రభవో
మత్తస్సర్వం ప్రవర్తతే ।
ఇతి మత్వా భజంతే మాం
బుధా భావసమన్వితాః ॥ ౮

మచ్చిత్తా మద్గతప్రాణా
బోధయన్తః పరస్పరమ్ ।
కథయన్తశ్చ మాం నిత్యం
తుష్యన్తి చ రమన్తి చ ॥ ౯

తేషాం సతతయుక్తానాం
భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగం తం
యేన మాముపయాన్తి తే ॥ ౧౦

తేషామేవానుకమ్పార్థం
అహమజ్ఞానజం తమః ।
నాశయామ్యాత్మభావస్థో
జ్ఞానదీపేన భాస్వతా ॥ ౧౧

ఎవరికీలోకమునఁ బుట్టిరెల్లప్రజలు,
అట్టి పూర్వులౌ సప్తమహర్షులు మఱి
మనుచతుష్టయము, మదీయ మానసమున
ప్రభవమొందిరి మద్గతభావులగుచు. 6

ఇట్టి [1]మద్విభూతియు, [2]యోగమెవఁడెఱుంగు
వాస్తవంబుగ జగతిలో వాఁడు, విజయ!
నిశ్చలసుయోగయుక్తుఁడై నెగడుచుండు,
సంశయంబిందులేదు లేశంబుఁగూడ. 7

నేనె ప్రభవకారణుఁడ నీ నిఖిలమునకు,
నావలననే సమస్తంబు నడచుచున్న
దంచు భావించి నన్ను భజించుచుంద్రు
పరమతత్త్వార్థవేత్తలై పరగుబుధులు. 8

మద్గతప్రాణులును మఱి మన్మనస్కు-
లగు మహాత్ములు, నా పవిత్రగుణములను
సోత్సుకతఁ గీర్తనమొనర్చి, యొకరికొకరు
చెప్పుకొని యెప్డు సంతుష్టిఁ జెందుచుంద్రు. 9

ఓయి కౌంతేయ! సంతతయుక్తులగుచు,
భక్తిపూర్వకముగ నన్ను భజనసేయు
వారలెద్దానిచేత నన్జేరఁగలరో
అట్టి బుద్ధియోగమె వారికమరనిత్తు. 10

వారిననుకంపఁజూచి కాపాడుకొఱకె
నేను వారి ఆత్మలయందు నిలిచియుండి
భాస్వరమ్మగు జ్ఞానదీపమ్ముచేత
నాశమొందించుచుందు అజ్ఞానతమము. 11

---

*1 నా సృష్టిమహిమ 2 అలౌకికమైనశక్తి*

అర్జున ఉవాచ:-

పరంబ్రహ్మ పరంధామ
పవిత్రం పరమం భవాన్ ।
పురుషం శాశ్వతం దివ్యం
ఆదిదేవమజం విభుమ్ ॥ ౧౨

ఆహుస్త్వాం ఋషయస్సర్వే
దేవర్షిర్నారదస్తథా ।
అసితో దేవలో వ్యాసః
స్వయంచైవ బ్రవీషి మే ॥ ౧౩

సర్వమేతదృతం మన్యే
యన్మాం వదసి కేశవ! ।
న హి తే భగవన్! వ్యక్తిం
విదుర్దేవా న దానవాః ॥ ౧౪

స్వయమేవాత్మనాత్మానం
వేత్థ త్వం పురుషోత్తమ! ।
భూతభావన! భూతేశ
దేవదేవ! జగత్పతే! ॥ ౧౫

వక్తుమర్హస్యశేషేణ
దివ్యాహ్యాత్మవిభూతయః ।
యాభిర్విభూతిభిర్లోకాన్
ఇమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ ౧౬

కథం విద్యామహం యోగిన్
త్వాం సదా పరిచింతయన్ ।
కేషు కేషు చ భావేషు
చిన్త్యోఽసి భగవన్మయా ॥ ౧౭

అర్జునుఁడిట్లనియె:-

పరమధాముఁడవును, పరబ్రహ్మమీవె,
పరమపావనుండవు నీవె, పురుషుఁడీవె,
ఆదిదేవుండవీవె, ఆ అజుఁడవీవె,
ప్రభుఁడవీవె, దివ్యుఁడవు శాశ్వతుఁడవీవె
యంచు, నినుఁగూర్చి సర్వమహర్షివరులు,
దేవఋషి నారదుండును, దేవలుండు,
వ్యాసుఁడు, అసితుఁడును, మునుబలికి. రిపుడు
నాకు స్వయముగా వచియించినాఁడవీవు. 12, 13

నీవు నాకెయ్యది వచించినావొ దేవ!
దానినెల్ల సత్యమటంచుఁదలఁతువాఁడ.
కృష్ణ! పురుషోత్తమా! తావకీనమహిమ
దేవదానవులైనను దెలియలేరు. 14

భూతభావన! భూతేశ! భూరివిభవ!
దేవదేవ! సర్వజగత్పతీ! మహాత్మ!
నీకు నీవే స్వయంబుగా నిన్నుఁగూర్చి
తెలియనేర్తువటంచు నేఁదలఁతువాఁడ. 15

ఏ విభూతులచేత నీవీజగమ్ము
లన్ని వ్యాపించియుందువో, యట్టి దివ్య
మైన నీ విభూతులఁగూర్చి సాంగముగను
నెఱుఁగఁజేయంగ, నర్హుఁడవీవె కృష్ణ! 16

నిత్యమును చింతసేయుచు నిన్నుఁగూర్చి
యెటుల నేను యోగేశ్వరా! యెఱుఁగువాఁడ?
యెట్టిభావంబులందు నిన్నెపుడు కృష్ణ!
నేను ధ్యానింపవలయునో? విశదపఱుము. 17

విస్తరేణాత్మనో యోగం
విభూతిం చ జనార్దన! ।
భూయః కథయ తృప్తిర్హి
శృణ్వతో నాస్తి మేఽమృతమ్॥ ౧౮

శ్రీభగవానువాచ:-

హంత! తే కథయిష్యామి
దివ్యాహ్యాత్మవిభూతయః ।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ!
నాస్త్యన్తో విస్తరస్య మే ॥ ౧౯

అహమాత్మా గుడాకేశ!
సర్వభూతాశయస్థితః ।
అహమాదిశ్చ మధ్యం చ
భూతానామన్త ఏవ చ ॥ ౨౦

ఆదిత్యానామహం విష్ణుః
జ్యోతిషాం రవిరంశుమాన్ ।
మరీచిర్మరుతామస్మి
నక్షత్రాణామహం శశీ ॥ ౨౧

వేదానాం సామవేదోఽస్మి
దేవానామస్మి వాసవః ।
ఇంద్రియాణాం మనశ్చాస్మి
భూతానామస్మి చేతనా ॥ ౨౨

రుద్రాణాం శంకరశ్చాస్మి
విత్తేశో యక్షరక్షసామ్ ।
వసూనాం పావకశ్చాస్మి
మేరుశ్శిఖరిణామహమ్ ॥ ౨౩

నీ విభూతియోగంబుల నెమ్మి మఱల
విస్తరంబుగఁ దెల్పుమా! వేదవేద్య!
అద్భుతంబగు నీ మహిమామృతంబు
నెంతఁ గ్రోలిన నాకు సంతృప్తి లేదు. 18

భగవానుఁడిట్లనియె:-

దివ్యములు మద్విభూతులు, తెలుపువాఁడ
నందు కొన్ని ముఖ్యంబులైనట్టివాని,
నా విభూతివిస్తారమునకుఁ దలంప
అంతమే లేదిఁక, కురుకులాగ్రగణ్య! 19

అర్జునా! సర్వభూతహృదంతరముల
ఆత్మరూపుండనగుచు నే నధివసింతు:
భూతజాలంబులకునెల్ల, పుడమిలోన,
ఆదిమధ్యాంతములు నేనె యగుదుఁగాదె. 20

అరయ విష్ణుఁడ నాదిత్యులందు నేను,
ఘనుల జ్యోతిస్స్వరూపుల నినుఁడనేను,
వాయువులలో మరీచిని, పాండుతనయ!
చంద్రుఁడను నేను, నక్షత్రసమితియందు. 21

వేదసంచయమున సామవేదమేనె,
సర్వదేవతలందు వాసవుఁడనేనె,
మఱియు నింద్రియంబులయందు మనసునేనె,
తలఁప భూతంబులందు చైతన్యమేనె. 22

రుద్రగణములలో శంకరుండనేనె,
నేఁ, గుబేరుండ యక్షరక్షోగణముల,
వసుగణంబులయందు పావకుఁడనేనె,
ధరణిధరములలో మేరుగిరిని నేనె 23

పురోధసాం చ ముఖ్యం మాం
విద్ధి పార్థ! బృహస్పతిమ్ ।
సేనానీనామహం స్కన్దః
సరసామస్మి సాగరః ॥ ౨౪

మహర్షీణాం భృగురహం
గిరామస్మ్యేకమక్షరమ్ ।
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి
స్థావరాణాం హిమాలయః ॥ ౨౫

అశ్వత్థస్సర్వవృక్షాణాం
దేవర్షీణాం చ నారదః ।
గన్ధర్వాణాం చిత్రరథః
సిద్ధానాం కపిలో మునిః ॥ ౨౬

ఉచ్చైశ్శ్రవసమశ్వానాం
విద్ధి మామమృతోద్భవమ్ ।
ఐరావతం గజేంద్రాణామ్
నరాణాం చ నరాధిపమ్ ॥ ౨౭

ఆయుధానామహం వజ్రం
ధేనూనామస్మి కామధుక్ ।
ప్రజనశ్చాస్మి కన్దర్పః
సర్పాణామస్మి వాసుకిః ॥ ౨౮

అనన్తశ్చాస్మి నాగానాం
వరుణో యాదసామహమ్ ।
పితౄణామర్యమా చాస్మి
యమస్సంయమతామహమ్ ॥ ౨౯

ఎఱుఁగుమా! ఫల్గునా! పురోహితులయందు,
ప్రముఖుఁడై నట్టి ఆ బృహస్పతిని నేనె,
సర్వసేనాధిపులయందు స్కందుఁడేనె,
సరసులం దెల్లఁ దలఁప సాగరుఁడ నేనె. 24

భృగుమహర్షిని నే ఋషిబృందమందు,
వాగ్విశేషంబులఁ బ్రణవంబు నేనె,
యజ్ఞములయందు, జపయజ్ఞమగుదు నేనె,
స్థావరమ్ములలో హిమశైలమేనె. 25

వృక్షములలోన నశ్వత్థవృక్షమేన,
త్రిదశ సంయములందు నారదుఁడనేన,
తలఁప గంధర్వులందు చిత్రరథుఁడేన,
ఎల్లసిద్ధుల కపిలుఁడన్ ఋషిని నేన. 26

జలధిలో అమృతముతోడ జననమొంది
నట్టి యుచ్చైశ్శ్రవంబేనె హయములందు,
దంతులందెల్ల నైరావతమ్ము నేనె,
అరయ నరులందు నరపతి నగుదు నేనె. 27

ఆయుధంబుల నేనె వజ్రాయుధమును
ధేనువులయందు నే కామధేనువగుదు,
మఱియు జననకారకుఁడగు మదనుఁడేనె,
సకలసర్పంబులందు వాసుకిని నేనె. 28

నాగములయందునెల్ల అనంతుఁడేనె,
పార్థ! జలదేవతలయందు వరుణుఁడేనె,
అఖిల పితరులయందు అర్యముఁడ నేనె,
దండనాధిపులందు యముండ నేనె. 29

ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం
కాలః కలయతామహమ్ ।
మృగాణాం చ మృగేంద్రోఽహం
వైనతేయశ్చ పక్షిణామ్ ॥ ౩౦

పవనః పవతామస్మి
రామశ్శస్త్రభృతామహమ్ ।
ఝషాణాం మకరశ్చాస్మి
స్రోతసామస్మి జాహ్నవీ ॥ ౩౧

సర్గాణామాదిరన్తశ్చ
మధ్యం చైవాహమర్జున ।
అధ్యాత్మవిద్యా విద్యానాం
వాదః ప్రవదతామహమ్ ॥ ౩౨

అక్షరాణామకారోఽస్మి
ద్వన్ద్వః సామాసికస్య చ ।
అహమేవాక్షయః కాలో
ధాతాఽహం విశ్వతోముఖః ॥ ౩౩

మృత్యుస్సర్వహరశ్చాహం
ఉద్భవశ్చ భవిష్యతామ్ ।
కీర్తిశ్శ్రీర్వాక్చ నారీణాం
స్మృతిర్మేధా ధృతిః క్షమా ॥ ౩౪

అఖిల దైత్యులయందు. ప్రహ్లాదుఁడేన,
గణకసంఘంబులందెల్ల, కాలమేన,
అఖిలమృగములయందు సింహంబు నేన,
మఱియు, పక్షులలో గరుత్మంతుఁడేన. 30

పావనము సేయువారిలో పవనమేన.
శస్త్రధారులలో రామచంద్రుఁడేన,
మత్స్యములయందు, ఫల్గునా! మకరమేన,
నదులలోనెల్ల జాహ్నవీనదిని నేన. 31

సర్వసృష్టులకెల్లను సవ్యసాచి!
ఆదిమధ్యంబులును నేనె, అంతమేనె,
విద్యలందెన్నఁగా ఆత్మవిద్య నేనె,
వాదమొనరించువారిలో వాదమేనె. 32

కనగ అక్షరంబులలో 'అ'కారమేనె,
మఱి సమాసాల ద్వంద్వసమాసమేనె,
అక్షయంబగు కాలంబునగుదు నేనె,
విశ్వతోముఖుండైనట్టి విధిని నేనె. 33

ఎల్లజీవుల హరియించు మృత్యువేను.
పుట్టఁబోయెడివారల పుట్టువేను
స్త్రీలయందలి కీర్తియు, స్మృతియు, ధృతియు
వాక్కు, మేధయు, క్షమయు, సంపదయునేనె. 34

బృహత్సామ తథా సామ్నాం
గాయత్రీ ఛన్దసామహమ్ ।
మాసానాం మార్గశీర్షోఽహం
ఋతూనాం కుసుమాకరః ॥ ౩౫

ద్యూతం ఛలయతామస్మి
తేజస్తేజస్వినామహమ్ ।
జయోఽస్మి వ్యవసాయోఽస్మి
సత్త్వం సత్త్వవతామహమ్ ॥ ౩౬

వృష్ణీనాం వాసుదేవోఽస్మి
పాండవానాం ధనంజయః ।
మునీనామప్యహం వ్యాసః
కవీనాముశనా కవిః ॥ ౩౭

దండోదమయతామస్మి
నీతిరస్మి జిగీషతామ్ ।
మౌనం చైవాస్మి గుహ్యానాం
జ్ఞానంజ్ఞానవతామహమ్ ॥ ౩౮

యచ్చాపి సర్వభూతానాం
బీజం తదహమర్జున ।
న తదస్తి వినా యత్స్యాత్
మయా భూతం చరాచరమ్ ॥ ౩౯

సామములయందు, అల బృహత్సామమేనె,
అఖిలఛందంబులందు గాయత్రి నేనె,
అరయ మాసములను మార్గశిరము నేనె,
ఋతువులందెల్లను వసంతఋతువు నేనె. 35

చూడఁగా వంచకులయందు జూదమేను,
సకలతేజస్వులందు తేజంబు నేను,
సాత్త్వికులయందుఁగల్గెడు సత్త్వమేను.
జయము. యత్నపరుల వ్యవసాయమేను. 36

యాదవులలోన వాసుదేవాఖ్యుఁడేనె,
పాండవులలో ధనంజయాఖ్యుండ నేనె,
మౌనిగణములలో వ్యాసమౌని నేనె,
కవిసమాజములందు భార్గవుఁడ నేనె. 37

దండనముఁజేయువారల దండమేనె,
నిఖిలజయకామికతియందు నీతి నేనె,
మఱి రహస్యములందెల్ల మౌనమేనె,
జ్ఞానవంతులయందలి జ్ఞానమేనె. 38

అర్జునా! ఈ జగమ్ములయందునుండు
సర్వభూతమ్ములకును. బీజంబు నేనె,
ఈ చరాచరజగములందెల్ల విజయ!
ఏనులేకుండనుండునదేదిలేదు. 39

నాన్తోఽస్తి మమ దివ్యానాం
విభూతీనాం పరన్తప! ।
ఏష తూద్దేశతః ప్రోక్తో
విభూతేర్విస్తరో మయా ॥ ౪౦

యద్యద్విభూతిమత్సత్త్వం
శ్రీమదూర్జితమేవ వా ।
తత్తదేవావగచ్ఛ త్వం
మమ తేజోఽంశసంభవమ్ ॥ ౪౧

అథవా బహునైతేన
కిం జ్ఞాతేన తవార్జున! ।
విష్టభ్యాహమిదం కృత్స్నం
ఏకాంశేన స్థితో జగత్ ॥ ౪౨

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే విభూతియోగోనామ దశమోఽధ్యాయః.

అర్జునా! కడు దివ్యంబులై నయట్టి
నా విభూతులనెల్ల నంతంబులేదు;
అట్టులయ్యును వీని నిప్పట్టునందు,
చెప్పినాఁడను నీకు సంక్షేపముగనె. 40

ఊర్జితంబగుచు, విభూతియుక్తమగుచు
మఱియు శ్రీమంతమగుచును మహి వెలుంగు
నట్టిదేదిఁగాని, మదీయమైనయట్టి
దివ్యతేజోంశ భవమని తెలిసికొనుమ! 41

ఇట్లుగాక, ఇంపను దీని నెఱుఁగఁగా, ప్ర
యోజనంబేమి? వినుమిదే యొక్కమాట,
అఖిలజగముల నేనొక్క యంశచేత
ఆవరించి యున్నాఁడ సత్యమ్ము నమ్ము. 42

ఇది ఉపనిషత్ప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రంబును, శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీమద్భగవద్గీతలందు విభూతియోగమను పదియవ అధ్యాయము.

---



# శ్రీమద్భగవద్గీతా

## ఏకాదశోఽధ్యాయః

### -: విశ్వరూపసందర్శనయోగః :-

అర్జున ఉవాచ:-

మదనుగ్రహాయ పరమం
గుహ్యమధ్యాత్మసంజ్ఞితమ్ ।
యత్త్వయోక్తం వచస్తేన
మోహోఽయం విగతో మమ ॥ ౧

భవాప్యయౌ హి భూతానాం
శ్రుతౌ విస్తరశో మయా ।
త్వత్తః కమలపత్రాక్ష!
మాహాత్మ్యమపి చావ్యయమ్ ॥ ౨

ఏవమేతద్యథాఽఽత్థ త్వం
ఆత్మానం పరమేశ్వర: ।
ద్రష్టుమిచ్ఛామి తే రూపం
ఐశ్వరం పురుషోత్తమ! ॥ ౩

మన్యసే యది తచ్ఛక్యం
మయా ద్రష్టుమితి ప్రభో! ।
యోగేశ్వర! తతో మే త్వం
దర్శయాత్మానమవ్యయమ్ ॥ ౪

శ్రీభగవానువాచ:-

పశ్య మే పార్థ! రూపాణి
శతశోఽథ సహస్రశః ।
నానావిధాని దివ్యాని
నానావర్ణాకృతీని చ ॥ ౫

ఓమ్

# గీతా సుధాలహరి

## పదునొకండవ అధ్యాయము

### -: విశ్వరూపసందర్శనయోగము :-

అర్జునుఁడిట్లనియె:-

నన్ననుగ్రహించుటకునై, నాకు నతిర
హస్యముఁ, శ్రేష్ఠమైన, అధ్యాత్మ మీవు
తెలియఁజేసి నాఁడవు, దాని వలన కృష్ణ!
నాకుఁగల మోహమంతయు, నాశమయ్యె. 1

సకలభూతజననవినాశములనెల్ల,
అవ్యయంబగు నీదు మాహాత్మ్యమెల్ల
కమలదళలోచనా! భవత్కారుణ వలన
వింటి నిప్పుడు నేను సవిస్తరముగ. 2

నీవు చెప్పిన దంతయు నిన్నుఁగూర్చి
నీరజాతాయతేక్షణ! నిజమె, సరియె;
ఐన నీ ఐశ్వరంబగునట్టి రూప
ముం గనంగను కోరిక వొడమె నాకు. 3

నీదు దివ్యస్వరూపమ్ము నేను గాంచ
శక్తుఁడనని, తలఁతువేని, స్వామి! నాకు
చూపు మవ్యయంబైన నీ రూపమిపుడు
పరమయోగేశ్వరేశ్వరా! కరుణమీర! 4

భగవానుఁడిట్లనియె:-

పలు తెఱఁగులగు వర్ణరూపములుఁ గలిగి
వివిధ దివ్యవిభూతులఁ వెలయుచున్న
వందలకొలంది వేలకొలంది నాదు
భవ్యరూపముల్ వీక్షింపు సవ్యసాచి! 5

పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రాన్
అశ్వినౌ మరుత స్తథా ।
బహూన్యదృష్టపూర్వాణి
పశ్యాశ్చర్యాణి భారత! ॥ ౬

ఇహైకస్థం జగత్కృత్స్నం
పశ్యాద్య సచరాచరమ్ ।
మమ దేహే గుడాకేశ!
యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి ॥ ౭

న తు మాం శక్యసే ద్రష్టుం
అనేనైవ స్వచక్షుషా ।
దివ్యం దదామి తే చక్షుః
పశ్య మే యోగమైశ్వరమ్ ॥ ౮

సంజయ ఉవాచ:-

ఏవముక్త్వా తతో రాజన్
మహాయోగేశ్వరో హరిః ।
దర్శయామాస పార్థాయ
పరమం రూపమైశ్వరమ్ ॥ ౯

అనేకవక్త్రనయనం
అనేకాద్భుతదర్శనమ్ ।
అనేకదివ్యాభరణం
దివ్యానేకోద్యతాయుధమ్ ॥ ౧౦

దివ్యమాల్యాంబరధరం
దివ్యగంధానులేపనమ్ ।
సర్వాశ్చర్యమయం దేవం
అనంతం విశ్వతోముఖమ్ ॥ ౧౧

అరయు మాదిత్యవసువుల నశ్వినులను,
రుద్రగణముల మఱియు మరుత్తులఁగను,
నీవదెన్నఁడు దర్శింప నేరనట్టి
చోద్యముల నెన్నియో యింక చూడుపార్థ! 6

ఈ చరాచరవిశ్వంబునెల్ల, మఱియు
నింక నేదేది చూడ నీ కిష్టమగునొ
ఆ సమస్తముఁ గాంచుమా! అస్మదీయ
దివ్యదేహమందేకప్రదేశమందె. 7

చర్మచక్షులచే నను సవ్యసాచి!
కాంచఁగా నీకు సాధ్యమ్ముగాదు గాన,
దివ్యదృష్టి నిపుడు ప్రసాదింతు నీకు
కనుమ! నా ఐశ్వరమగు యోగమ్ము నెల్ల. 8

సంజయుఁడిట్లనియె:-

ఇట్లు వచియించి పరమయోగేశ్వరుండు
హరి, మహోత్తమంబును దివ్యమగుచు వెలయు
విశ్వరూపంబుఁ జూపించె విజయునకును
పరమకృపతోడ, ధృతరాష్ట్రధరణిపాల! 9

అది అనేకవక్త్రనయనోదంచితమ్ము
బహుమహాద్భుతదర్శనభాసురమ్ము
వివిధ దివ్యవిభూషణ విలసితమ్ము
దివ్య బహుళోద్యతాయుధ దీపితమ్ము. 10

దివ్యమాల్యాంబరధరము, దివ్యపరిమ
ళానులేపనసంయుక్త మఖిలవిస్మ
యావహము, విశ్వతోముఖంబై, అనంత
మై, వెలుఁగు రూపముంగాంచె నర్జునుండు. 11

దివి సూర్యసహస్రస్య
భవేద్యుగపదుత్థితా ।
యది భాస్సదృశీ సా స్యాత్
భాసస్తస్య మహాత్మనః ॥ ౧౨

తత్రైకస్థం జగత్కృత్స్నం
ప్రవిభక్తమనేకధా ।
అపశ్యద్దేవదేవస్య
శరీరే పాండవస్తదా ॥ ౧౩

తతస్సవిస్మయావిష్టో
హృష్టరోమా ధనంజయః ।
ప్రణమ్య శిరసా దేవం
కృతాంజలిరభాషత ॥ ౧౪

అర్జున ఉవాచ:-

పశ్యామి దేవాంస్తవ దేవ! దేహే
సర్వాంస్తథా భూతవిశేషసంఘాన్ ।
బ్రహ్మాణమీశం కమలాసనస్థం
ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్ ॥ ౧౫

అనేకబాహూదరవక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపమ్ ।
నాన్తం న మధ్యం న పునస్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర! విశ్వరూప! ॥ ౧౬

కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతోదీప్తిమంతమ్ ।
పశ్యామి త్వాం దుర్నిరీక్షం సమన్తాత్
దీప్తానలార్కద్యుతిమప్రమేయమ్ ॥ ౧౭

వేలకొలఁది సూర్యులు వినువీధి యందు
ఏకకాలంబునందుదయించెనేని,
కలుగు మిక్కుటమైనట్టి కాంతి, అమ్మ
హాత్మునిదగు కాంతికి సరియగునో కాదో? 12

దేవదేవుని ఆ దివ్యదేహమందు
బహువిధంబుల విభజింపఁబడినయట్టి
జగమునంతయు నప్పుడు సవ్యసాచి
తెల్లముగఁ జూచె నేకప్రదేశమందు. 13

విజయుఁడంతట విస్మయావిష్టుఁడగుచు
హర్షపులకితగాత్రుఁడై, అమ్మహాను
భావునకు భక్తి సాష్టాంగపడుచు మ్రొక్కి
పలికె నివ్విధి అంజలిబద్ధుఁడగుచు. 14

అర్జునుఁడిట్లనియె:-

దేవ! నీ దేహమున సర్వదేవతలను,
అఖిలభూతరతుల, కమలాసనస్థుఁ
డీశుఁడౌ బ్రహ్మదేవుని, ఎల్లఋషుల,
అఖిల దివ్యోరగంబుల నరయుచుంటి. 15

నిన్ననేకబాహూదరనేత్రవక్త్ర
నిన్ననంతరూపునిఁ గాంతు నిఖిలదిశల,
నీకు నాదిమధ్యాంతములు నేను గాన
జాలకుంటి, విశ్వేశ! విశ్వస్వరూప! 16

దివ్యమకుటగదాచక్రదీప్తుఁడవయి
జ్వలితసూర్యానలప్రభను సర్వదిశల,
అరయరాని తేజోరాశివై వెలుంగు
అప్రమేయుని, నినుఁగంటి నన్నిమొదల. 17

త్వమక్షరం పరమం వేదితవ్యం
త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।
త్వమవ్యయశ్శాశ్వతధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే ॥ ౧౮

అనాదిమధ్యాంతమనంతవీర్యం
అనంతబాహుం శశిసూర్యనేత్రమ్ ।
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం
స్వతేజసా విశ్వమిదం తపన్తమ్ ॥ ౧౯

ద్యావాపృథివ్యోరిదమంతరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।
దృష్ట్వాఽద్భుతం రూపముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ॥ ౨౦

అమీ హి త్వాం సురసంఘా విశంతి
కేచిద్భీతాః ప్రాంజలయో గృణంతి ।
స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసంఘాః
స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ॥ ౨౧

రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ ।
గంధర్వయక్షాసురసిద్ధసంఘా
వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే ॥ ౨౨

రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో! బహుబాహూరుపాదమ్ ।
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాహమ్ ॥ ౨౩

ఎఱుఁగఁదగినయట్టి పరమాక్షరుఁడవీవు,
అఖిలమున కాశ్రయుఁడవు, అవ్యయుఁడవీవు,
శాశ్వతుండవు, ధర్మరక్షకుఁడ వీవు
మఱియు నాసనాతనుఁడవౌ పురుషుఁడీవు. 18

ఆదిమధ్యాంతరహితు ననంతవీర్యు,
అర్కశశధరనేత్రు, ననంతబాహు,
జ్వలితపావకముఖు, స్వతేజమ్ముచే, జ
గము, తపింపఁజేయు, నిను నేఁ గాంచుచుంటి. 19

దివికి భువికిని మధ్యప్రదేశమంత,
అఖిలదిశలు నీయొకనిచే వ్యాప్తమయ్యె.
అద్భుతంబగు నీ మహోగ్రాకృతిఁగని
ముజ్జగములు వణఁకు భయమున, మహాత్మ! 20

సురనివహమెల్ల నీయందుఁ జొచ్చుచుండె
భీతి, కొందఱు కేల్మోడ్చి వేడుచున్న
వారు, ఋషిసిద్ధగణములు స్వస్తియనుచు
పుష్కలస్తోత్రముల నిన్ను పొగడుచుండ్రి. 21

రుద్రులాదిత్యులును, పితరులు, మరుత్తు,
లష్టవసువు, లసురులు విశ్వేశ్వినులును,
సాధ్యగంధర్వసిద్ధులాశ్చర్యచకితు
లై, నినుం జూచుచున్నారలయ్య దేవ! 22

*బహుముఖంబులు నేత్రముల్ బాహువులును,
ఉదరదంష్ట్రాకరాళంబులూరువులును,
అంఘ్రులుంగల్గు నీ మహదాకృతిఁగని
అడలుచుంటిమి నేను, లోకాళియెల్ల. 23

పెక్కుమొగములు, బుజములు, పెక్కుకనులు, ♦ పెక్కుకడుపులు, వదములు, పెక్కు తొడలు, ♦ పెక్కుకోఱలుగల్గి పెంపెక్కునిన్ను ♦ గని, అడలితిమి, నేను, లోకంబులెల్ల.

నభఃస్పృశం దీప్తమనేకవర్ణమ్
వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్ ।
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా
ధృతిం న విందామి శమం చ విష్ణో! ॥ ౨౪

దంష్ట్రాకరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానలసన్నిభాని।
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ! జగన్నివాస! ॥ ౨౫

అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావనిపాలసంఘైః ।
భీష్మోద్రోణః సూతపుత్రస్తథాఽసౌ
సహాస్మదీయైరపి యోధముఖ్యైః॥ ౨౬

వక్త్రాణి తే త్వరమాణా విశంతి
దంష్ట్రాకరాళాని భయానకాని।
కేచిద్విలగ్నా దశనాంతరేషు
సందృశ్యన్తే చూర్ణితైరుత్తమాంగైః ॥ ౨౭

యథా నదీనాం బహవోఽమ్బువేగాః
సముద్రమేవాభిముఖా ద్రవంతి।
తథా తవామీ నరలోకవీరా
విశంతి వక్త్రాణ్యభివిజ్వలంతి ॥ ౨౮

యథా ప్రదీప్తం జ్వలనం పతంగా
విశంతి నాశాయ సమృద్ధవేగాః ।
తథైవ నాశాయ విశంతి లోకాః
తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః ॥ ౨౯

అంబరంబంటి దీపించు చౌర! బహుళ
వర్ణయుక్తుండవై వ్యాత్తవదనుడవయి,
జ్వలితలోచనములతోడ వెలుఁగు, నిన్నుఁ
గని వెఱచి, ధృతిశమములఁ గాంచకుంటి. 24

ప్రబలదంష్ట్రాకరాళముల్, ప్రళయకాల
వహ్నిసదృశంబులైన నీ వక్త్రములను
గంటి, దిక్కేది, సుఖమును గాంచకుంటి
కరుణఁజూడు, దేవేశ! జగన్నివాస! 25

రాజచయముతో ఈ ధార్తరాష్ట్రులెల్ల,
సురనదీతనయుండును, సూతసుతుఁడు
గురుఁడు ద్రోణుండు, మఱియు ముఖ్యులగునట్టి
యోధులెల్లరు-మనపాలనున్నవారు; 26

వికృతములగు దంష్ట్రలచేత భీతి గొలుపు
చున్న నీ వక్త్రములఁ జొచ్చుచున్నవారు,
కొందఱు రదనాంతరములయందుఁ జిక్కి
చూర్ణితశిరస్కులగుచుండఁ జూచుచుంటి. 27

నదుల బహుళప్రవాహమ్ములుదధిలోన
ఎటుల అభిముఖంబుగ ప్రవహించిచొచ్చు,
అటులె ప్రజ్వలితమగు నీ ఆస్యములను
చొచ్చుచుండిరి నరలోకవీరులెల్ల. 28

అతిరయంబుగ మండెడు అగ్నియందు
మిడుత లేరీతిగాఁబడి మడియు, అట్లె
కడుసరవడిగ నీదు వక్త్రమ్ములందుఁ
బడుచు నశియించుచున్నవి ప్రాణులెల్ల. 29

లేలిహ్యసే గ్రసమానః సమన్తాత్
లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః ।
తేజోభిరాపూర్య జగత్సమగ్రం
భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో! ॥ ౩౦

ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో
నమోఽస్తు తే దేవవర! ప్రసీద।
విజ్ఞాతుమిచ్ఛామి భవన్తమాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్॥ ౩౧

శ్రీభగవానువాచ:-

కాలోస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః ।
ఋతేఽపి త్వా న భవిష్యన్తి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః ॥ ౩౨

తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్ ।
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥ ౩౩

ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్ ।
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్ ॥ ౩౪

మంటలుమిసెడినోళ్ళ సమస్తలోక
ములను *మ్రింగుచు, సకలదిక్కులను, నాకు
చుంటివి మహాత్మ! నీదు మహోగ్రకాంతి
యెల్ల దిశలావరించి దహించుచుండె. 30

ఇట్టి ఉగ్రరూపుండవీవెవడవనఘ!
అంజలింతు, ప్రసన్నుండవగుము దేవ!
ఆద్యుఁడవగు నిన్నెఱుఁగంగ నభిలషింతు,
ఎఱుఁగనేరను నీదు [1]ప్రవృత్తి నేను. 31

భగవానుఁడిట్లనియె:-

లోకముహరింపఁబుట్టు కాలుండ నేను,
భువనముల సంహరింపఁగఁ బూనితిపుడు,
నీవు చంపకున్నను శత్రునివహమందు
ఒక్కఁడునుగూడ జీవించి యుండఁబోడు. 32

కాన, లెమ్ము, పగఱ గెల్చి కనుము యశము,
అనుభవింపు మీ యఖిలరాజ్యమ్ము నీవు,
వీరలెల్ల నాచేఁజచ్చినారు మున్నె
అర్జున! నిమిత్తమాత్రుండవగుము నీవు. 33

మున్నె నాచేత నిహతులై యున్న ద్రోణ
భీష్మ సైంధవ కర్ణాది వీరవరుల
చంపు [2]మని సేయుమయ్య, విచారపడకు
శత్రువుల జయింపఁగలవు, సమరమందు. 34

---

*కబళించివైచి, నీవు చవిజూచు

1 ప్రవర్తనము లేక స్వభావము  2 యుద్ధము

సంజయ ఉవాచ:-

ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలిర్వేపమానః కిరీటీ ।
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య ॥ ౩౫

అర్జున ఉవాచ:-

స్థానే హృషీకేశ! తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ ।
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి
సర్వే నమస్యన్తి చ సిద్ధసంఘాః ॥ ౩౬

కస్మాచ్చతే న నమేరన్ మహాత్మన్
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే ।
అనన్త! దేవేశ! జగన్నివాస!
త్వమక్షరం సదసత్తత్పరం యత్ ॥ ౩౭

త్వమాదిదేవః పురుషః పురాణః
త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।
వేత్తాఽసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వమనన్తరూప! ॥ ౩౮

వాయుర్యమోఽగ్నిర్వరుణశ్శశాంకః
ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ ।
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే ॥ ౩౯

సంజయుఁడిట్లనియె:-

అపుడు కృష్ణుని పలుకుల ఆలకించి
అంజలిఘటించి, వణఁకుచు ఆ కిరీటి
వందనముఁజేసి నమ్రుఁడై భయముతోడ
[1]ఎలుఁగు తడఁబడ, ఇట్లని పలికె మఱల. 35

అర్జునుఁడిట్లనియె:-

ఇంతటి మహాత్ముఁడవె హృషీకేశ! నీవు
జగతి నిన్ను నుతించుచు సంతసించు,
మ్రొక్కుచున్నారు సిద్ధులు, రక్కసీంద్రు
దెసలకుంబాఱుచున్నారు దిటవుదప్పి. 36

అక్షరుఁడవు, విధాతకే ఆదికర్త
వు, [2]సదసత్తత్పరుండవు, పురుషవరుఁడ
వేల సలుపకుందురు నమస్కృతులు నీకు
అఖిలలోకేశ! దేవ! మహానుభావ! 37

మొదటి వేల్పువీవె! పురాణపురుషుఁడీవె!
సకలజగతికి నుత్తమాశ్రయుఁడ వీవె!
[3]వేద్యమును, [4]వేత్తవును నీవె! విశ్వమెల్ల
వ్యాప్తమైయుండు నీచే ననంతరూప! 38

యమవరుణవాయువహ్నిశశాంకులీవె!
మఱి ప్రజాపతియు, ప్రపితామహుఁడవీవె!
వందనంబులు వేమార్లు వందనములు,
మఱలమఱల నీకివె ప్రణామములు దేవ! 39

1 గద్గదస్వరముతో 2 సత్తునకు అసత్తునకు విలక్షణమైనవాడు అనగా స్థూలసూక్ష్మములకు పరుడైనవాఁడు 3 తెలియదగినది 4 సర్వజ్ఞుఁడు.

నమః పురస్తాదథ పృష్ఠతస్తే
నమోఽస్తు తే సర్వత ఏవసర్వ! ।
అనంతవీర్యామితవిక్రమస్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః ॥ ౪౦

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హేకృష్ణ! హేయాదవ! హేసఖేతి ।
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదాత్ప్రణయేనవాఽపి ॥ ౪౧

యచ్చావహాసార్థమసత్కృతోఽసి
విహారశయ్యాసనభోజనేషు ।
ఏకోఽథవాఽప్యచ్యుత! తత్సమక్షం
తత్క్షామయే త్వామహమప్రమేయమ్ ॥ ౪౨

పితాఽసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్ ।
న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయేఽప్యప్రతిమప్రభావ! ॥ ౪౩

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్ ।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ! సోఢుమ్ ॥ ౪౪

అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే ।
తదేవ మే దర్శయ దేవ! రూపం
ప్రసీద దేవేశ! జగన్నివాస! ॥ ౪౫

ముందు వెనుకను నీకిదె వందనంబు
వందనంబెల్లదెసల, సర్వస్వరూప!
అమిత విక్రమశాలి! అనంతవీర్య!
సర్వమున వ్యాప్తినొందుట సర్వుఁడీవె! 40

ఇట్టి నీ మహిమంబు నేనెఱుఁగలేక
సఖుఁడవనియెంచి, పొరఁబడి, చనవుచేత,
"యాదవా! కృష్ణ! సఖుఁడా!" యటంచు నేను
దురుసుగా నిన్ను పిలిచినందులకు మఱియు; 41

అశనశయ్యావిహారాసనాదుల నిను,
[1]ఏకముగనేని, ఇతరుల యెదుటనేని,
అచ్యుతా! అవమానించినందులకును,
నీవు కరుణించి నన్ను మన్నింప వలయు. 42

ఈ చరాచరజగములకెల్ల దేవ!
తండ్రివియు, పూజ్యుఁడవు, గురుతముఁడవీవె!
ముజ్జగంబుల నీకు సముండె *లేఁడ
టన్న అధికుఁడుండునె? అమేయప్రభావ! 43

కాన [2]ఈశుండ [3]ఈడ్యుండవైన నీకు
వందనము సేతు సాష్టాంగపడుచు, నుతుని
పిత, సఖు సఖుండు, ప్రేయసిన్ ప్రియుఁడువోలె
నేరముల్ సైచి నన్ను మన్నింపు కృష్ణ! 44

ఎప్పుడుఁ గాంచని నీరూపమిపుడు గాంచి,
సుఖమునొందియు, భయమున మదిచలించుఁ
గాన నీ పూర్వరూపంబె కానుపఱచి
నన్ను కరుణింపు, దేవ! జగన్నివాస! 45

---

1 ఒంటరిగానున్నప్పుడు *లేఁడు; మఱి యధికుఁడెవఁడు? అప్రతిమప్రభావ!
2 ఈశ్వరుఁడు (నియామకుఁడు) 3 స్తుతింపఁదగినవాఁడు.

కిరీటినం గదినం చక్రహస్తం
ఇచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ।
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో! భవ విశ్వమూర్తే! ॥ ౪౬

శ్రీభగవానువాచ:-

మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శితమాత్మయోగాత్ ।
తేజోమయం విశ్వమనంతమాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్ ॥ ౪౭

న వేద యజ్ఞాధ్యయనైర్నదానైః
న చ క్రియాభిర్నతపోభిరుగ్రైః ।
ఏవంరూపశ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర॥ ౪౮

మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వారూపం ఘోరమీదృఙ్మమేదమ్ ।
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య ॥ ౪౯

సంజయ ఉవాచ:-

ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః ।
ఆశ్వాసయామాస చ భీతమేనం
భూత్వా పునస్సౌమ్యవపుర్మహాత్మా ॥ ౫౦

దివ్యమకుటగదాచక్రదీప్తుఁడవయి
అలరు నీరూపంబె కన నేనభిలషింతు,
వేయి భుజములచే వెల్గు విశ్వమూర్తి!
ఆ చతుర్భుజాకృతితోనె అలరుమింక. 46

భగవానుఁడిట్లనియె:-

ఆద్యము, మహోత్తమంబు ననంతమగుచు
నమిత తేజోమయంబునై యలరునట్టి
పరులుగానని విశ్వరూపంబు నీకె
కరుణఁజూపితి ఆత్మయోగమ్ముచేత. 47

నీవుఁదక్క నీ మానవలోకమందు
ఇట్టి నారూపముఁగన జాలరెవరు
యజ్ఞదానతపోధ్యయనాదివిధుల
నాచరించినఁ, జూడ శక్యంబుగాదు. 48

ఇట్టి ఘోరరూపంబు నీ విపుడు గాంచి
భయముఁజెందకు, మూఢభావంబు విడుము!
భీతి విడనాడి, నీవు సంప్రీతమాన
సుండవై, పూర్వరూపంబె చూడు మిదిగో. 49

సంజయుఁడిట్లనియె:-

పార్థుతో వాసుదేవుఁడీవగిదిఁబలుకు
చు, తన సహజరూపంబును జూపి మరల
అడలుచున్న యర్జునుని సమాశ్వసించె
అమ్మహాత్ముఁడు సౌమ్యదేహంబుఁదాల్చి. 50

అర్జున ఉవాచ:-

దృష్ట్వేదం మానుషం రూపం
తవ సౌమ్యం జనార్దన ।
ఇదానీమస్మి సంవృత్తః
సచేతాః ప్రకృతిం గతః ॥ ౫౧

శ్రీభగవానువాచ:-

సుదుర్దర్శమిదం రూపం
దృష్టవానసి యన్మమ ।
దేవా అప్యస్య రూపస్య
నిత్యం దర్శనకాంక్షిణః ॥ ౫౨

నాహంవేదైర్నతపసా
న దానేన నచేజ్యయా ।
శక్య ఏవంవిధో ద్రష్టుం
దృష్టవానసి మాం యథా ॥ ౫౩

భక్త్యాత్వనన్యయాశక్య
అహమేవంవిధోఽర్జున ।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన
ప్రవేష్టుం చ పరన్తప ॥ ౫౪

మత్కర్మకృన్మత్పరమో
మద్భక్తస్సంగవర్జితః ।
నిర్వైరస్సర్వభూతేషు
యస్స మామేతి పాణ్డవ ॥ ౫౫

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే విశ్వరూపసందర్శనయోగోనామ
ఏకాదశోఽధ్యాయః.

అర్జునుఁడిట్లనియె:-

ఇట్టి నీ సౌమ్యమానుషాకృతినిఁ గాంచి,
తొలఁగె భయమది, స్వస్థచిత్తుండనైతి,
ఎప్పటియటు జనార్దనా! యేను మఱలఁ
బడసినాఁడ నా సహజస్వభావమిపుడు. 51

భగవానుఁడిట్లనియె:-

ఈవు గాంచినయట్టి నా యిట్టిరూపు
పరులు గనలేరు, కడు దుర్లభమ్ము సుమ్ము!
దేవసంఘమ్ము నైతము దీనిఁగాంచ
నభిలషించుచునుండు నిత్యమ్ము పార్థ! 52

ప్రీతి నివ్విధి నీవు దర్శించినట్టి
యిట్టి రూపంబుతో నొప్పునట్టి నన్ను
వేదయజ్ఞతపోదానవిధులచేత
నైనఁగాని, వీక్షింప సాధ్యంబుగాదు. 53

ఇట్టి విశ్వరూపుండనైనట్టి నన్ను
చూచుటకును, తెలియుటకు, చొచ్చుటకును,
అర్జునా! యథార్థముగ అనన్యమైన
యట్టి భక్తియే సాధనంబయి చెలఁగు. 54

నా కొఱకె కర్మములుచేసి నన్నె గతిగ
నమ్మి నా భక్తుఁడగుచు సంగముల వీడి
సర్వభూతంబులందు ద్వేషంబులేని
వాఁడె నన్ఁబొందఁగల్గును పాండుతనయ! 55

ఇది ఉపనిషత్ప్రతిపాదకంబును. బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రంబును,
శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీమద్భగవద్గీతలందు
విశ్వరూపసందర్శనయోగమను పదునొకండవ అధ్యాయము.



# శ్రీమద్భగవద్గీతా

## ద్వాదశోఽధ్యాయః

### -: భక్తియోగః :-

అర్జున ఉవాచ:-

ఏవం సతతయుక్తా యే
భక్తాస్త్వాం పర్యుపాసతే ।
యే చాప్యక్షరమవ్యక్తం
తేషాం కే యోగవిత్తమాః ॥ ౧

శ్రీభగవానువాచ:-

మయ్యావేశ్య మనో యే మాం
నిత్యయుక్తా ఉపాసతే ।
శ్రద్ధయా పరయోపేతాః
తే మే యుక్తతమా మతాః ॥ ౨

యేత్వక్షరమనిర్దేశ్యం
అవ్యక్తం పర్యుపాసతే ।
సర్వత్రగమచింత్యం చ
కూటస్థమచలం ధ్రువమ్ ॥ ౩

సన్నియమ్యేంద్రియగ్రామం
సర్వత్ర సమబుద్ధయః ।
తే ప్రాప్నువన్తి మామేవ
సర్వభూతహితే రతాః ॥ ౪

ఓమ్

# గీతా సుధా లహరి

## పంద్రెండవ అధ్యాయము

### -: భక్తియోగము :-

అర్జునుఁడిట్లనియె:-

నిత్యయుక్తులగుచు, భక్తినిష్ఠల నిను
భజన జేసెడి వారొ? అవ్యక్తమైన
అక్షరము నుపాసించెడునట్టి వారొ?
యోగవిత్తము లెవ్వరీ యుభయులందు? 1

భగవానుఁడిట్లనియె:-

[1]నిత్యయుక్తులై నాయందె నిలిపి మనము
ఎవరు శ్రద్ధతో నను భజియించుచుందు
రట్టి వారలే సమ్మతులైనయట్టి
[2]యుక్తతములంచు భావించుచుందు నేను. 2

[3]అచలమగుచు, [4]అనిర్దేశ్యమగుచు, [5]ధ్రువము
నగుచు, [6]కూటస్థమగుచు, [7]అవ్యక్తమగుచు,
[8]అఖిలగతమునగుచు, [9]అచింత్యమ్మునగుచు,
పరగు అక్షరబ్రహ్మంబు నెవ్వారు కొలుతురో; 3

ఇంద్రియగ్రామముల నిగ్రహించి సతము
సర్వవిధముల బుద్ధిని సమముఁజేసి
సకలభూతహితంబున [10]సక్తులగుచు
నన్నుపాసింత్రు. వారు నను బడయఁగలరు. 4

---

*1 నిరంతరము తదేకనిష్ఠులై 2 యోగిశ్రేష్ఠులు 3 సుస్థిరము 4 ఇట్టిదని సూచింప రానిది 5 నిత్యము 6 నిర్వికారము 7 ఇంద్రియములకగోచరమైనది 8 సర్వ వ్యాప్తము 9 ఊహింపశక్యముగానిది 10 ఆసక్తిగలవారు.*

క్లేశోఽధికతర స్తేషాం
అవ్యక్తాస క్తచేతసామ్ ।
అవ్యక్తా హి గతిర్దుఃఖం
దేహవద్భిరవాప్యతే ॥ ౫

యే తు సర్వాణి కర్మాణి
మయి సన్న్యస్య మత్పరాః ।
అనన్యేనైవ యోగేన
మాం ధ్యాయంత ఉపాసతే ॥ ౬

తేషామహం సముద్ధర్తా
మృత్యుసంసారసాగరాత్ ।
భవామి న చిరాత్పార్థ!
మయ్యావేశితచేతసామ్ ॥ ౭

మయ్యేవ మనఆధత్స్వ
మయి బుద్ధిం నివేశయ ।
నివసిష్యసి మయ్యేవ
అతఊర్ధ్వం న సంశయః ॥ ౮

అథ చిత్తం సమాధాతుం
న శక్నోషి మయి స్థిరమ్ ।
అభ్యాసయోగేన తతో
మామిచ్ఛాప్తుం దనంజయ! ॥ ౯

ధరణి, [1]అవ్యక్తసక్తచేతసులకేని
అధికతరమైన[2]క్లేశమ్ము లావహిల్లు
పార్థ! దేహధారులకు అవ్యక్తపదము
గాంచుటన్నను మిగుల [3]దుఃఖమ్ము గాదె. 5

సకల కర్మముల్ నాయందె [4]సన్న్యసించి
ఏనె పరమగతి యటంచు నెంచి, యెవరు
న[5]న్ననన్యయోగమున ధ్యానమ్ము నాచ
రించుచు, ఉపాసనమ్ము గావించుచుంద్రు;
ఫల్గునా! యెవరు పరమభక్తితోడ
చిత్తములనెల్ల నాయందె జేర్తు రట్టి
వారి నెల్లను మృత్యుసంసారజలధి
నుండి నేను శీఘ్రముగ సముద్ధరింతు. 6, 7

మగ్నమొనరించి నాయందె మానసమ్ము
నీవు బుద్ధిని స్థిరముగా నిలిపితేని
ఉందు వటుపిమ్మటెపుడు నాయందె నీవు
సంశయంబింతు లేదింత సవ్యసాచి! 8

నిశ్చలంబుగ నాయందె నీదు మనసు
నిలుప సాధ్యంబు గాదంచుఁ దలఁతువేని,
ఎలమి నభ్యాసయోగంబువలన, నన్నుఁ
బడయఁగాఁగోరుమా! నీవు; పాండుతనయ! 9

*1 ఇంద్రియగోచరముగాని బ్రహ్మమునందు ఆసక్తితోనుండు మనసుగలవారు 2 కష్టములు 3 కష్టము 4 సమర్పించి 5 ఇతరచింతనలేని.*

అభ్యాసేఽప్యసమర్థోఽసి
మత్కర్మ పరమో భవ ।
మదర్థమపి కర్మాణి
కుర్వన్ సిద్ధిమవాప్స్యసి ॥ ౧౦

అథైతదప్యశక్తోఽసి
కర్తుం మద్యోగమాశ్రితః ।
సర్వకర్మఫలత్యాగం
తతః కురు యతాత్మవాన్ ॥ ౧౧

శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్
జ్ఞానాద్ధ్యానం విశిష్యతే ।
ధ్యానాత్కర్మఫలత్యాగః
త్యాగాచ్ఛాన్తిరనన్తరమ్ ॥ ౧౨

అద్వేష్టా సర్వభూతానాం
మైత్రః కరుణ ఏవ చ ।
నిర్మమో నిరహంకారః
సమదుఃఖసుఖః క్షమీ ॥ ౧౩

సంతుష్టస్సతతంయోగీ
యతాత్మా దృఢనిశ్చయః ।
మయ్యర్పితమనోబుద్ధిః
యోమద్భక్తస్సమే ప్రియః ॥ ౧౪

యస్మాన్నోద్విజతే లోకో
లోకాన్నోద్విజతే చ యః ।
హర్షామర్షభయోద్వేగైః
ముక్తోయస్సచ మే ప్రియః ॥ ౧౫

దీనినైన సలుపజాలవేని, నీవు
నా నిమిత్తకర్మముల నొనర్పఁగడఁగు
నా కొఱకు కర్మములను నొనర్చుచున్న,
పడయఁగలవీవు సిద్ధిని భవ్యచరిత! 10

అదియునైతము నీవు చేయంగలేక
అర్జునా! అసమర్థుండవైతివేని,
ఆత్మ నియమించి, మద్యోగమాశ్రయించి,
అఖిలకర్మఫలత్యాగివగుము నీవు. 11

జ్ఞాన మభ్యాసయోగంబుకంటె ఘనము,
జ్ఞానమునకన్న ధ్యానమార్గంబె ఘనము,
ఘనము ధ్యానంబుకంటె నిష్కామకర్మ
యోగ, మిది శాంతిఁ గలిగించుచుండుఁ గాన. 12

సర్వభూతంబులందు ద్వేషంబు లేక
కరుణఁజూపుచు స్నేహంబు నెఱపు వాఁడు,
మహి నహంకారమమకార రహితుఁడగుచు,
సుఖము దుఃఖమ్ము సమతను జూచు వాఁడు
ఓర్మిగలవాఁడు, సంతుష్టినొప్పువాఁడు,
నిగ్రహాత్ముండు, యోగియు, నిశ్చలుండు,
మనసు బుద్ధియు నాయందె మగ్నపఱచు
నట్టి మద్భక్తుఁడే ప్రియుండగును నాకు. 13, 14

ఎవనిచే లేదొ లోకానికెట్టి భయము,
ఎవఁడు లోకంబుచే భయ మెఱుఁగఁడో
హర్షమును, రోష[1]వేగభయంబులుడిగి
యుండునెవఁ డట్టివాఁడె ప్రియుండు నాకు. 15

1 ఉద్వేగము (మనోవ్యాకులత) లేక తొందరపాటు.

అనపేక్షశ్శుచిర్దక్షః
ఉదాసీనో గతవ్యథః।
సర్వారంభపరిత్యాగీ
యో మద్భక్తస్సమే ప్రియః ॥ ౧౬

యో న హృష్యతి న ద్వేష్టి
న శోచతి న కాంక్షతి।
శుభాశుభపరిత్యాగీ
భక్తిమాన్ యస్సమే ప్రియః ॥ ౧౭

సమశ్శత్రౌ చ మిత్రే చ
తథా మానావమానయోః।
శీతోష్ణసుఖదుఃఖేషు
సమస్సంగ వివర్జితః ॥ ౧౮

తుల్యనిందాస్తుతిర్మౌనీ
సంతుష్టో యేన కేనచిత్।
అనికేతః స్థిరమతిః
భక్తిమాన్మే ప్రియో నరః ॥ ౧౯

యే తు ధర్మ్యామృతమిదం
యథోక్తం పర్యుపాసతే।
శ్రద్దధానా మత్పరమా
భక్తాస్తేఽతీవ మే ప్రియాః ॥ ౨౦

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే భక్తియోగోనామ
ద్వాదశోఽధ్యాయః.

కర్మకుశలుండు, శుచియు, నిష్కామపరుఁడు,
మఱియు నిర్లిప్తుఁడును, వ్యథావిరహితుండు,
ఎల్లయారంభములఁద్యజియించువాఁడు
నాదుభక్తుఁడెవఁడొ, వాఁడె నాకు ప్రియుఁడు. 16

పార్థ! హర్షశోకద్వేషవాంఛలెవఁడు
వదలివైచి, శుభాశుభఫలములెల్ల
విడిచి, నాదు భక్తుండయి వెలయునట్టి
వాఁడె, నాకు ప్రియుండగు పాండుతనయ! 17

మిత్రవర్గంబునందు అమిత్రులందు
మానమందు మఱియు నవమానమందు
కనఁగ శీతోష్ణ, సౌఖ్యదుఃఖమ్ములందు
నిందలందేని, సంస్తుతులందు నేని
సతము సమబుద్ధిఁగలిగి, నిస్సంగుఁడగుచు
ప్రాప్తి యగునట్టి దానిచే తృప్తినొంది
మౌనియు, గృహచ్యుతుఁడు, స్థిరమతియు నగుచు
నుండు, మద్భక్తవరుఁడె ప్రియుండు నాకు. 18, 19

ఏనె పరమగతి యటంచు నెంచి, నాదు
భక్తులగుచు, సుశ్రద్ధ, మదుక్తమైన
యట్టి ధర్మ్యామృతమ్మును ఎవరు సేవ
సమ్ము గావింతురో, వారె నాకు హితులు. 20

ఇది ఉపనిషత్ప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రంబును,
శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీమద్భగవద్గీతలందు
భక్తియోగమను పండ్రెండవ అధ్యాయము.



# శ్రీమద్భగవద్గీతా

## త్రయోదశోఽధ్యాయః

### -: క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగః :-

అర్జున ఉవాచ:-

ప్రకృతిం పురుషం చైవ
క్షేత్రం క్షేత్రజ్ఞమేవ చ ।
ఏతద్వేదితుమిచ్ఛామి
జ్ఞానం జ్ఞేయం చ కేశవ! ॥

శ్రీభగవానువాచ :-

ఇదం శరీరం కౌన్తేయ!
క్షేత్రమిత్యభిధీయతే ।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః
క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥ ౧

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి
సర్వక్షేత్రేషు భారత! ।
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం
యత్తద్జ్ఞానం మతం మమ ॥ ౨

తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ
యద్వికారి యతశ్చయత్ ।
స చ యో యత్ప్రభావశ్చ
తత్సమాసేన మే శృణు ॥ ౩

ఋషిభిర్బహుధా గీతం
ఛన్దోభిర్వివిధైః పృథక్ ।
బ్రహ్మసూత్రపదైశ్చైవ
హేతుమద్భిర్వినిశ్చితైః ॥ ౪

ఓమ్

# గీతా సుధా లహరి

## పదుమూడవ అధ్యాయము

## -: క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము :-

అర్జునుఁడిట్లనియె:-

ఏది ప్రకృతి? పురుషుఁడన నెవఁడు? క్షేత్ర
మనఁగ నెట్టిది? క్షేత్రజ్ఞుఁడనఁగ నెవఁడు?
జ్ఞానమన జ్ఞేయమననేమి? నాకు వీని
నెల్ల, కేశవా! చక్కఁగా నెఱుఁగఁజెపుమ.

భగవానుఁడిట్లనియె:-

ధరణి నీ శరీరమునె క్షేత్రంబటంచు
దీనినెల్లసమగ్రముగా నెఱుంగు
వాని క్షేత్రజ్ఞుఁడంచును బలుకుచుంద్రు
ఫల్గునా! తద్విదులయిన వారలెల్ల. 1

అర్జునా! యెల్లక్షేత్రంబులందుగూడ
నేనె క్షేత్రజ్ఞుఁడనటంచు నెఱుఁగుమీవు.
ఇట్లు క్షేత్రంబు, క్షేత్రజ్ఞు నెఱుఁగునట్టి
జ్ఞానమే జ్ఞానమంచును నేను దలఁతు. 2

ఏది క్షేత్రంబొ? ఎట్టిదో? ఏ వికార
ములుఁగలదియో? ఎచటనుండి పుట్టినదియొ?
మఱియు క్షేత్రజ్ఞుఁడెవఁడొ? తన్మహిమ మేమొ?
ఇంక సంగ్రహంబుగ వచియింతు. వినుమ! 3

ఇది అనేకవిధంబుల ఋషులచేత
వేఱువేఱ, వివిధవేదవితతియందు
[1]హేతుయుక్తవినిశ్చితమై తలిర్చు
బ్రహ్మసూత్రపదంబులఁ బలుకఁబడియె. 4

---

1 సహేతుకములు, సంశయరహితములైనవి.

మహాభూతాన్యహంకారో
బుద్ధిరవ్యక్తమేవ చ ।
ఇంద్రియాణి దశైకం చ
పంచచేంద్రియగోచరాః ॥ ౫

ఇచ్ఛా ద్వేషస్సుఖం దుఃఖం
సంఘాతశ్చేతనా ధృతిః ।
ఏతత్ క్షేత్రం సమాసేన
సవికారముదాహృతమ్ ॥ ౬

అమానిత్వమదంభిత్వం
అహింసా క్షాంతిరార్జవమ్ ।
ఆచార్యోపాసనం శౌచం
స్థైర్యమాత్మవినిగ్రహః ॥ ౭

ఇంద్రియార్థేషు వైరాగ్యం
అనహంకార ఏవ చ ।
జన్మమృత్యుజరావ్యాధి-
దుఃఖదోషానుదర్శనమ్ ॥ ౮

అసక్తిరనభిష్వంగః
పుత్రదారగృహాదిషు ।
నిత్యం చ సమచిత్తత్వం
ఇష్టానిష్టోపపత్తిషు ॥ ౯

మయి చానన్యయోగేన
భక్తిరవ్యభిచారిణీ ।
వివిక్తదేశసేవిత్వం
అరతిర్జనసంసది ॥ ౧౦

బుద్ధ్యహంకారములు, పంచభూతములును,
అర్జునా! జ్ఞానకర్మేంద్రియదశకమ్ము,
మానసమ్ము [1]అవ్యక్తమున్ మఱియు, పాండు
వసుమతీశపుత్ర! విషయపంచకమ్ము; 5

కామమున్ [2]చేతనయును, దుఃఖమ్ము, సుఖము
దేహతత్త్వసంఘాతశక్తియును, ధృతియు,
అనునివి కలిసి సవికారమైనయట్టి
క్షేత్రమని చెప్పఁబడును సంక్షేపముగను. 6

నిరభిమానమ్ము ఆత్మవినిగ్రహమ్ము
దంభరాహిత్యమును, శుచిత్వమ్ము, క్షమయు,
[3]ఆర్జవంబహింసయును, [4]స్థైర్యమును, మఱియు
విజయ! సద్భక్తి గురుల సేవించుటయును; 7

అఖిలవిషయమ్ముల విరాగి యగుచునుంట
ఇంచుకంతయు గర్వంబుఁ గాంచకుంట,
జన్మమృత్యుజరావ్యాధిచయము వలనఁ
గలుగు దుఃఖదోషంబులన్ దెలిసికొనుట; 8

అవని పుత్రకళత్రగృహాదులందు
లేశము నపేక్ష తగులముల్ లేకయుంట
ఇష్టమేనియు మఱియునిష్టమేని
ఒదవినప్పుడు సమబుద్ధి వదలకుంట; 9

సన్నసన్యయోగమున, అనారతమ్ము
నిశ్చలంబగు భక్తి ధ్యానించుచుంట,
జనసమూహమునందిచ్ఛ నెనయకుంట,
విజనసీమసంవాసియై వెలయుచుంట; 10

---

1 మూలప్రకృతి 2 తెలివి (వృత్తిజ్ఞానము) 3 ఋజువర్తనము 4 సాధయత్నమంతయు స్థిరత్వము గలిగియుండుట.

అధ్యాత్మజ్ఞాననిత్యత్వం
తత్త్వజ్ఞానార్థదర్శనమ్ ।
ఏతజ్జ్ఞానమితి ప్రోక్తం
అజ్ఞానం యదతోఽన్యథా ॥ ౧౨

జ్ఞేయం యత్తత్ ప్రవక్ష్యామి
యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే ।
అనాదిమత్పరం బ్రహ్మ
న సత్తన్నాఽసదుచ్యతే ॥ ౧౩

సర్వతః పాణిపాదం తత్
సర్వతోఽక్షిశిరోముఖమ్ ।
సర్వతశ్శ్రుతిమల్లోకే
సర్వమావృత్య తిష్ఠతి ॥ ౧౪

సర్వేంద్రియగుణాభాసం
సర్వేంద్రియవివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ
నిర్గుణం గుణభోక్తృ చ ॥ ౧౫

బహిరంతశ్చ భూతానాం
అచరం చరమేవ చ ।
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం
దూరస్థం చాంతికే చ తత్ ॥ ౧౬

అవిభక్తం చ భూతేషు
విభక్తమివ చ స్థితమ్ ।
భూతభర్తృ చ తజ్జ్ఞేయం
గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥ ౧౭

అలరుచుంట ఆత్మజ్ఞానమందు నెపుడు
మోక్షతత్త్వార్థసందృష్టి మునిగియుంట
జ్ఞానమని వచింపఁబడును, సవ్యసాచి!
దీనికన్యంబదెల్ల అజ్ఞానమె సుమి. 11

తెలియఁదగినదేదియో, దేనిఁదెలియ ముక్తి
యొదవునో, అట్టిదానిఁ జెప్పెదను వినుము!
అది అనాదిపరబ్రహ్మ మద్ది[1] యసత్తు
సత్తని వచింపరానిది, సవ్యసాచి! 12

అరయ నర్జున! అయ్యది అన్ని యెడల
కరములును, చరణంబులున్, కనులు, చెవులు,
తలలు, మఱియు మొగమ్ములుఁ గలిగియుండి
వర్తియుండు సర్వమును, బ్రపంచమందు. 13

సకల సర్వేంద్రియ గుణాభాసమయ్యు,
పార్థ! అది నిఖిలేంద్రియవర్జితమ్ము,
సర్వమును భరించు నద్ది అసక్తమయ్యు,
గుణరహితమయ్యు, గుణముల ననుభవించు. 14

జీవులకు లో వెలుపల వసించుచుండు,
చరము నచరంబునై యది పరగుచుండు,
అతిసూక్ష్మమగుట తెలియంగరాదు
దూరమున, మఱి దగ్గఱ దోచుచుండు. 15

ప్రాణితతులందు ఇది అవిభక్తమయ్యు,
విజయ! విభజింపఁబడినట్లు వెలయుచుండు;
భూతసృష్టిస్థితి వినాశముల నొనర్చు
నది, యటంచును తెలియంగనగును దీని. 16

---

1 ఉన్నది లేనిది.

జ్యోతిషామపి తజ్జ్యోతిః
తమసః పరముచ్యతే ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం
హృది సర్వస్య నిష్ఠితమ్ ॥ ౧౭

ఇతి క్షేత్రం తథా జ్ఞానం
జ్ఞేయం చోక్తం సమాసతః ।
మద్భక్త ఏతద్విజ్ఞాయ
మద్భావాయోపపద్యతే ॥ ౧౮

ప్రకృతిం పురుషం చైవ
విద్ధ్యనాదీ ఉభావపి ।
వికారాంశ్చ గుణాంశ్చైవ
విద్ధి ప్రకృతిసంభవాన్ ॥ ౧౯

కార్యకారణకర్తృత్వే
హేతుః ప్రకృతిరుచ్యతే ।
పురుషస్సుఖదుఃఖానాం
భోక్తృత్వే హేతురుచ్యతే ॥ ౨౦

పురుషః ప్రకృతిస్థో హి
భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్ ।
కారణం గుణసంగోఽస్య
సదసద్యోని జన్మసు ॥ ౨౧

ఉపద్రష్టాఽనుమంతా చ
భర్తా భోక్తా మహేశ్వరః ।
పరమాత్మేతి చాప్యుక్తో
దేహేఽస్మిన్ పురుషః పరః ॥ ౨౨

జ్యోతులకు జ్యోతి యిది తమస్సునకు పరము,
జ్ఞానమును, జ్ఞేయమును, జ్ఞానగమ్యమిద్ది,
అఖిలభూతహృదయముల నధివసించు
చుండునంచుఁ జెప్పంగఁ బడుచుండు నిద్ది. 17

నీకు క్షేత్రముఁ జ్ఞానముఁ జ్ఞేయమిటులఁ
దెలిపితిని సంగ్రహంబుగ, దీని నెఱిఁగి
నాదు భక్తుండు నిరతంబు, నాదు భావ
మందఁగా అర్హుఁడగుచుండునయ్య, నిజము. 18

ప్రకృతి పురుషుండు నాఁగను బరగు రెండు
అర్జునా! అనాదులటంచు నరయుమీవు,
ప్రకృతి వలననే గుణవికారమ్ములెల్లఁ
గలుగుచుండు నటంచును దెలిసి కొనుము! 19

కార్యకారణకర్తృత్వగతికి నెపుడు
ప్రకృతియే కారణంబంచుఁ బలుకఁబడియె;
ఫల్గునా! సుఖదుఃఖానుభవముల కిల
పురుషునే వచింతురు, హేతుభూతుఁడనుచు. 20

ప్రకృతియందుండి పురుషుండు ప్రకృతిభవము
లైన సర్వగుణంబుల ననుభవించుఁ
గాన, ఆ గుణసంగమే కారణమగు
ఉచ్చనీచజన్మంబులనొందు నతఁడు. 21

తనువునందు పరుండయి తనరునట్టి
పురుషుఁడాతఁ [1]డుపద్రష్ట, భోక్త, భర్త
సమ్మతిప్రదాతయు, మహేశ్వరుఁడు మఱియు
పార్థ! పరమాత్మ అనియును బలుకఁబడును. 22

---

1 సాక్షిభూతుఁడు.

య ఏవం వేత్తి పురుషం
ప్రకృతిం చ గుణైస్సహ ।
సర్వథా వర్తమానోఽపి
న స భూయోఽభిజాయతే ॥ ౨౩

ధ్యానేనాత్మని పశ్యంతి
కేచిదాత్మానమాత్మనా ।
అన్యే సాంఖ్యేన యోగేన
కర్మయోగేన చాపరే ॥ ౨౪

అన్యేత్వేవమజానంతః
శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే ।
తేఽపి చాతితరంత్యేవ
మృత్యుం శ్రుతిపరాయణాః ॥ ౨౫

యావత్ సంజాయతే కించిత్
సత్త్వం స్థావరజంగమమ్ ।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్
తద్విద్ధి భరతర్షభ! ॥ ౨౬

సమం సర్వేషు భూతేషు
తిష్ఠంతం పరమేశ్వరమ్ ।
వినశ్యత్స్వవినశ్యంతం
యః పశ్యతి స పశ్యతి ॥ ౨౭

సమం పశ్యన్హి సర్వత్ర
సమవస్థితమీశ్వరమ్ ।
న హినస్త్యాత్మనాఽఽత్మానం
తతో యాతి పరాం గతిమ్ ॥ ౨౮

[1] పురుషుని౯ గుణసహితమై పరగు ప్రకృతి
నెవ్వఁడీరీతి, చక్కఁగా నెఱుఁగఁ గలఁడొ
ఆతఁడెవ్విధి వర్తించు నాతఁడయ్యు
తిరిగి జనియింపఁబోఁడు కుంతీతనూజ! 23

ఆత్మచే కొందఱాత్మను ఆత్మయందుఁ
గాంచుచుందురు ధ్యానయోగమ్ముచేత;
కొంద్రు కొందఱు సాంఖ్యయోగమ్మువలన,
కర్మయోగాన కొందఱు గాంచుచుంద్రు. 24

ఇటుల తెలియని మఱికొందఱెఱిఁగినట్టి
శిష్టులవలన విని ఉపాసించుచుంద్రు;
శ్రవణతత్పరులైన ఆ జనులు గూడ
సులభముగ మృత్యువును దాటఁగలరు సుమ్ము. 25

స్థావరమొ? జంగమంబొ? యీ జగతి లోన
ప్రభవమొందెడునట్టి యేవస్తువేని
ప్రకృతిపురుషసంయోగకారణముకలిమి
కలుగుచుండు నటంచును దలఁపుమయ్య; 26

సర్వభూతౌఘములయందు సమముగాను,
పరగుచున్నయట్టి పరమేశ్వరునెవండు
జీవరతి నశించినను నశింపనటుల
చూచు, వాఁడె, నిజంబుగ చూచువాఁడు. 27

సకలభూతజాలములందు సమముగాను
పొలుచు నీశ్వరు చక్కఁగాఁ దెలియు నాతఁ
డాత్మచే ఆత్మ హింసింపఁ డతఁడు. కాన
పరమగతి సులభంబుగాఁ బడయఁగలఁడు. 28

1 అవ్య

ప్రకృత్యైవ చ కర్మాణి
క్రియమాణాని సర్వశః ।
యః పశ్యతి తథాఽత్మానం
అకర్తారం స పశ్యతి ॥ ౨౯

యదా భూతపృథగ్భావం
ఏకస్థమనుపశ్యతి ।
తత ఏవ చ విస్తారం
బ్రహ్మ సంపద్యతే తదా ॥ ౩౦

అనాదిత్వాన్నిర్గుణత్వాత్
పరమాత్మాఽయమవ్యయః ॥
శరీరస్థోఽపి కౌంతేయ
న కరోతి న లిప్యతే ॥ ౩౧

యథా సర్వగతం సౌక్ష్మ్యాత్
ఆకాశం నోపలిప్యతే ।
సర్వత్రావస్థితో దేహే
తథాఽత్మా నోపలిప్యతే ॥ ౩౨

యథా ప్రకాశయత్యేకః
కృత్స్నం లోకమిమం రవిః ।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం
ప్రకాశయతి భారత ॥ ౩౩

క్షేత్రక్షేత్రజ్ఞయోరేవం
అంతరం జ్ఞానచక్షుషా ।
భూతప్రకృతిమోక్షం చ
యే విదుర్యాంతి తే పరం ॥ ౩౪

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగో నామ
త్రయోదశోఽధ్యాయః.

ప్రకృతిచేతనే నిఖిలకర్మంబులనఘ!
సలుపఁబడుచుండు నెప్పుడీ జగతిలోన;
ఆత్మ యెన్నఁడు కర్తకాదంచు నెవఁడు
కాంచు నాతఁడే నిజముగఁ గాంచువాఁడు. 29

ప్రాణితతి వేఱువేఱు భావములు ఒక్క-
దానియందె కలవనియు, దానినుండి
అవ్వి విస్తరింపఁగఁబడునంచు ఎవ్వఁ
డరయు, ఆతఁడే తా బ్రహ్మమగును నిజము. 30

ఆద్యరహితుండు, నిర్గుణుండవ్యయుండు
నైన పరమాత్మ పార్థ! దేహమ్మునందు,
అధివసించియు కర్మములాచరింపఁ
బోఁడు, వానిచే లిప్తుండుఁ గాఁడతండు. 31

సర్వగతమయ్యు గగనమ్ము సవ్యసాచి!
అమిత సూక్ష్మమగుట ఎటులంటుఁబడదొ
అట్లె ఆత్మ సర్వత్ర దేహమ్మునందు
అలరుచున్నను ఎపుడు తా నంటువడదు. 32

లోకబాంధవుండొకఁడె యీ లోకమెల్ల
ఎటు ప్రకాశింపఁజేయునో, అటులె విజయ!
తాను క్షేత్రజ్ఞుఁడొకడె క్షేత్రంబునెల్ల
తేజరిల్లఁగఁజేయు దేదీప్యముగను. 33

అవని దేహిదేహమ్ముల అంతరమ్ము,
సకలభూతప్రకృతి విమోక్షణము, నిట్లు
జ్ఞానదృష్టి నెవ్వారలు కాంచఁగలరో,
పడయుచుందురు వారలు పరమపదము. 34

ఇది ఉపనిషత్ప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రంబును,
శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీమద్భగవద్గీతలందు
క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగమను పదుమూఁడవ అధ్యాయము.



# శ్రీమద్భగవద్గీతా

## చతుర్దశోఽధ్యాయః

### -: గుణత్రయవిభాగయోగః :-

శ్రీభగవానువాచ :-

పరం భూయః ప్రవక్ష్యామి
జ్ఞానానాం జ్ఞానముత్తమమ్ ।
యద్ జ్ఞాత్వా మునయస్సర్వే
పరాం సిద్ధిమితో గతాః ॥ ౧

ఇదం జ్ఞానముపాశ్రిత్య
మమ సాధర్మ్యమాగతాః ।
సర్గేఽపి నోపజాయంతే
ప్రలయే న వ్యథన్తి చ ॥ ౨

మమ యోనిర్మహద్బ్రహ్మ
తస్మిన్ గర్భం దధామ్యహమ్ ।
సంభవస్సర్వభూతానాం
తతో భవతి భారత! ॥ ౩

సర్వయోనిషు కౌంతేయ!
మూర్తయస్సంభవంతి యాః ।
తాసాం బ్రహ్మ మహద్యోనిః
అహం బీజప్రదః పితా ॥ ౪

సత్త్వం రజస్తమ ఇతి
గుణాః ప్రకృతిసంభవాః ॥
నిబధ్నంతి మహాబాహో!
దేహే దేహినమవ్యయమ్ ॥ ౫

ఓమ్

# గీతాసుధాలహరి

## పదునాలుగవ అధ్యాయము

### -: గుణత్రయవిభాగయోగము :-

భగవానుఁడిట్లనియె:-

ఎల్ల మునివర్యులును, దేని నెఱిఁగి, దేహ
ములను బాసి, పరమసిద్ధిఁ బొందినారొ,
జ్ఞానములలోన ఉత్తమజ్ఞాన మెదియొ
వినుము తెల్పెద మఱల దానిని, కిరీటి! 1

అర్జునా! యిట్టి జ్ఞానమ్ము నాశ్రయించు
వారు, నాదు [1]సాధర్మ్యమ్ముఁ బడయఁగలిగి
సృష్టి యందేని జన్మమ్ము నెత్తఁబోరు
ప్రళయ మందేని వ్యథలను బడయఁబోరు. 2

ఫల్గునా! [2]మహద్బ్రహ్మమౌ ప్రకృతి నాదు
యోనియగు, అందు గర్భమ్ము నుంతునేను,
దాని వలన ఈ సర్వభూతప్రతతియు
సంభవించుచునుండు ఈ జగతియందు. 3

సర్వగర్భంబులందుండి, సవ్యసాచి!
ప్రభవమొందుచునుండు ఈ ప్రాణితతికి
నెల్ల, నా మహద్బ్రహ్మప్రకృతియె తల్లి,
విజయ! బీజప్రదుండనౌ పితను నేనె. 4

ప్రకృతి సంభవంబులగు సత్త్వగుణమును, ర
జస్తమోగుణంబులును ఈ జగతిలోన
అవ్యయుండగు దేహి, దేహంబునందుఁ
బట్టి బంధించుచుండును పాండుపుత్ర! 5

---

1. స్వరూపమునందు ఐక్యము 2. మాయారూపిణియగు మూలప్రకృతి

తత్రసత్త్వం నిర్మలత్వాత్
ప్రకాశకమనామయమ్ ।
సుఖసంగేన బధ్నాతి
జ్ఞానసంగేన చానఘ! ॥ ౬

రజో రాగాత్మకం విద్ధి
తృష్ణాసంగసముద్భవమ్ ।
తన్నిబధ్నాతి కౌంతేయ!
కర్మసంగేన దేహినమ్ ॥ ౭

తమ స్త్వజ్ఞానజం విద్ధి
మోహనం సర్వదేహినామ్ ।
ప్రమాదాలస్యనిద్రాభిః
తన్నిబధ్నాతి భారత! ౮

సత్త్వం సుఖే సంజయతి
రజః కర్మణి భారత! ।
జ్ఞానమావృత్య తు తమః
ప్రమాదే సంజయత్యుత ॥ ౯

రజ స్తమశ్చాభిభూయ
సత్త్వం భవతి భారత! ।
రజస్సత్త్వం తమశ్చైవ
తమస్సత్త్వం రజ స్తథా ॥ ౧౦

సర్వద్వారేషు దేహేఽస్మిన్
ప్రకాశ ఉపజాయతే ।
జ్ఞానం యదా తదా విద్యాత్
వివృద్ధం సత్త్వమిత్యుత ॥ ౧౧

వానిలో సత్త్వము ప్రకాశమానమగుచు,
నిర్మలము [1]అనామయమునై నెగడుచుండు
కాన, అది [2]సుఖజ్ఞానసంగమ్ముచేత
దేహి నెప్పుడు బంధమొందించుచుండు. 6

రాగయుతమైనయట్టి రజోగుణంబు
పార్థ! [3]తృష్ణానుసంగోద్భవమ్మటంచుఁ
గాంచుమా! అద్ది [4]కర్మసంగమ్ము చేత
దేహి నెప్పుడు బంధమొందించుచుండు. 7

పుడమి అజ్ఞానజనిత తమోగుణంబ
దెల్ల దేహుల మిగుల మోహింపఁజేసి,
అధికనిద్రాప్రమాదమాంద్యములచేత
పట్టి బంధించుచుండు ఈ ప్రాణి తతుల. 8

సౌఖ్యములయందు చేర్చును సత్త్వగుణము
రజముచేర్చుచునుండు కర్మమ్ములందు,
జ్ఞానమును ఆవరించుచు, సవ్యసాచి!
తమము చేర్చు సతము ప్రమాదమ్మునందు. 9

సత్త్వమభివృద్ధినొందు రజస్తమోగు
ణంబుల తిరస్కరించి, రజంబు వెలయు
తమము సత్త్వంబులను మీఱి, తమము మించు
రజము సత్త్వంబుల సదా తిరస్కరించి. 10

అర్జునా! యీ శరీరంబునందున్న
ఎల్లద్వారంబులందుండి యెప్పుడు జ్ఞాన
మది ప్రకాశించి వెలయునో. అప్పుడెల్ల
వృద్ధియయ్యె సత్త్వంబని యెఱుఁగ వలయు. 11

---

1 ఉపద్రవములేనిది 2 ఇంద్రియసుఖము, వృత్తిజ్ఞానములయందలి ఆసక్తి 3 విషయాభిమానమునుండి పుట్టినది 4 కర్మాసక్తిచే.

లోభః ప్రవృత్తిరారంభః
కర్మణామశమః స్పృహా ।
రజస్యేతాని జాయంతే
వివృద్ధే భరతర్షభ! ౧౨

అప్రకాశోఽప్రవృత్తిశ్చ
ప్రమాదో మోహ ఏవ చ ।
తమస్యేతాని జాయంతే
వివృద్ధే కురునందన! ॥ ౧౩

యదా సత్త్వే ప్రవృద్ధే తు
ప్రలయం యాతి దేహభృత్ ।
తదోత్తమవిదాం లోకాన్
అమలాన్ ప్రతిపద్యతే ॥ ౧౪

రజసి ప్రలయం గత్వా
కర్మసంగిషు జాయతే ।
తథా ప్రలీనస్తమసి
మూఢయోనిషు జాయతే ॥ ౧౫

కర్మణస్సుకృతస్యాహుః
సాత్త్వికం నిర్మలం ఫలమ్ ।
రజసస్తు ఫలం దుఃఖం
అజ్ఞానం తమసః ఫలమ్ ॥ ౧౬

సత్త్వాత్సంజాయతే జ్ఞానం
రజసో లోభ ఏవ చ ।
ప్రమాదమోహౌ తమసో
భవతోఽజ్ఞానమేవ చ ॥ ౧౭

ఫల్గునా! ప్రవృత్తియును, లోభమ్ము శాంతి
సకల కర్మంబులందు కాంక్షయును, ఆశ,
ఎప్పుడొదవుచు నుండునో అప్పుడెల్ల
వృద్ధియయ్యె రజంబని యెఱుఁగ వలయు. 12

ఎవని కే జగతీస్థలి నెన్నఁడేని
అప్రవృత్తియు, మఱియు మోహమ్ము, అప్ర
కాశమును, ప్రమాదంబును గలుగు, అపుడ
వృద్ధియయ్యె తమంబని యెఱుఁగ వలయు. 13

సత్త్వమభివృద్ధిఁ జెందెడు సమయమందు
ఫల్గునా! దేహి దేహంబుఁ బాసె నేని,
ఉత్తమజ్ఞానులగువారలొందునట్టి
పుణ్యలోకంబులెల్ల తాఁ బొందుచుండు. 14

మృతినిఁ బొంద రజోగుణవృద్ధియందు,
జననమొందు నతఁడు కర్మసంగులందు;
తమము వృద్ధిఁ జెందునపుడు తనువు విడువ
మూఢయోనులయందుఁ దాఁ బుట్టుచుండు. 15

మహితలమ్మున సుకృతకర్మమున కెపుడు
సాత్త్వికము నిర్మలంబును సత్ఫలంబు;
గాఢదుఃఖంబె రాజసకర్మఫలము,
కనఁగ మౌఢ్యంబె తామసకర్మఫలము. 16

సత్త్వగుణముచే జ్ఞానంబు సంభవించు,
రజముచేతను లోభంబు ప్రభవమొందు,
తమముచేత నెప్పుడు ప్రమాదంబు, మఱియు,
మోహమజ్ఞానమును పార్థ! పుట్టుచుండు. 17

ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా
మధ్యే తిష్ఠంతి రాజసాః ।
జఘన్యగుణవృత్తిస్థా
అధోగచ్ఛంతి తామసాః ॥ ౧౮

నాన్యం గుణేభ్యః కర్తారం
యదా ద్రష్టాఽనుపశ్యతి ।
గుణేభ్యశ్చ పరం వేత్తి
మద్భావం సోఽధిగచ్ఛతి ॥ ౧౯

గుణానేతానతీత్య త్రీన్
దేహీ దేహసముద్భవాన్ ।
జన్మమృత్యుజరాదుఃఖైః
విముక్తోఽమృతమశ్నుతే ॥ ౨౦

అర్జున ఉవాచ:-

కైర్లింగైస్త్రీన్ గుణానేతాన్
అతీతో భవతి ప్రభో! ।
కిమాచారః కథంచైతాం
స్త్రీన్ గుణానతివర్తతే ॥ ౨౧

శ్రీభగవానువాచ:-

ప్రకాశం చ ప్రవృత్తిం చ
మోహమేవ చ పాండవ! ।
న ద్వేష్టి సమ్ప్రవృత్తాని
న నివృత్తాని కాంక్షతి ॥ ౨౨

ఊర్ధ్వలోకముల్ సాత్త్వికులొందుచుంద్రు
కాంత్రు రాజసుల్ మధ్యలోకములనెల్ల
నీచగుణవృత్తిచేతను నెగడు తామ
సులెపుడు అధోభువనములఁ జొచ్చుచుంద్రు. 18

ఆత్మ స్వయముగ కర్తకాదని యెఱుంగు
కాంచు, గుణములె కర్తయగా గ్రహించు
సాక్షిగా తన్ను గుఱుతించు, అట్టివాఁడు
నా స్వరూపమ్ముఁ జెందుచున్నాఁడు పార్థ! 19

దేహమందు జనించు ఆ త్రిగుణములను
దేహి చక్కఁగా నెఱిఁగి అతిక్రమించి,
జన్మమృత్యుజరాదుఃఖచయమునుండి
ముక్తుఁడై పరమపదంబుఁ బొందుచుండు. 20

అర్జునుఁడిట్లనియె:-

దేవ! యీ త్రిగుణముల నతిక్రమించు
నాతఁడెట్టి లక్షణముల నలరుచుండు?
ఎట్టి ఆచారవంతుఁడై యొసఁగునతఁడు?
త్రిగుణముల నెట్టులాతఁడతిక్రమించు? 21

భగవానుఁడిట్లనియె:-

త్రిగుణములఁబట్టి ప్రాప్తించునట్టి
వౌ, [1]ప్రకాశ [2]ప్రవృత్తి [3]మోహములనెప్పు
డెవఁడు ద్వేషింపఁడో? అవియెల్ల తనకు
దూరమైనను కాంక్షింప నేరడెవఁడు? 22

---

1 సత్త్వగుణసంబంధమగు ప్రకాశమును 2 రజోగుణసంబంధమైన కార్యవ్యాపకత్వము
3 తమోగుణసంబంధమైనభ్రమ.

ఉదాసీనవదాసీనో
గుణైర్యో న విచాల్యతే ।
గుణా వర్తన్త ఇత్యేవ
యోఽవతిష్ఠతి నేంగతే ॥ ౨౩

సమదుఃఖసుఖః స్వస్థః
సమలోష్టాశ్మకాంచనః ।
తుల్యప్రియాప్రియో ధీరః
తుల్యనిందాత్మసంస్తుతిః ॥ ౨౪

మానావమానయోస్తుల్యః
తుల్యో మిత్రారిపక్షయోః ।
సర్వారంభపరిత్యాగీ
గుణాతీతస్స ఉచ్యతే ॥ ౨౫

మాం చ యోఽవ్యభిచారేణ
భక్తియోగేన సేవతే ।
సగుణాన్సమతీత్యైతాన్
బ్రహ్మభూయాయ కల్పతే ॥ ౨౬

బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహం
అమృతస్యాఽవ్యయస్యచ ।
శాశ్వతస్య చ ధర్మస్య
సుఖస్యైకాంతికస్య చ ॥ ౨౭

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే గుణత్రయవిభాగయోగోనామ
చతుర్దశోఽధ్యాయః.

ఎవఁడుదాసీనుఁడౌచును ఎసఁగుచుండు,
ఎవఁడు గుణములచే చలియింపఁబడడో,
ఎంచు నెవఁడు, గుణములె వర్తించుచున్న
వంచు, ఎవ్వఁడు నిశ్చలుండగుచు నుండు; 23

దుఃఖసుఖముల, నిందలన్ స్తుతుల, [1]లోష్ట
కాంచనాశ్మముల్ సమదృష్టిఁ గాంచు నెవ్వ,
డలరు నెవఁడు తుల్యుఁడయి ప్రియాప్రియముల,
[2]స్వస్థుఁడును ధీరుఁడగుచును బరగునెవఁడు; 24

మానమందు మఱియు నవమానమందు,
అహితవిహితుల సమబుద్ధి నలరునెవఁడు;
ఎల్ల కార్యంబులను త్యజియించునెవ్వఁ,
డట్టివాఁడె గుణాతీతుఁడనగ నొప్పు. 25

స్థిరమయిన భక్తియోగంబుచేత సతము
నన్ను విడువక సేవించుచున్నవాఁడు
త్రిగుణముల నవధుల నతిక్రమించి
బ్రహ్మమగుటకు తాను అర్హత గడించు. 26

[3]అవ్యయమ్మును, [4]అమృతమ్మునై నయట్టి
బ్రహ్మమునకును, నిత్యధర్మమ్మునకును,
చలనమొందని [5]దివ్యమౌ సౌఖ్యమునకు
ఆశ్రయస్థానమేనె పృథాత్మజాత! 27

ఇది ఉపనిషత్ప్రతిపాదతంబును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రంబును,
శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీమద్భగవద్గీతలందు
గుణత్రయవిభాగయోగమను పదునాలుగవ అధ్యాయము.

---

*1 మట్టిపెళ్ళ, బంగారము, రాయి 2 ఆత్మయందు సుస్థిరముగనుండువాఁడు 3 వికార రహితము 4 వినాశరహితము 5 నిరతిశయానందము.*



# శ్రీమద్భగవద్గీతా

## పంచదశోఽధ్యాయః

### -: పురుషోత్తమప్రాప్తియోగః :-

శ్రీభగవానువాచ :-

ఊర్ధ్వమూలమధశ్శాఖం
అశ్వత్థం ప్రాహురవ్యయమ్ ।
ఛందాంసి యస్య పర్ణాని
యస్తం వేద స వేదవిత్ ॥ ౧

అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖాః
గుణప్రవృద్ధా విషయప్రవాలాః ।
అధశ్చ మూలాన్యనుసంతతాని
కర్మానుబంధీని మనుష్యలోకే ॥ ౨

న రూపమస్యేహ తథోపలభ్యతే
నాంతో నచాదిర్నచ సంప్రతిష్ఠా ।
అశ్వత్థమేనం సువిరూఢమూలం
అసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా ॥ ౩

తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్ గతా న నివర్తంతి భూయః ।
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ ॥ ౪

ఓమ్

# గీతా సుధాలహరి

## పదునైదవ అధ్యాయము

### -: పురుషోత్తమప్రాప్తియోగము :-

**భగవానుఁడిట్లనియె:-**

ఊర్ధ్వమూల మధశ్శాఖ లొప్పుచుండు
అవ్యయమ్మగు [1]అశ్వత్థ మనెడు దాని
వేదములె పర్ణములుగాగ వెలయు దాని
నెఱుఁగు నాతఁడె వేదార్థ మెఱుఁగు వాఁడు. 1

త్రిగుణముల దీని శాఖలు వృద్ధి నొంది
[2]విషయపల్లవతతుల వ్యాపించియుండు
[3]క్రిందమీదను; కర్మానుబంధములగు
వేళ్ళు నరలోకమున క్రింద విస్తరించు. 2

క్షితిని దీని రూపంబును, స్థితియు మఱియు
ఆదియును అంత్యమును దెలియంగ రాదు;
కాన, సువిరూఢమూలమౌ దీని ఛేద
నమ్మొనర్చి అసంగశస్త్రమ్ముచేత; 3

పిదప దేనిఁబొంద పునరావృత్తి లేదో,
ఎవని వలన అనాదిప్రవృత్తి కలిగె,
అతని ఆద్యుని శరణంబు నందుచుంటి
నంచు ఫల్గునా! తత్పద మరయవలయు. 4

---

*1 అశ్వత్థమనెడు సంసారవృక్షము 2 విషయములు అను చిగుళ్ళచేత 3 స్థావరము మొదలుకొని బ్రహ్మపర్యంతము*

నిర్మానమోహా జితసంగదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః ।
ద్వంద్వైర్విముక్తాస్సుఖదుఃఖసంజ్ఞైః
గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్॥ ౫

న తద్భాసయతే సూర్యో
న శశాంకో న పావకః ।
యద్గత్వా న నివర్తంతే
తద్ధామ పరమం మమ ॥ ౬

మమైవాంశో జీవలోకే
జీవభూతస్సనాతనః ।
మనష్షష్ఠానీంద్రియాణి
ప్రకృతిస్థాని కర్షతి ॥ ౭

శరీరం యదవాప్నోతి
యచ్చాప్యుత్క్రామతీశ్వరః ।
గృహీత్వైతాని సంయాతి
వాయుర్గంధానివాశయాత్ ॥ ౮

శ్రోత్రం చక్షుః స్పర్శనం చ
రసనం ఘ్రాణమేవ చ ।
అధిష్ఠాయ మనశ్చాయం
విషయానుపసేవతే ॥ ౯

ఉత్క్రామంతం స్థితం వాపి
భుంజానం వా గుణాన్వితమ్ ।
విమూఢా నానుపశ్యంతి
పశ్యంతి జ్ఞానచక్షుషః ॥ ౧౦

మానమోహముల్ వీడి, కామముల గెల్చి,
వదలి సంగదోషముల, ద్వంద్వములఁబాసి,
విజయ! అధ్యాత్మనిత్యులై వెలయు జ్ఞాను
లవ్యయంబగు తత్పద మందఁ గలరు. 5

అర్జునా! దేని సూర్యచంద్రాగ్నులేని
చాలరో యించుకయు ప్రకాశమ్మొనర్ప.
దేనిఁబడసిన వారలు తిరిగి రారొ,
అదియె నాదు పరంధామ మగును సుమ్మ! 6

జీవలోకంబునందెల్ల జీవుఁడనఁగ
శాశ్వతంబై చెలఁగు మదంశంబె సుమ్మ!
సరవి ప్రకృతిస్థమై మనష్షష్ఠమైన
ఇంద్రియముల నాకర్షించి యీడ్చుచుండు. 7

ఈః శరీర మెపుడు ధరియించు జీవుఁ,
డెపుడు విడనాడి చను, అప్పుడెల్ల, ఇంద్రి
యముల గ్రహియించి యేగు, పుష్పములనుండి
గంధములఁ గైకొనుచు చను గాలివోలె. 8

చక్షువును, శ్రవణమ్మును, స్పర్శనమును
ఘ్రాణమును, రసనమ్మును, మానసమ్మ-
వీనినెల్ల నధిష్ఠించి. విజయ! జీవుఁ
డనుభవించుచుండును, విషయములనెల్ల. 9

తనువు నందున్న యపుడును చనెడు నపుడు
విషయసౌఖ్యమ్ముల ననుభవించు నపుడు
త్రిగుణయుతు జీవు నజ్ఞులు తెలియ లేరు
జ్ఞాననేత్రులె వానినిఁ గానఁ గలరు. 10

యతంతో యోగినశ్చైనం
పశ్యన్త్యాత్మన్యవస్థితమ్ ।
యతంతోఽప్యకృతాత్మానో
నైనం పశ్యన్త్యచేతసః ॥ ౧౧

యదాదిత్యగతం తేజో
జగద్భాసయతేఽఖిలమ్ ।
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ
తత్తేజో విద్ధి మామకమ్ ॥ ౧౨

గామావిశ్య చ భూతాని
ధారయామ్యహమోజసా ।
పుష్ణామిచౌషధీస్సర్వాః
సోమో భూత్వా రసాత్మకః ॥ ౧౩

అహం వైశ్వానరో భూత్వా
ప్రాణినాం దేహమాశ్రితః ।
ప్రాణాపానసమాయుక్తః
పచామ్యన్నం చతుర్విధమ్ ॥ ౧౪

సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతిర్జ్ఞానమపోహనం చ ।
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో
వేదాంతకృద్వేదవిదేవ చాహమ్ ॥ ౧౫

యత్నమొనరించు యోగు లీ యాత్మ నెప్పు
డాత్మ యందున్న దానిగా నరయుచుంద్రు
విజయ! [1]అకృతాత్ములగు అవివేకులెల్ల
ఎంత యత్నించినను వీని నెఱుఁగ లేరు. 11

సకలజగతి ప్రకాశమ్ము సలుపుచుండు
[2]జలజహితునందుఁ గల్గు తేజస్సుగాని
చంద్ర [3]పావకులందు తేజస్సు గాని
ఎఱుఁగుమర్జున! నాయదియే యటంచు. 12

ఉర్వి యందుండి ధరియించుచుందు నేన
సకలజీవుల మామకౌజస్సుచేత,
ఆ, రసాత్మకుఁడౌ చంద్రుఁడనగుచు నేన
పోషణమొనర్చుచుందు సర్వౌషధులను. 13

సతము నేను ప్రాణాపానయుతుఁడ నగుచు
అఖిలజీవుల దేహమ్ములాశ్రయించి,
[4]అగ్ని నై వారి చతుర్విధాహారములను
పచనమొనరించుచుందును పాండుపుత్ర! 14

అఖిలజీవుల హృదయమ్ములందునుందు
నా వలనఁ గల్గు [5]స్మృతియు, జ్ఞానం[6]బపోహ
నేనె వేదాంతకర్తను, నేనె నిఖిల
వేదవేద్యుఁడ ఆ వేదవిదుఁడ నేనె. 15

---

1 ఆత్మజ్ఞానహీనులు 2 సూర్యుడు 3 అగ్ని 4 వైశ్వానరాగ్ని లేక జఠరాగ్ని
5 జ్ఞాపకశక్తి 6 మఱపు.

ద్వావిమౌ పురుషౌ లోకే
క్షరశ్చాక్షర ఏవ చ ।
క్షరస్సర్వాణి భూతాని
కూటస్థోఽక్షర ఉచ్యతే ॥ ౧౬

ఉత్తమః పురుషస్త్వన్యః
పరమాత్మేత్యుదాహృతః ।
యో లోకత్రయమావిశ్య
బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥ ౧౭

యస్మాత్క్షరమతీతోఽహం
అక్షరాదపి చోత్తమః ।
అతోఽస్మి లోకే వేదే చ
ప్రథితః పురుషోత్తమః ॥ ౧౮

యో మామేవమసమ్మూఢో
జానాతి పురుషోత్తమమ్ ।
స సర్వవిద్భజతి మాం
సర్వభావేన భారత! ॥ ౧౯

ఇతి గుహ్యతమం శాస్త్రం
ఇదముక్తం మయాఽనఘ! ।
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్
కృతకృత్యశ్చ భారత! ॥ ౨౦

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే పురుషోత్తమప్రాప్తియోగోనామ పంచదశోఽధ్యాయః.

క్షరుఁడు అక్షరుండనఁగ ఓ సవ్యసాచి!
కలరు పురుషులిరువురు లోకమ్ములోన;
క్షరుఁడని పలింతురే భూతజాలములను,
అక్షరుండంద్రు కూటస్థుఁడైన వాని. 16

ఉత్తముఁడగు పురుషుఁడు వేఱొకఁడు గలఁడు,
అతనినే పార్థ! పరమాత్మయంద్రు బుధులు,
త్రిజగములనావహించి భరించు నతఁడు;
అతఁడె అవ్యయుం డీశ్వరుండనఁగ నొప్పు. 17

క్షరునికంటెను మఱియు అక్షరునికంటె
ఎంతయో అతీతుండనై యొసఁగు కతన,
అఖిలజగముల వేదములందు నేను
పార్థ! పురుషోత్తముఁడనంచు వాసిఁగంటి. 18

పుడమి నెవ్వఁడు న[1]స్సమ్మూఢుఁడగుచు
ఇటుల పురుషోత్తముఁడనంచు నెఱుఁగఁగలఁడొ
వాఁడు సర్వజ్ఞుఁడై [2]సర్వభావములను
నన్ను భజియించుచుండు అనారతమ్ము. 19

అర్జునా! పరమరహస్యమైన శాస్త్ర
మిద్ది, యిటుల నాచే వచియింపఁబడియె,
దీని నెవ్వఁడు చక్కఁగా తెలియు, అతఁడు
మహిని కృతకృత్యుఁడును బుద్ధిమంతుఁడగును. 20

ఇది ఉపనిషత్ప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రంబును,
శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీమద్భగవద్గీతలందు
పురుషోత్తమప్రాప్తియోగమను పదునైదవ అధ్యాయము

1 అజ్ఞానరహితుఁడు 2 సంపూర్ణమైన మనోభావముతో.



# శ్రీమద్భగవద్గీతా

## షోడశోఽధ్యాయః

### -: దైవాసురసంపద్విభాగయోగః :-

శ్రీభగవానువాచ:-

అభయం సత్త్వసంశుద్ధిః
జ్ఞానయోగవ్యవస్థితిః ।
దానం దమశ్చ యజ్ఞశ్చ
స్వాధ్యాయస్తపఆర్జవమ్ ॥ ౧

అహింసా సత్యమక్రోధః
త్యాగశ్శాన్తిరపైశునమ్ ।
దయాభూతేష్వలోలత్వం
మార్దవం హ్రీరచాపలమ్ ॥ ౨

తేజః క్షమాధృతిశ్శౌచం
అద్రోహో నాతిమానితా ।
భవన్తి సంపదం దైవీం
అభిజాతస్య భారత! ॥ ౩

దంభో దర్పోఽభిమానశ్చ
క్రోధః పారుష్యమేవ చ ।
అజ్ఞానం చాభిజాతస్య
పార్థ! సంపదమాసురీమ్ ॥ ౪

ఓమ్

# గీతాసుధాలహరి

## పదునాఱవ అధ్యాయము.

### -: దైవాసురసంపద్విభాగయోగము :-

భగవానుఁడిట్లనియె:-

[1]జ్ఞానయోగవ్యవస్థితి, [2]సత్త్వశుద్ధి,
నిర్భయమ్మును, ఇంద్రియనిగ్రహమ్ము,
యజ్ఞమును, తపోనిరతి, వేదాధ్యయనము,
దానపరతయు, ధర్మవర్తనము, మఱియు; 1

సత్యభాషణమును, అహింసయును, లజ్జ,
భూతదయయును, విషయవిముక్తుఁడగుట,
త్యాగ, మక్రోధమును, మృదుత్వమ్ము, మఱియు
శాంతియు, [3]అపైశునమ్ము, అచాపలమ్ము; 2

[4]క్షమయు, శౌచమ్ము, ధృతియు, తేజస్సు మఱియు
ద్రోహరాహిత్యమును, గర్వదూరతయును
అనెడు ఈ సుగుణములు సహజములగుచు
వెలయు దైవసంపద్విభూతులకునెల్ల. 3

[5]దంభ మజ్ఞాన [6]మభిమాన [7]దర్పములును
క్రోధ [8]పారుష్యములను ఈ గుణములెల్ల
అసురసంబంధసంపదనవతరించు
జనులకెల్ల సహజములు. సవ్యసాచి! 4

---

*1 జ్ఞానయోగమునందుండుట 2 అంతఃకరణశుద్ధి 3 కొండెములు చెప్పకుండుట 4 ఓర్పు (కష్టసహిష్ణుత) 5 కపటము 6 తాను గొప్పవాడనను దురహంకారము 7 గర్వము 8 కఠినస్వభావము.*

దైవీసంపద్విమోక్షాయ
నిబంధాయాసురీమతా ।
మాశుచస్సంపదం దైవీం
అభిజాతోఽసి పాండవ! ॥ ౫

ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్
దైవ ఆసుర ఏవ చ ।
దైవో విస్తరశః ప్రోక్తః
ఆసురం పార్థ! మే శృణు ॥ ౬

ప్రవృత్తిం చ నివృత్తిం చ
జనా న విదురాసురాః ।
న శౌచం నాపి చాఽఽచారో
న సత్యం తేషు విద్యతే ॥ ౭

అసత్యమప్రతిష్ఠం తే
జగదాహురనీశ్వరమ్ ।
అపరస్పరసంభూతం
కిమన్యత్కామహైతుకమ్ ॥ ౮

ఏతాం దృష్టిమవష్టభ్య
నష్టాత్మానోఽల్పబుద్ధయః ।
ప్రభవన్త్యుగ్రకర్మాణః
క్షయాయ జగతోఽహితాః ॥ ౯

దైవసంపద మోక్షపదమ్ముఁజేర్చు
అసురసంపద బంధమ్ములందుఁగూల్చు,
దేవతాంశమ్మునందు కౌంతేయ! నీవు
పుట్టినాఁడవు శోకమ్ము పొందవలదు. 5

ఆసురమ్మును దైవతమనగ పార్థ!
భూతసంసృష్టి ద్వివిధమై పొల్చు జగతి,
విస్తరించితి దైవతవిధము నీకు
ఇంక ఆసురమ్మును వచియింతు వినుము. 6

అసురభావంబుఁ గలిగినయట్టి మనుజు
లెఱుగ లేరు [1]ప్రవృత్తి, [2]నివృత్తిఁగాని,
సత్యమును, శౌచమును, సదాచారములును
పార్థ! యిసుమంతనుండవు వారియందు. 7

ఈ జగమ్మసత్యమ్ము, [3]అనీశ్వరమ్ము,
[4]అప్రతిష్ఠమ్ము, ఇది [5]కామహైతుకముగ
స్త్రీపురుషసంగమంబులచే జనించు
అన్యకారణంబింక లేదండ్రు వీరు. 8

ఇట్టి దుష్టభావము వహియించి వీర
లల్పబుద్ధులు నష్టాత్ములగుచు ఎపుడు
ఉగ్రకర్ములు అహితులై ఉద్భవమ్ము
నందుచుందురు లోకక్షయమ్ము కొఱకు. 9

---

1 ధర్మమార్గము లేక కర్మమార్గము 2 అధర్మనివృత్తి లేక జ్ఞానమార్గము 3 సృష్టికర్తయగు ఈశ్వరుడు లేడనుట 4 ధర్మప్రతిష్ఠలేనిదనుట 5 కామకారణముగ

కామమాశ్రిత్య దుష్పూరం
దంభమానమదాన్వితాః ।
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్
ప్రవర్తంతేఽశుచివ్రతాః ॥ ౧౦

చింతామపరిమేయాం చ
ప్రలయాంతాముపాశ్రితాః ।
కామోపభోగపరమా
ఏతావదితినిశ్చితాః ॥ ౧౧

ఆశాపాశశతైర్బద్ధాః
కామక్రోధపరాయణాః ।
ఈహంతే కామభోగార్థం
అన్యాయేనార్థసంచయాన్ ॥ ౧౨

ఇదమద్య మయా లబ్ధం
ఇమం ప్రాప్స్యే మనోరథమ్ ।
ఇదమస్తీదమపి మే
భవిష్యతి పునర్ధనమ్ ॥ ౧౩

అసౌ మయా హతశ్శత్రుః
హనిష్యే చాపరానపి ।
ఈశ్వరోఽహమహం భోగీ
సిద్ధోఽహం బలవాన్ సుఖీ ॥ ౧౪

ఆఢ్యోఽభిజనవానస్మి
కోఽన్యోఽస్తి సదృశో మయా ।
యక్ష్యే దాస్యామి మోదిష్య
ఇత్యజ్ఞానవిమోహితాః ॥ ౧౫

తనివిఁదీరని వాంఛల తగులమొంది
దంభమానమదాన్వితత్త్వ మలఁగుచు.
*మోహమున [1]అపరిగ్రహమ్ముల సతిము గ్ర
హించి అశుచివ్రతులయి వర్తించుచుంద్రు. 10

[2]అపరిమేయంబు ప్రళయాంతమైన చింత
నాశ్రయించుచు, విషయభోగాసురక్తు
లై, అదియె పరమార్థమటంచు నెంచి
సంచరించెదరాసురజన్ములకట! 11

వీరు బహువిధాశాపాశవివశులగుచు,
అర్జునా! క్రోధకామమ్ములందుఁజిక్కి
కామభోగనిమిత్తమై కడఁగి యెపుడు
అర్థమార్జింపఁదలఁతురన్యాయముగను. 12

“ఇప్పుడిద్ది నాచే గడియింపఁబడియె,
ఇంక నా మనోరథము ఈడేర్చుకొందు,
ఇంత సంపదగలదు నాకింకమీఁద
నింతధనము మఱల లభియింపఁగలదు. 13

శత్రువీతఁడు నాచేత చంపఁబడియె
సర్వశత్రుల నిట్టులే చంపఁగలను,
నేన సిద్ధుండ, భోగిని, ఈశ్వరుండ,
నేన కడుబలాఢ్యుండను, నేన సుఖిని. 14

అమితభాగ్యవంతుండ శ్రేష్ఠాన్వయుండ,
కలఁడె నాకు సముండు లోకమ్మునందు?
యజ్ఞమొనరింతు దానమ్ములాచరింతు”
నంచు అజ్ఞానమోహితులయి చరింత్రు. 15

---

*‘జగతిలో, మోహమున దురాచారములఁగ...

1 గ్రహింపరానివి (దురాచారములు) 2 అపరిమితము.

అనేకచిత్తవిభ్రాంతా
మోహజాలసమావృతాః ।
ప్రసక్తాః కామభోగేషు
పతంతి నరకేఽశుచౌ ॥ ౧౬

ఆత్మసంభావితాః స్తబ్ధా
ధనమానమదాన్వితాః ।
యజంతే నామయజ్ఞైస్తే
దంభేనావిధిపూర్వకమ్ ॥ ౧౭

అహంకారం బలం దర్పం
కామం క్రోధం చ సంశ్రితాః ।
మామాత్మపరదేహేషు
ప్రద్విషంతోఽభ్యసూయకాః ॥ ౧౮

తానహం ద్విషతః క్రూరాన్
సంసారేషు నరాధమాన్ ।
క్షిపామ్యజస్రమశుభాన్
ఆసురీష్వేవ యోనిషు ॥ ౧౯

ఆసురీం యోనిమాపన్నా
మూఢా జన్మని జన్మని ।
మామప్రాప్యైవ కౌంతేయ:
తతో యాంత్యధమాం గతిమ్ ॥ ౨౦

త్రివిధం నరకస్యేదం
ద్వారం నాశనమాత్మనః ।
కామః క్రోధస్తథాలోభః
తస్మాదేతత్త్రయం త్యజేత్ ॥ ౨౧

పలువిధంబుల చిత్తవిభ్రాంతినొంది
మోహజాలసమావృతమూఢులగుచు,
ప్రబల కామోపభోగాసక్తి వీరు
ఘోరనరకంబునంబడి కూలుచుంద్రు. 16

తమ్ముఁదామె పొగడుకొంచు, స్తబ్ధులగుచు,
అర్జునా! ధనమానమదాన్వితులయి,
దంభమునకయి విధివిరుద్ధమ్ముగాఁగ
నామమాత్రయజ్ఞంబులొనర్చుచుంద్రు. 17

బలము, కామమ్ము, క్రోధదర్పముల, మఱియు
కడు అహంకారమూనుచు కదగి వీరు
తమ తనువులందు ఇతరుల తనువులందు
వెలుఁగు నన్ను అసూయ ద్వేషించుచుంద్రు. 18

అట్లు ద్వేషించు క్రూరుల, అధములైన
యట్టి ఆ నరాధముల నిరంతరమ్ము
పట్టి ఆసుర యోనుల పాలవైతు
భయదసంసారజలధిలోపల మునుంగ. 19

అసురజన్మంబుఁ బడసినయట్టి వార
లన్వహంబును కడు విమూఢాత్ములగుచు,
నన్ను జన్మజన్మముల అందంగ లేక
అరుగుచుందురు క్రమముగా అధమగతికి. 20

పార్థ! కామమున్, క్రోధలోభములన, నర
కమునకు త్రివిధంబులగు ద్వారములుగలవు;
ఆత్మనాశనకారకంబైనయట్టి
వాని మూఁటిని వర్జింప వలయు విధిగ. 21

ఏతైర్విముక్తః కౌంతేయ!
తమోద్వారైస్త్రిభిర్నరః ।
ఆచరత్యాత్మనశ్శ్రేయః
తతో యాతి పరాంగతిమ్ ॥ ౨౨

యశ్శాస్త్రవిధిముత్సృజ్య
వర్తతే కామకారతః ।
న స సిద్ధిమవాప్నోతి
న సుఖం న పరాంగతిమ్ ॥ ౨౩

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే
కార్యాకార్యవ్యవస్థితౌ ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం
కర్మ కర్తుమిహార్హసి ॥ ౨౪

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే దైవాసురసంపద్విభాగయోగోనామ
షోడశోఽధ్యాయః

---

ఆరయఁ దమోద్వారంబులైన యిట్టి
మూఁటిచేత ఎవండు విముక్తిఁగనునొ,
ఆచరించుచు ఆత్మశ్రేయంబు నతఁడు
పరమగతినొందు పిమ్మట పాండుతనయ! 22

విడిచి యెవఁడు శాస్త్రోక్తమౌ విధులనెల్ల
ఇచ్ఛ వచ్చినయటు చరియించు, అతఁడు
కనఁడు సిద్ధిని, సుఖమును గాంచరేడు
పడయఁగా నేరఁడెన్నఁడు పరమపదము. 23

నీవు పార్థ! కార్యాకార్యనిర్ణయమున
శాస్త్రమే ప్రమాణంబగు జగతిలోన,
కాన, శాస్త్రవిధానోక్త కర్మమెఱిఁగి
ఆచరించుట కర్హుండ వగుదు వీవు. 24

ఇది ఉపనిషత్ప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రంబును,
శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీమద్భగవద్గీతలందు
దైవాసురసంపద్విభాగయోగమను పదునాఱవ అధ్యాయము

---



# శ్రీమద్భగవద్గీతా

## సప్తదశోఽధ్యాయః

### -: శ్రద్ధాత్రయవిభాగయోగః :-

అర్జున ఉవాచ:-

యే శాస్త్రవిధిముత్సృజ్య
యజంతే శ్రద్ధయాఽన్వితాః ।
తేషాం నిష్ఠా తు కా? కృష్ణ!
సత్త్వమాహోరజస్తమః॥ ౧

శ్రీభగవానువాచ :-

త్రివిధా భవతి శ్రద్ధా
దేహినాం సా స్వభావజా ।
సాత్త్వికీ రాజసీ చైవ
తామసీ చేతి తాం శృణు ॥ ౨

సత్త్వానురూపా సర్వస్య
శ్రద్ధా భవతి భారత! ।
శ్రద్ధామయోఽయం పురుషో
యో యచ్ఛ్రద్ధస్సఏవ సః ॥ ౩

యజంతే సాత్త్వికా దేవాన్
యక్షరక్షాంసి రాజసాః ।
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే
యజంతే తామసా జనాః ॥ ౪

అశాస్త్రవిహితం ఘోరం
తప్యంతే యే తపోజనాః ।
దంభాహంకారసంయుక్తాః
కామరాగబలాన్వితాః ॥ ౫

ఓమ్

# గీతా సుధాలహరి

## పదునేడవ అధ్యాయము

### -: శ్రద్ధాత్రయవిభాగయోగము :-

అర్జునుఁడిట్లనియె:-

[1]శాస్త్రవిధులను విడనాడి జగతి నెవరు
శ్రద్ధమీర సమర్చన సలుపుచుంద్రు,
వారిదౌనిష్ఠ యెట్టిదై వరలుచుండు
సాత్త్వికమ? రాజసమ? తామసంబ? కృష్ణ! 1

భగవానుఁడిట్లనియె:-

సకలజీవులకు స్వభావజనితమగుచు
శ్రద్ధ త్రివిధమై పరగును. సవ్యసాచి!
సాత్త్వికము రాజసము తామసమ్ము ననఁగ
వాని విధమింక వివరించువాఁడ వినుము. 2

ప్రాణికెల్ల[2] సత్త్వా[3]నురూపమయి శ్రద్ధ
తనరుచుండు, పురుషుఁడు శ్రద్ధామయుండు;
ఎవ్వరెట్టి శ్రద్ధను వహియించుచుంద్రు
వారి కట్టి స్వభావమే పరగుచుండు. 3

సాత్త్వికులు దేవతల పూజ సలుపుచుంద్రు
రాజసులు భజింతురు యక్షరాక్షసులను
మించి తామసజనము లర్చించుచుంద్రు
ప్రేతభూతగణాలముల పృథాతనూజ! 4

కడు నహంకారమున రాగకామదంభ
బలసమాన్వితులగుచు ఓ పాండుపుత్ర!
ధరణి శాస్త్రోక్తవిధివిరుద్ధమ్ముగాగ
మించి ఘోరతపము నాచరించెదరు: 5

---

*1 శాస్త్రప్రమాణములు 2 పూర్వజన్మసంస్కారము 3 సంస్కారయుక్తమైన అంతఃకరణమునకు అనుగుణమై*

కర్శయంతశ్శరీరస్థం
భూతగ్రామమచేతసః ।
మాంచైవాంతశ్శరీరస్థం
తాన్విద్ధ్యాసురనిశ్చయాన్ ॥ ౬

ఆహారస్త్వపి సర్వస్య
త్రివిధో భవతి ప్రియః ।
యజ్ఞస్తపస్తథా దానం
తేషాం భేదమిమం శృణు ॥ ౭

ఆయుస్సత్త్వబలారోగ్య
సుఖప్రీతివివర్ధనాః ।
రస్యాస్స్నిగ్ధాఃస్థిరాహృద్యా
ఆహారాస్సాత్త్వికప్రియాః ॥ ౮

కట్వామ్లలవణాత్యుష్ణ-
తీక్ష్ణరూక్షవిదాహినః ।
ఆహారారాజసస్యేష్టా
దుఃఖశోకామయప్రదాః ॥ ౯

యాతయామం గతరసం
పూతి పర్యుషితం చ యత్ ।
ఉచ్ఛిష్టమపి చామేధ్యం
భోజనం తామసప్రియమ్ ॥ ౧౦

అఫలాకాంక్షిభిర్యజ్ఞో
విధిదృష్టో య ఇజ్యతే ।
యష్టవ్యమేవేతి మనః
సమాధాయ స సాత్త్వికః ॥ ౧౧

నిజశరీరస్థితుండనై నెగడు నన్ను
నెల్ల భూతములను కృశింపఁజేతు
రట్టి బుద్ధివిహీనులౌ అఖిలజనుం
నరయు మాసురనిశ్చయులనుచు పార్థ! 6

అఖిలభూతతతులకు ఆహారములును
ప్రియములై తలిర్చును మూఁడు విధములుగను,
యజ్ఞదానతపంబులు నటులె యగును
వినుము! వివరించు వాఁడ తద్భేదములను. 7

ఆయురారోగ్యసత్త్వసౌఖ్యప్రదములు,
ప్రీతిబలవర్ధనమ్ములు హృద్యములును,
[1]స్నిగ్ధములు. రసయుతములు. [2]స్థిరములగు ప
దార్థములు సాత్త్వికప్రియపమ్ములగును. 8

కార, ముప్పు, పులుసు, చేదు, కరము వేడి
గలిగి [3]రూక్షమును విదాహకరములగుచు
శోకరోగదుఃఖంబుల కాకరమగు
భోజనంబులు ప్రియమగు రాజసులకు. 9

నిలువయున్నది, రసములేనిదియు, జాము
గడచినదియు, [4]ఉచ్ఛిష్టదుర్గంధమైన
యదియు, అపవిత్రమై ఒప్పునదియునెల్ల,
తామసజనంబులకు విహితంబులగును. 10

శాస్త్రసమ్మతమైన యజ్ఞమ్మొనర్ప
వలయు నంచును మనసు నిశ్చలముఁజేసి,
ఎట్టి ఫలమును గోరక యించుకేని,
సలుపఁబడుచుండు యజ్ఞంబు సాత్త్వికంబు. 11

1 చమురుగలిగినవి 2 చాలకాలముండునవి 3 ఎండినవి 4 ఎంగిలిచేసినవి.

అభిసంధాయ తు ఫలం
దంభార్థమపి చైవ యత్ ।
ఇజ్యతే భరతశ్రేష్ఠ!
తం యజ్ఞం విద్ధి రాజసమ్॥ ౧౨

విధిహీనమసృష్టాన్నం
మంత్రహీనమదక్షిణమ్ ।
శ్రద్ధావిరహితం యజ్ఞం
తామసం పరిచక్షతే ॥ ౧౩

దేవద్విజగురుప్రాజ్ఞ-
పూజనం శౌచమార్జవమ్ ।
బ్రహ్మచర్యమహింసా చ
శారీరం తప ఉచ్యతే ॥ ౧౪

అనుద్వేగకరం వాక్యం
సత్యం ప్రియహితం చ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ
వాఙ్మయం తప ఉచ్యతే ॥ ౧౫

మనఃప్రసాదస్సౌమ్యత్వం
మౌనమాత్మవినిగ్రహః ।
భావసంశుద్ధిరిత్యేతత్
తపోమానసముచ్యతే ॥ ౧౬

శ్రద్ధయా పరయా తప్తం
తపస్తత్త్రివిధం నరైః ।
అఫలాకాంక్షిభిర్యుక్తైః
సాత్త్వికం పరిచక్షతే॥ ౧౭

అర్జునా! ఫలమందఁగా ఆసఁజేసి
సలుపఁగాఁ బడుచుండు యజ్ఞంబు గాని,
డంబమునకయి సల్పు యజ్ఞంబు గాని
ఎఱుఁగుమీ రాజసంబని యెపుడు నీవు. 12

శాస్త్రసమ్మతియే లేని, శ్రద్ధ లేని
దక్షిణాదులు లేని, మంత్రంబు లేని
అన్నదానమఱయ ఇసుమంత లేని
యజ్ఞమే తామసంబని యందురు విజయ! 13

దేవగురుభూసురప్రాజ్ఞసేవనమ్ము
ధర్మవర్తనమ్మును, శుచిత్వమ్ము, మఱియు
బ్రహ్మచర్యంబహింసయు పాండుతనయ!
పరఁగుచుండు శారీరకతపంబటంచు. 14

పరుల మనసుల కలఁచని పలుకునట్టి
పరమసత్యహితప్రియభాషణంబు
సరిని వేదాభ్యసనమును జగతియందు
వాఙ్మయంబగు తపమని పలుకుచుంద్రు. 15

నిర్మలస్వాంతమును, ఆత్మవినిగ్రహమ్ము,
భావసంశుద్ధి, సౌమ్యప్రవర్తనమ్ము,
మౌనమూనుట అనునివి మహితలమున
మానసిక తపంబని వచింపఁగఁబడును. 16

సతము అత్యుత్తమంబగు శ్రద్ధతోడ
ఫలమునందలి కాంక్షను వదలి, యోగు
లాచరించు నీ త్రివిధమైనట్టి తపము
సాత్త్వికతపంబటందురు, సవ్యసాచి! 17

సత్కారమానపూజార్థం
తపోదంభేనచైవ యత్ ।
క్రియతే తదిహ ప్రోక్తం
రాజసం చలమధ్రువమ్ ॥ ౧౮

మూఢగ్రాహేణాత్మనో యత్
పీడయా క్రియతే తపః ।
పరస్యోత్సాదనార్థం వా
తత్తామసముదాహృతమ్ ॥ ౧౯

దాతవ్యమితి యద్దానం
దీయతేఽనుపకారిణే ।
దేశే కాలే చ పాత్రే చ
తద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥ ౨౦

యత్తు ప్రత్యుపకారార్థం
ఫలముద్దిశ్య వా పునః ।
దీయతే చ పరిక్లిష్టం
తద్దానం రాజసం స్మృతమ్॥ ౨౧

అదేశకాలే యద్దానం
అపాత్రేభ్యశ్చ దీయతే ।
అసత్కృతమవజ్ఞాతం
తత్తామసముదాహృతమ్ ॥ ౨౨

ఓం తత్సదితి నిర్దేశో
బ్రహ్మణస్త్రివిధః స్మృతః ।
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ
యజ్ఞాశ్చ విహితాః పురా॥ ౨౩

గౌరవార్చన సత్కారకాంక్ష నెపుడు
డంబమునఁజేయుచుండు తపంబదెల్ల
జగతిలో అస్థిరమును, చంచలమునగాన
ఫల్గునా! రాజసంబని పలుకఁబడును. 18

గట్టిగా విడువక మొండిపట్టుబట్టి
ఆత్మ హింసించి కావించునట్టి తపము,
అన్యులకు హానిఁగలిగింప ఆచరించు
నట్టి తపమును తామసంబండ్రు పార్థ! 19

దేశకాలపాత్రంబులఁ దెలిసి, యెట్టి
ప్రత్యుపకృతి సలుప లేని వారికెల్ల
ఈయఁదగునని యే దాన మీయఁబడునో
దాని సాత్త్వికంబంచును దలఁపవలయు. 20

ధరణి, ప్రత్యుపకారమ్ము గోరుచుఁగాని,
ఫలమునందలి కోరికవలనఁ గాని,
అర్జునా! క్లిష్టతమముగ నాచరించు
దానమది రాజసంబని తలపఁబడును. 21

దేశకాలపరిస్థితిఁ దెలిసికొనక
ఫల్గునా! అపాత్రులయిన వారి కొసఁగు
గౌరవములేని, అవమానకరమునైన
యట్టి దానమ్ము తామసంబనఁ దెలియు. 22

అవనియందు "ఓం తత్ సత్" టంచు పార్థ!
త్రివిధములుగ బ్రహ్మంబు నిర్దేశమయ్యె:
దానిచే *బ్రాహ్మణులును, వేదములు, ఎల్ల
యజ్ఞములు నిర్మితములయ్యె ఆదియందు. 23

* బ్రహ్మణులను (బ్రహ్మజ్ఞానులు)

తస్మాదోమిత్యుదాహృత్య
యజ్ఞదానతపఃక్రియాః ।
ప్రవర్తంతే విధానోక్తాః
సతతం బ్రహ్మవాదినామ్ ॥ ౨౪

తదిత్యనభిసంధాయ
ఫలం యజ్ఞతపఃక్రియాః ।
దానక్రియాశ్చ వివిధాః
క్రియంతే మోక్షకాంక్షిభిః ॥ ౨౫

సద్భావే సాధుభావే చ
సదిత్యేతత్ప్రయుజ్యతే ।
ప్రశస్తే కర్మణి తథా
సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే ॥ ౨౬

యజ్ఞే తపసి దానే చ
స్థితిస్సదితి చోచ్యతే ।
కర్మచైవ తదర్థీయం
సదిత్యేవాభిధీయతే ॥ ౨౭

అశ్రద్ధయా హుతం దత్తం
తపస్తప్తం కృతం చ యత్ ।
అసదిత్యుచ్యతే పార్థ!
న చ తత్ప్రేత్య నో ఇహ ॥ ౨౮

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే శ్రద్ధాత్రయవిభాగయోగో నామ
సప్తదశోఽధ్యాయః

అందువలన శాస్త్రోక్తమ్ములైనయట్టి
యజ్ఞదానతపఃక్రియలాచరింపఁ
గడఁగు తఱి తొలుదొల్త "ఓం"కారముచ్చ
రించి [1]బ్రహ్మవాదు లుపక్రమించుచుంద్రు. 24

మోక్షకాములు "తత్త"ని మొదటఁ బలికి
ఫలముపై నించుకంతయు వాంఛలేక
వివిధయజ్ఞతపోదానవిహితవిధుల
సలుపుచుందురు నిత్యమ్ము, సవ్యసాచి! 25

పరగ [2]సద్భావమున [3]సాధుభావమునను
వాడుచుందురు "సత్త"ను పదము నెపుడు.
అట్లులె ప్రశస్తకర్మంబులందుఁగూడ
వాడఁబడుచుండు నిట్టి శబ్దంబె పార్థ! 26

*దానమందు, యజ్ఞమునందు, తపమునందు
[4]స్థితియు "సత్త"ని పార్థ! వచింపఁబడును;
అట్లె [5]భగవదర్థీయమైనట్టి కర్మ
మెల్ల "సత్త"నియే వచియింపఁబడును. 27

శ్రద్ధ ఆవంతలేకుండ సలుపఁబడిన
తపము, దానయజ్ఞములు, [6]కృతంబదెల్ల
ఫల్గునా! "అసత్త"నుచుఁ జెప్పంగఁబడును
దాన ఇహపరమ్ముల ఫలితమ్ము లేదు. 28

ఇది ఉపనిషత్ప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రంబును,
శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీమద్భగవద్గీతలందు
శ్రద్ధాత్రయవిభాగయోగమను పదునేడవ అధ్యాయము

1 వేదములను చక్కగా నెఱిఁగినవాడు 2 కలదు లేక 'సత్' అను అర్థమున
3 మంచిదను అర్థమున *యజ్ఞదానతపంబులయందు గల్గు......స్థితియు
4 నిష్ఠ లేక ఉనికి 5 భగవత్ప్రీత్యర్థమైన 6 చేయబడు సత్కర్మలు.



# శ్రీమద్భగవద్గీతా

## అష్టాదశోఽధ్యాయః

### -: మోక్షసన్న్యాసయోగః :-

అర్జున ఉవాచ:-

సన్న్యాసస్య మహాబాహో!
తత్త్వమిచ్ఛామి వేదితుమ్ ।
త్యాగస్య చ హృషీకేశ!
పృథక్కేశినిషూదన! ౧

శ్రీభగవానువాచ:-

కామ్యానాం కర్మణాం న్యాసం
సన్న్యాసం కవయో విదుః ।
సర్వకర్మఫలత్యాగం
ప్రాహుస్త్యాగం విచక్షణాః ॥ ౨

త్యాజ్యం దోషవదిత్యేకే
కర్మ ప్రాహుర్మనీషిణః ।
యజ్ఞదానతపఃకర్మ
న త్యాజ్యమితి చాపరే ॥ ౩

నిశ్చయం శృణు మే తత్ర
త్యాగే భరతసత్తమ! ।
త్యాగో హి పురుషవ్యాఘ్ర!
త్రివిధః సంప్రకీర్తితః ॥ ౪

యజ్ఞదానతపఃకర్మ
న త్యాజం కార్యమేవ తత్ ।
యజ్ఞో దానం తపశ్చైవ
పావనాని మనీషిణామ్ ॥ ౫

ఓమ్

# గీతా సుధా లహరి

## పదునెనిమిదవ అధ్యాయము

### -: మోక్షసన్న్యాసయోగము :-

అర్జునుఁడిట్లనియె:-

కేశిదైత్యాంతకా! హృషీకేశ! కృష్ణ!
త్యాగసన్న్యాసవిషయతత్త్వంబులెల్ల
నేను వేర్వేఱ నెఱుఁగంగ నిచ్చగింతు
వాని వివరింపు నాకు మహానుభావ! 1

భగవానుఁడిట్లనియె:-

కామ్యకర్మమ్ములెల్ల త్యాగమ్మొనర్చ
నదియె సన్న్యాసమందు పల్కుదురు కవులు:
సకల కర్మముల ఫల విసర్జనంబె
త్యాగమందురు విచక్షణులైన వారు. 2

కర్మములవెల్ల దోషయుక్తములు కాన
పండితుల్ కొందఱు త్యజింపవలయునందురు
కాని, దానతపోయజ్ఞకర్మములను
విడువ రాదని కొందఱు నుడువుచుందురు. 3

త్యాగవిషయమ్మునన్ పురుషాగ్రగణ్య!
నీకు తెల్పెద వినుము! నా నిశ్చయమ్ము;
త్యాగమనునది మూఁడు విధములుగను
పలుకఁ బడియెను భారతవంశదీప! 4

యజ్ఞమును, దానమును, తపంబనెడి కర్మ
ములను వీడరాదవి చేయ వలసినవియె.
యజ్ఞదానతపంబులు, ప్రాజ్ఞులకును
పరమపావనంబులగును భవ్యచరిత! 5

ఏతాన్యపి తు కర్మాణి
సంగం త్యక్త్వా ఫలాని చ ।
కర్తవ్యానీతి మే పార్థ!
నిశ్చితం మతముత్తమమ్ ॥ ౬

నియతస్య తు సన్న్యాసః
కర్మణో నోపపద్యతే ।
మోహాత్తస్య పరిత్యాగః
తామసః పరికీర్తితః ॥ ౭

దుఃఖమిత్యేవ యత్కర్మ
కాయక్లేశభయాత్త్యజేత్ ।
స కృత్వా రాజసం త్యాగం
నైవ త్యాగఫలం లభేత్ ॥ ౮

కార్యమిత్యేవ యత్కర్మ
నియతం క్రియతేఽర్జున! ।
సంగం త్యక్త్వా ఫలం చైవ
స త్యాగస్సాత్త్వికో మతః ॥ ౯

న ద్వేష్ట్యకుశలం కర్మ
కుశలే నానుషజ్జతే ।
త్యాగీ సత్త్వసమావిష్టో
మేధావీ ఛిన్నసంశయః ౧౦

ఇట్టి కర్మంబులైనను ఎపుడుఁగాని
సంగఫలముల వర్జించి, సవ్యసాచి!
ఆచరింపంగ తగినట్టివయ్య! యిదియె
శ్రేష్ఠమైనట్టి నా వినిశ్చితమతమ్ము. 6

కనుక [1]నియతమైనట్టి కర్మమును నెప్పుడు
తాము త్యజియింపరాదు నెంతయును పార్థ!
వీని [2]మోహవశంబున విడిచెనేని
అట్టి త్యాగంబు తామసంబనఁ దెలియుము. 7

కరము దుఃఖకరంబని కర్మమెవఁడు
విడిచిపుచ్చు [3]కాయక్లేశభీతి చేత
అతఁడు రాజసత్యాగమ్ము నాచరించు
వాఁడగుట త్యాగఫలమును బడయలేఁడు. 8

సలుపఁ దగినవియే యంచు సవ్యసాచి!
మహిని, నియతమైనట్టి కర్మమ్ములెల్ల
ఫలము, సంగమ్ము విడిచి సల్పంగఁబడిన
త్యాగమయ్యది సాత్త్వికత్యాగమండ్రు. 9

సంశయము లేనివాఁడును, సాత్త్వికుండు,
అధికమేధావియును త్యాగియైనవాఁడు,
అశుభకర్మమ్మునను ద్వేషమందఁబోఁడు
పొందఁడాసక్తి శుభకర్మమందునేని. 10

---

1 శ్రుతిస్మృతివిహితమగు సంధ్యోపాసన, అగ్నిహోత్రాదికర్మములు లేక శాస్త్రవిధానముగ ప్రాప్తమైనకర్మము 2 అజ్ఞానముచే 3 శరీరాయాసభయమువలన.

న హి దేహభృతా శక్యం
త్యక్తుం కర్మాణ్యశేషతః ।
యస్తు కర్మఫలత్యాగీ
స త్యాగీత్యభిధీయతే ॥ ౧౧

అనిష్టమిష్టం మిశ్రం చ
త్రివిధం కర్మణః ఫలమ్ ।
భవత్యత్యాగినాం ప్రేత్య
న తు సన్న్యాసినాం క్వచిత్ ॥ ౧౨

పంచైతాని మహాబాహో
కారణాని నిబోధ మే ।
సాంఖ్యే కృతాన్తే ప్రోక్తాని
సిద్ధయే సర్వకర్మణామ్ ॥ ౧౩

అధిష్ఠానం తథా కర్తా
కరణం చ పృథగ్విధమ్ ।
వివిధాశ్చ పృథక్చేష్టా
దైవం చైవాత్ర పంచమమ్ ॥ ౧౪

శరీరవాఙ్మనోభిర్యత్
కర్మ ప్రారభతే నరః ।
న్యాయ్యం వా విపరీతం వా
పంచైతే తస్య హేతవః ॥ ౧౫

తత్రైవం సతి కర్తారం
ఆత్మానం కేవలం తు యః ।
పశ్యత్యకృతబుద్ధిత్వాత్
న స పశ్యతి దుర్మతిః ॥ ౧౬

సాంగముగ, దేహధారి కీ అవనిలోన
కర్మముల త్యజింపంగ శక్యంబుగాదు,
కాన, కర్మఫలత్యాగియైన వాఁడె
కవ్వడీ! త్యాగియని పలుకంగఁబడును. 11

[1]ప్రియము అప్రియమును మిశ్రమయినయట్టి
త్రివిధకర్మఫలములు సంభవములగును
త్యాగరహితులకెల్ల జన్మాంతరమున;
త్యాగి కెన్నఁడు అవ్వి ప్రాప్తములుగావు. 12

సాంఖ్యసిద్ధాంతమందు ఈ సర్వకర్మ
సిద్ధికై ఫల్గునా! నిర్వచింపఁబడిన
ఈ అయిదు కారణములను ఎఱుఁగు మీవు
తెలియఁజెప్పెద నేనింక తెల్లముగను. 13

అర్జునా! ఈ అధిష్ఠాన మనెడు తనువు,
కర్తయును, వివిధంబులౌ [2]కరణములును,
అఖిల[3]చేష్టలు, దైవంబు ననఁగ నివియె
కర్మసంసిద్ధి కగు పంచకారణములు. 14

తనువుచే, వాక్కుచేతను, మనసు చేత
న్యాయమగుగాక అన్యాయమగునుగాక
మనుజుఁడొనరింపఁగడఁగు కర్మములకెల్ల
అర్జునా! కారణంబు లీ యైదె సుమ్మ! 15

ఈ విషయమందు యాదార్థ్యమిట్టులుండ
ఎవఁడు బుద్ధిసంస్కారవిహీనుఁడగుట
తన్ను తానె కేవలము కర్తగఁ దలంచు,
అట్టి దుర్మతి సత్యమ్ము నరయ వేడు. 16

---

[1] ఇష్టమైనది, అనిష్టమైనది, ఇష్టానిష్టమైనది [2] ఇంద్రియములు [3] క్రియలు.

యస్య నాహంకృతో భావో
బుద్ధిర్యస్య న లిప్యతే ।
హత్వాపి స ఇమాన్ లోకాన్
న హన్తి న నిబధ్యతే ॥ ౧౭

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా
త్రివిధా కర్మచోదనా ।
కరణం కర్మ కర్తేతి
త్రివిధః కర్మసంగ్రహః ॥ ౧౮

జ్ఞానం కర్మ చ కర్తా చ
త్రిధైవ గుణభేదతః ।
ప్రోచ్యతే గుణసంఖ్యానే
యథావచ్ఛృణు తాన్యపి ॥ ౧౯

సర్వభూతేషు యేనైకం
భావమవ్యయమీక్షతే ।
అవిభక్తం విభక్తేషు
తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥ ౨౦

పృథక్త్వేన తు యద్జ్ఞానం
నానాభావాన్ పృథగ్విధాన్ ।
వేత్తి సర్వేషు భూతేషు
తద్జ్ఞానం విద్ధి రాజసమ్ ॥ ౨౧

యత్తు కృత్స్నవదేకస్మిన్
కార్యే సక్తమహైతుకమ్ ।
అతత్త్వార్థవదల్పం చ
తత్తామసముదాహృతమ్ ॥ ౨౨

ఎవఁడహంకృతి నిసుమంత నెనయకుండు,
ఎవని బుద్ధి [1]లిప్తంబుగా దించుకేని,
అతఁడీలోకులను చంపు నాతఁడయ్యు,
కాడు హంతయుఁ, బద్ధుండుఁగాడు వాఁడు. 17

జ్ఞానమును, [2]జ్ఞేయమును, [3]పరిజ్ఞాత యనఁగ
[4]కర్మచోదనము త్రివిధగతులఁ దనరు,
[5]కరణమును, కర్మమును, మఱి కర్త యనఁగ
[6]కర్మ సంగ్రహమును మూఁడు గతులనొప్పు. 18

జ్ఞానమును, మఱి కర్తయు కర్మములును
గుణవిభేదముఁబట్టి పేర్కొనఁబడియె.
అర్జునా! [7]గుణసంఖ్యానమందు. మూఁడు
విధముల, యథాక్రమముగను వీని వినుము! 19

వేఱువేఱగు నీ భూతవితతియందు
అవ్యయంబు [8]అఖండంబునైన ఒక్క
ఆత్మభావంబె కలదని అరయునట్టి
జ్ఞానమునె తెలిసికొనుమీ సాత్త్వికముగ. 20

సకలభూతంబులందు ఓసవ్యసాచి!
పలువిధములగుచును, భిన్నభావములను
గలుగు వాని వేర్వేఱుగాఁ గాంచునట్టి
జ్ఞానము నెఱుంగుమా రాజసంబటంచు 21

అర్జునా! ఒకవి నొక్క కార్యంబునందె
సకలమున్నదటంచు ఆసక్తిఁబఱపు
అల్పము [9]అహైతుకము [10]అతత్త్వార్థమైన
యట్టి జ్ఞానమే తామసంబండ్రు బుధులు. 22

1 విషయములయందు తగులమునొందని 2 తెలియదగినది 3 తెలిసికొనువాఁడు
4 కర్మప్రవృత్తి లేక కర్మకారణము 5 సాధనము 6 కర్మమున కాధారము
7 కపిలకృత సాంఖ్యయోగశాస్త్రమునందు 8 విభజింపబడని 9 కారణములేని
10 తత్త్వమును అనగా సత్యమును తెలియజాలని.

నియతం సంగరహితం
అరాగద్వేషతః కృతమ్ ।
అఫలప్రేప్సునా కర్మ
యత్తత్సాత్త్వికముచ్యతే ॥ ౨౩

యత్తు కామేప్సునా కర్మ
సాహంకారేణ వా పునః ।
క్రియతే బహులాయాసం
తద్రాజసముదాహృతమ్ ॥ ౨౪

అనుబంధం క్షయం హింసాం
అనపేక్ష్య చ పౌరుషమ్ ।
మోహాదారభ్యతే కర్మ
యత్తత్తామసముచ్యతే ॥ ౨౫

ముక్తసంగోఽనహంవాదీ
ధృత్యుత్సాహసమన్వితః ।
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః
కర్తా సాత్త్విక ఉచ్యతే ॥ ౨౬

రాగి కర్మఫలప్రేప్సుః
లుబ్ధో హింసాత్మకోఽశుచిః ।
హర్షశోకాన్వితః కర్తా
రాజసః పరికీర్తితః ॥ ౨౭

అయుక్తః ప్రాకృతః స్తబ్ధః
శఠో నైష్కృతికోఽలసః ।
విషాదీ దీర్ఘసూత్రీ చ
కర్తా తామస ఉచ్యతే ॥ ౨౮

ఫలముపై వాంఛ లేనట్టి వానిచేత
లేశమును ద్వేషరాగముల్ లేక, సంగ
వర్జితంబుగ సలుపంగఁబడెడు నియత
కర్మమునె వచింతురు సాత్త్వికమ్మటంచు. 23

కర్మఫలకామిచేతనుగాని, మఱియు
అత్యహంకారయుతునిచేనైనఁగాని
అతితరప్రయాసమున చేయఁబడినట్టి
కర్మమే రాజసమని పల్కఁగనగును. 24

[1]కార్యపర్యవసానముఁ నష్టకష్ట
ములను, తనదు సామర్థ్యంబుఁ దెలియకుండ.
అజ్ఞతను సల్పఁగాఁబడునట్టి కర్మ
మర్జునా! తామసంబని యంద్రు బుధులు. 25

పార్థ! నిస్సంగుఁ డభిమానవర్జితుండు,
ధైర్యశాలియు, సమధికోత్సాహయుతుఁడు,
సిద్ధ్యసిద్ధుల యెడ సమస్థితి వహించు
వాఁడె, సాత్త్వికకర్తగాఁ బలుకఁబడును. 26

రాగియును, కర్మఫలకాముఁడగుచుండు,
అమితలుబ్ధుండు, మఱియు హింసాత్మకుండు,
హర్షశోకాన్వితుండును, అశుచియైన
వాఁడె, రాజసకర్తగాఁ బలుకఁబడును. 27

పామరుఁడు, నిందకుండును, వంచకుండు,
శఠుడు, సోమరి, దీనుండు, చంచలుండు,
కాలయాపనమొనరింపఁగలుగునట్టి
వాఁడు, తామసకర్తగాఁ బలుకఁబడును. 28

1 కార్యమునందు మున్ముందుగలుగు ఫలితము.

బుద్ధేర్భేదం ధృతేశ్చైవ
గుణతస్త్రివిధం శృణు ।
ప్రోచ్యమానమశేషేణ
పృథక్త్వేన ధనంజయ! ॥ ౨౯

ప్రవృత్తిం చ నివృత్తిం చ
కార్యాకార్యే భయాభయే ।
బంధం మోక్షం చ యా వేత్తి
బుద్ధిస్సాపార్థ! సాత్త్వికీ ॥ ౩౦

యయా ధర్మమధర్మం చ
కార్యం చాకార్యమేవ చ ।
అయథావత్ప్రజానాతి
బుద్ధిస్సాపార్థ! రాజసీ ॥ ౩౧

అధర్మం ధర్మమితి యా
మన్యతే తమసాఽవృతా ।
సర్వార్థాన్ విపరీతాంశ్చ
బుద్ధిస్సాపార్థ! తామసీ ॥ ౩౨

ధృత్యా యయా ధారయతే
మనఃప్రాణేంద్రియక్రియాః ।
యోగేనావ్యభిచారిణ్యా
ధృతిస్సాపార్థ! సాత్త్వికీ ॥ ౩౩

యయా తు ధర్మకామార్థాన్
ధృత్యా ధారయతేఽర్జున! ।
ప్రసంగేన ఫలాకాంక్షీ
ధృతిస్సాపార్థ! రాజసీ ॥ ౩౪

బుద్ధిభేదముల్ ధృతిభేదములును గూడ
త్రిగుణములఁబట్టి జగతిలో త్రివిధములుగఁ
జెప్పఁగాఁబడె; వాని నిశ్శేషముగను
వేఱువేఱుగ వివరింతు వినుము నీవు. 29

ఇది [1]ప్రవృత్తియు, మఱియు [2]నివృత్తియిద్ది,
కార్యమియ్యది, మఱియు నకార్యమిద్ది,
బంధమిది, మోక్షమిది, భయాభయములివ్వి
యని తెలియు బుద్ధి సాత్త్వికంబనఁగఁబరగు. 30

ధర్మమనఁగను నెదియొ, అధర్మమెదియొ,
కార్యమనగను నెదియొ, అకార్యమెదియొ,
ఇంచుకయు, యథార్థముగ గ్రహింపలేని
బుద్ధియే రాజసంబగు బుద్ధి పార్థ! 31

తమముచే ఆవృతంబయి ధాత్రిలోన
ధర్మముఁగాని దంతయు ధర్మమనుచు,
సర్వవిషయముల్ విపరీతసరణినెంచు
నట్టి బుద్ధియే తామసంబంద్రు విజయ! 32

కవ్వడీ! నిశ్చలమగు యోగమ్ముచేత
ప్రాణచిత్తేంద్రియాదికార్యములనెల్ల,
మించి యేధృతి తా నియమించుచుండు
ఆ ధృతియె పార్థ! సాత్త్వికంబనఁ దలిర్చు. 33

అధికసంగంబు వలన, ఫలానురక్తి,
ధర్మకామార్థములను పృథాకుమార!
ఎట్టి ధృతి తా సతతము ధరియించుచుండు
అట్టి ధృతియె రాజసధృతి యని తలంపు. 34

1 కర్మమార్గము 2 జ్ఞానమార్గము.

యయా స్వప్నం భయం శోకం
విషాదం మదమేవ చ ।
న విముంచతి దుర్మేధా
ధృతిస్సాపార్థ! తామసీ ॥ ౩౫

సుఖం త్విదానీం త్రివిధం
శృణు మే భరతర్షభ! ।
అభ్యాసాద్రమతే యత్ర
దుఃఖాంతం చ నిగచ్ఛతి ॥ ౩౬

యత్తదగ్రే విషమివ
పరిణామేఽమృతోపమమ్ ।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తం
ఆత్మబుద్ధిప్రసాదజమ్ ॥ ౩౭

విషయేంద్రియసంయోగాత్
యత్తదగ్రేఽమృతోపమమ్।
పరిణామే విషమివ
తత్సుఖం రాజసం స్మృతమ్ ॥ ౩౮

యదగ్రేచానుబంధే చ
సుఖం మోహనమాత్మనః ।
నిద్రాలస్యప్రమాదోత్థం
తత్తామసముదాహృతమ్ ॥ ౩౯

న తదస్తి పృథివ్యాం వా
దివి దేవేషు వా పునః ।
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం
యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః ॥ ౪౦

ఎట్టి ధృతిచేత బుద్ధివిహీనుఁడగుచు
స్వప్నశోకభయమదవిషాదములను
విడువఁ జాలక నిల్పునో, విజయ! మనుజుఁ,
డట్టి ఆ ధృతి తామసంబని యెఱుంగు. 35

ఎందు అభ్యాసమున [1]రమియించుచుండ
అఖిలదుఃఖవితతి నాశమగునొ, అట్టి
త్రివిధములగు సుఖంబుల తెల్లముగను
అర్జునా! నీకు వివరింతు నాలకింపు. 36

ఏ సుఖము తొలుత విషమై యెసఁగి, తుదకు
నదియె అమృతసమానమై అలరుచుండు,
[2]ఆత్మబుద్ధిప్రసాదజన్యంబునైన
అట్టి సుఖమునె సాత్త్వికంబండ్రు పార్థ! 37

ఇంద్రియవిషయ [3]కలితమై యే సుఖంబు
మొదట అమృతోపమానమై పిదప నెపుడు
విషముతోడ తుల్యంబయి వెలయుచుండు
ఆ సుఖంబునె రాజసంబందు రయ్య! 38

ఆదియందేని మఱియు అంత్యముననేని
ఆత్మమోహనకారకంబై చెలంగి
అధికనిద్రాప్రమాదమాంద్యములవలన
సంభవించు సుఖమె తామసమ్ము పార్థ! 39

దివిని, దేవతలనుగాని, భువినిఁగాని
ప్రకృతి సంభవంబులగుచుఁ బరగు, ఇట్టి
మూఁడు గుణములచేత విముక్తిఁగనిన
ప్రాణియే లేదు, పాండుభూపాలతనయ! 40

1 క్రీడించుట 2 తనబుద్ధినైర్మల్యమునకలిగినది 3 కూడికతో.

బ్రాహ్మణక్షత్రియవిశాం
శూద్రాణాం చ పరంతప! ।
కర్మాణి ప్రవిభక్తాని
స్వభావప్రభవైర్గుణైః ॥ ౪౧

శమో దమ స్తపశ్శౌచం
క్షాంతిరార్జవమేవ చ ।
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం
బ్రాహ్మం కర్మస్వభావజమ్ ॥ ౪౨

శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం
యుద్ధే చాప్యపలాయనమ్ ।
దానమీశ్వరభావశ్చ
క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥ ౪౩

కృషిగోరక్షవాణిజ్యం
వైశ్యం కర్మ స్వభావజమ్ ।
పరిచర్యాత్మకం కర్మ
శూద్రస్యాపి స్వభావజమ్ ॥ ౪౪

స్వే స్వే కర్మణ్యభిరతః
సంసిద్ధిం లభతే నరః ।
స్వకర్మనిరతస్సిద్ధిం
యథా విందతి తచ్ఛృణు ॥ ౪౫

యతః ప్రవృత్తిర్భూతానాం
యేన సర్వమిదం తతమ్ ।
స్వకర్మణా తమభ్యర్చ్య
సిద్ధిం విందతి మానవః ॥ ౪౬

బ్రాహ్మణులకు, క్షత్రియులకు, వైశ్యులకును
మఱియు శూద్రజాతికిని కర్మంబులెల్ల
వారి వారి స్వభావసంభవములైన
గుణములను బట్టియే విభజనమునొందె. 41

[1]శమము, [2]దమమును, తపము, శౌచమ్ము, [3]క్షాంతి,
ఆస్తికతయును, మఱియును ఆర్జవమ్ము,
[4]జ్ఞానవిజ్ఞానము లను, ఈ కర్మలెల్ల
భూసురులకు స్వభావజంబులు కిరీటి! 42

ధైర్యశౌర్యముల్, తేజస్సు, దక్షతయును,
భండనంబున వెనుజూపి పాఱకుంట,
దాన, [5]మీశ్వరభావంబు, ధరణిలోన
క్షత్రియస్వభావజనిత కర్మములగు. 43

వర్తకవ్యవసాయగోపాలనములు
సహజకర్మంబులగు వైశ్యజాతికెల్ల;
మహిని పరిచర్యరూపకర్మంబు లెల్ల
ఫల్గునా! శూద్రజాతిస్వభావజంబు. 44

మానవుడు వాని వాని కర్మమ్ము పట్ల
[6]అభిరతుండయి సంసిద్ధి నందుచుండు;
స్వీయకర్మాభినిరతుడై వెలుగు నరుడు
సిద్ధిగాంచు విధంబును చెప్పెద వినుము. 45

ఎవనిచేత ఈ భూత[7]ప్రవృత్తిగలుగు,
అఖిల మెవ్వనిచే పరివ్యాప్తమగునో,
మనుజుడాతని స్వీయకర్మంబుచేత
అర్చనమొనర్చి సంసిద్ధి నందుచుండు. 46

1 అంతరింద్రియ(మనో)నిగ్రహము 2 బాహ్యేంద్రియనిగ్రహము 3 ఓర్పు
4 శాస్త్ర, అనుభవజ్ఞానములు 5 సత్పరిపాలనము 6 శ్రద్ధగలవాడై 7 పుట్టుక
మొదలగు వ్యాపారము

శ్రేయాన్ స్వధర్మో విగుణః
పరధర్మాత్ స్వనుష్ఠితాత్ ।
స్వభావనియతం కర్మ
కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ ౪౭

సహజం కర్మ కౌంతేయ!
సదోషమపి న త్యజేత్ ।
సర్వారంభా హి దోషేణ
ధూమేనాగ్నిరివాఽవృతాః ॥ ౪౮

అసక్తబుద్ధిస్సర్వత్ర
జితాత్మా విగతస్పృహః।
నైష్కర్మ్యసిద్ధిం పరమాం
సన్న్యాసేనాధిగచ్ఛతి ॥ ౪౯

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ
తథాఽప్నోతి నిబోధ మే।
సమాసేనైవ కౌంతేయ!
నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥ ౫౦

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో
ధృత్యాఽత్మానం నియమ్య చ ।
శబ్దాదీన్ విషయాంస్త్యక్త్వా
రాగద్వేషౌ వ్యుదస్య చ ॥ ౫౧

వివిక్తసేవీ లఘ్వాశీ
యతవాక్కాయమానసః ।
ధ్యానయోగపరో నిత్యం
వైరాగ్యం సముపాశ్రితః ॥ ౫౨

*స్వీయధర్మంబె శ్రేయంబు విగుణమయ్యు,
రమ్యముగనల్పు అన్యధర్మమ్ముకంటె:
అర్జునా! [1]స్వభావనియతమైనయట్టి
కర్మమొనరించు మనుజుఁ డఘంబుఁగనడు. 47

ఓయి కౌంతేయ! దోషసంయుక్తమయ్యు
సహజకర్మంబు త్యజియింపఁజనదుచనదు;
అగ్ని పొగచేత ఆవృతంబైన పగిది
అఖిలకర్మంబులగును దోషావృతములు. 48

అఖిలమందు అసంగతస్వాంతుఁడగుచు,
ఆశలుడిగినవాఁడు, జితాత్మకుండు.
కర్మఫలములనెల్ల త్యాగంబొనర్చి
పరమనైష్కర్మ్యసంసిద్ధిఁ బడయఁగలఁడు. 49

అవని సిద్ధిని బొందిన అతఁడెట్లు
బ్రహ్మమును పొందఁగల్గు, [2]తత్పరమమైన
జ్ఞాననిష్ఠను గూర్చియు సంగ్రహముగ
తెలియఁబఱచెద వినుము కుంతీకుమార! 50

విమలమైనట్టి బుద్ధిచే వెలయుచుండి,
ధీరతన్ తన ఆత్మ స్వాధీనపఱచి
సకలశబ్దాదివిషయముల్ చక్కనడఁచి
రాగవిద్వేషముల విసర్జనమొనర్చి: 51

అవని విజనవాసియు, మితాహారియగుచు
వాక్ఛరీరమనంబుల వశమొనర్చి
సంతతము ధ్యానయోగసంసక్తుఁడగుచు
అర్జునా! కడు వైరాగ్య మాశ్రయించి: 52

* విగుణమైన స్వధర్మంబె మిగులమేలు
[1] తన ధర్మమునకు అనుగుణమైన [2] అత్యుశ్రేష్ఠమైన.

అహంకారం బలం దర్పం
కామం క్రోధం పరిగ్రహమ్ ।
విముచ్య నిర్మమశ్శాంతో
బ్రహ్మభూయాయ కల్పతే ॥ ౫౩

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా
న శోచతి న కాంక్షతి ।
సమస్సర్వేషు భూతేషు
మద్భక్తిం లభతే పరామ్ ॥ ౫౪

భక్త్యా మామభిజానాతి
యావాన్యశ్చాస్మి తత్త్వతః ।
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా
విశతే తదనంతరమ్ ॥ ౫౫

సర్వకర్మాణ్యపి సదా
కుర్వాణో మద్వ్యపాశ్రయః ।
మత్ప్రసాదాదవాప్నోతి
శాశ్వతం పదమవ్యయమ్ ॥ ౫౬

చేతసా సర్వకర్మాణి
మయి సన్న్యస్య మత్పరః ।
బుద్ధియోగముపాశ్రిత్య
మచ్చిత్తః సతతం భవ॥ ౫౭

మచ్చిత్తస్సర్వదుర్గాణి
మత్ప్రసాదాత్తరిష్యసి ।
అథచేత్త్వమహంకారాత్
న శ్రోష్యసివినఙ్క్ష్యసి ॥ ౫౮

కామమును, క్రోధమును, అహంకారదర్ప
బల[1]పరిగ్రహంబులనెల్ల పాఱఁదోలి
మమత విడనాడి శాంతుఁడౌ మనుజుఁడెపుడు
బ్రహ్మమగుటకు మిగుల అర్హతవహించు. 53

బ్రహ్మమయుఁడు, ప్రసన్నాత్మరంజితుండు,
కాంక్ష సేయఁడు, శోకమ్ముఁ గాంచఁడెపుడు,
సర్వభూతజాలములందు సమతనూని
పరమమైనట్టి మద్భక్తిఁ బడయుచుండు. 54

ఎట్టివాఁడనో? మఱియు నే నెవఁడనగుదో?
నిశ్చయంబుగ భక్తి నన్ దెలిసికొనును;
ఇవ్విధంబున నిజముగా నెఱిఁగి అతఁడు
నన్ను చేరుకొనును దదనంతరమ్ము. 55

సర్వకర్మంబులను సదా సలుపుచున్న,
శరణు ననుఁబొందువాఁడు, మత్కరుణచేత
అవ్యయంబును శాశ్వతంబైనయట్టి
[2]పరమపదమును బడయును పాండుతనయ! 56

కాన [3]సంకల్పమున సర్వకర్మములను
వదలి నాయందె నీవు, [4]మత్పరుఁడవగుచు,
అర్జునా! బుద్ధియోగంబు నాశ్రయించి
మన్మనస్కుండవై ఉండుమా సతంబు. 57

నీవు చిత్తంబు నా యందె నిలుప దాటఁ
గలవు [5]సకలదుఃఖముల మత్కరుణవలన,
అట్లుగాకహంకృతి వినవైతివేని
నీవు నా పలుకుల నశియింపఁగలవు. 58

1 ద్రవ్యసంగ్రహము 2 మోక్షము 3 వివేకముతో గూడినమనస్సుచే 4 నన్నే ఉత్తమ ప్రాప్యముగ నమ్మినవాఁడవై 5 సర్వసాంసారికకష్టములు.

యదహంకారమాశ్రిత్య
న యోత్స్య ఇతి మన్యసే ।
మిథ్యైష వ్యవసాయస్తే
ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి ॥ ౫౯

స్వభావజేన కౌంతేయ!
నిబద్ధః స్వేనకర్మణా ।
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్
కరిష్యస్యవశోఽపి తత్ ॥ ౬౦

ఈశ్వరస్సర్వభూతానాం
హృద్దేశేఽర్జున! తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని
యంత్రారూఢాని మాయయా ॥ ౬౧

తమేవ శరణం గచ్ఛ
సర్వభావేన భారత! ।
తత్ప్రసాదాత్పరాం శాన్తిం
స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥ ౬౨

ఇతి తే జ్ఞానమాఖ్యాతం
గుహ్యాద్గుహ్యతరం మయా ।
విమృశ్యైతదశేషేణ
యథేచ్ఛసి తథా కురు ॥ ౬౩

సర్వగుహ్యతమం భూయః
శృణు మే పరమం వచః ।
ఇష్టోఽసి మే దృఢమితి
తతో వక్ష్యామి తే హితమ్ ॥ ౬౪

అటులహంకారమునె సమాశ్రయించి
యుద్ధమొనరింపఁగాఁ బూనకుందువేని,
చనును వ్యర్థమై నీ [1]వ్యవసాయమెల్ల
నీ స్వభావంబె నియమించు నిన్ను దాన. 59

అర్జునా! మోహమున దేని నాచరింప,
నిచ్ఛగింపవో, దానినే యిపుడు నీ స్వ
భావజంబగు కర్మచే బద్ధుఁడవయి
సలిపియే తీరెదవు నీకుఁ దెలియకుండ. 60

అఖిలభూతతతుల హృదయంబులందు
అర్జునా! ఈశ్వరుండు తా నధివసించి,
యంత్రమున బొమ్మలను ద్రిప్పునట్టి రీతి
మించి ప్రాణుల మాయ నాడించుచుండు. 61

భరతకులదీప! సర్వభావములచేత
శరణుఁబొందుము [2]అతనినే సంతతంబు·
అతని సత్కృప చేతనే అందఁగలవు
పరమశాంతియు, శాశ్వతపదము నీవు. 62

గుహ్యములలోన అత్యంత గుహ్యమైన
జ్ఞానమిది. నీకు వచియించినాఁడ దీని:
అట్లగుటను విమర్శించి సాంగముగను,
ఎట్లు నీ కిష్టమో చేయుమట్లె నీవు. 63

నాకు కడు ప్రియుండవగుట నీకు హితము
సేయఁగాఁ గోరి నేను వచింపుచుంటి
అఖిలగుహ్యతమము, శ్రేష్ఠమైన, నాదు
వచనముల వినుము మఱల పాండుతనయ! 64

---

1 ప్రయత్నము 2 ఆత్మస్వరూపుఁడగు ఈశ్వరునే.

మన్మనా భవ మద్భక్తో
మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి సత్యం తే
ప్రతిజానే ప్రియోఽసి మే ॥ ౬౫

సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో
మోక్షయిష్యామి మా శుచః ॥ ౬౬

ఇదం తే నాతపస్కాయ
నాభక్తాయ కదాచన ।
న చాశుశ్రూషవే వాచ్యం
న చ మాం యోఽభ్యసూయతి ॥ ౬౭

య ఇదం పరమం గుహ్యం
మద్భక్తేష్వభిధాస్యతి ।
భక్తిం మయి పరాం కృత్వా
మామేవైష్యత్యసంశయః ॥ ౬౮

న చ తస్మాన్మనుష్యేషు
కశ్చిన్మే ప్రియకృత్తమః ।
భవితా న చ మే తస్మాత్
అన్యః ప్రియతరో భువి ॥ ౬౯

అధ్యేష్యతే చ య ఇమం
ధర్మ్యం సంవాదమావయోః ।
జ్ఞానయజ్ఞేన తేనాహం
ఇష్టస్స్యామితి మే మతిః ॥ ౭౦

కూర్చి మనసు నాయందె, భక్తుఁడవుగమ్ము,
నాకె మ్రొక్కుము, పూజలొనర్పు నాకు,
పడయఁగల్గుదు వీవు నన్నె పాండుతనయ!
హితుఁడవగుదువు, నిజమిది ప్రతినఁజేతు. 65

సర్వధర్మమ్ములను వీడి, సవ్యసాచి!
పూర్తిగా నన్నె శరణమ్ముఁ బొందుమీవు.
నిఖిలపాపంబులందుండి నిన్ను నే వి
ముక్తుఁజేసెద, శోకమ్ముఁ బొందవలదు. 66

నేను నీకు బోధించిన దీని, నన్న
సూయఁజూచు వానికిని, శుశ్రూషలేని
వానికిని, తపోభక్తివిహీనునకును
చెప్పగా రాదు ఫల్గునా! యెప్పుడేని. 67

పరమగోప్యంబు నగుచును పరగు దీని
నెవఁడు మద్భక్తులకునెల్ల నెఱుఁగఁజేయు,
అతఁడు నాయందు పరభక్తి నాచరించి
సందియమ్ము లేదిఁక, నన్నె పొందఁగలఁడు. 68

నాకు వానికంటె, ప్రియమొనర్చు వాఁడు
మఱియొకం డెవ్వఁడును లేఁడు మనుజులందు;
వానికంటెను ప్రియతమమైనవాఁడు
వేఱొకండు కలుగఁబోఁడు. పృథ్విలోన. 69

పార్థ! యీ మన ధర్మ్యసంవాదమెవఁడు
శ్రద్ధ నధ్యయనంబును సలుపుచుండు,
సతము నతనిచే జ్ఞానయజ్ఞమున నేను
పూజింపఁబడితి నటంచును దలఁచు వాఁడ. 70

శ్రద్ధావాననసూయశ్చ
శృణుయాదపి యో నరః ।
సోఽపి ముక్తశ్శుభాన్ లోకాన్
ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్ ॥ ౭౧

కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ!
త్వయైకాగ్రేణ చేతసా ।
కచ్చిదజ్ఞానసమ్మోహః
ప్రణష్టస్తే ధనంజయ! ॥ ౭౨

అర్జున ఉవాచ:-

నష్టో మోహః స్మృతిర్లబ్ధా
త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత! ।
స్థితోఽస్మి గతసందేహః
కరిష్యే వచనం తవ ॥ ౭౩

సంజయ ఉవాచ:-

ఇత్యహం వాసుదేవస్య
పార్థస్య చ మహాత్మనః ।
సంవాదమిమమశ్రౌషం
అద్భుతం రోమహర్షణమ్ ॥ ౭౪

వ్యాసప్రసాదాచ్ఛ్రుతవాన్
ఏతద్గుహ్యతమం పరమ్ ।
యోగం యోగేశ్వరాత్కృష్ణాత్
సాక్షాత్కథయతస్స్వయమ్ ॥ ౭౫

శ్రద్ధ గల్గి అసూయ లేశమ్ము లేక
వీనులారంగ ఎవ్వాఁడు దీని వినునొ.
ముక్తుఁడై వాఁడు పుణ్యకర్మలు సతమ్ము,
పొందు శుభలోకములనెల్ల పొందఁగలఁడు. 71

నిశ్చలంబగు మనసులో నీవు పార్థ!
వింటివే దీనినెల్ల సవిస్తరముగ
ఏమిఁ నీ అజ్ఞతామోహ మింకనైన
ఓ ధనంజయ! నశియింపదాకొ? చెపుము! 72

అర్జునుఁడిట్లనియె:-

నాకుఁ గల్గిన మోహమంతయు నశించె,
నీ ప్రసాదమ్ము వలన పొందితిని స్మృతిని,
సందియములెల్ల అచ్యుతా! నమసె, ఇంక
నలుపు వాఁడ నీ వచనానుసారముగను. 73

సంజయుఁడిట్లనియె:-

ఆ మహాత్ములకిట్లు కృష్ణార్జునులకు
అతి రహస్యముగ జరిగినట్టిదైన
అద్భుతము, రోమహర్షణమై చెలంగు
ఈ అపూర్వసంవాదంబదెల్ల వింటి. 74

అతిరహస్యమ్ము శ్రేష్ఠమ్మునైనయట్టి
ఇట్టి యోగంబునెల్ల యోగేశ్వరుండు
కృష్ణుఁడే స్వయముగ వచియింప, నేను
వ్యాసు కరుణను వింటి ప్రత్యక్షముగను. 75

రాజన్! సంస్మృత్య సంస్మృత్య
సంవాదమిమమద్భుతమ్ ।
కేశవార్జునయోః పుణ్యం
హృష్యామి చ ముహుర్ముహుః । ౭౬

తచ్చ సంస్మృత్య సంస్మృత్య
రూపమత్యద్భుతం హరేః ।
విస్మయో మే మహాన్ రాజన్!
హృష్యామి చ పునః పునః ॥ ౭౭

యత్ర యోగేశ్వరః కృష్ణో
యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీర్విజయో భూతిః
ధ్రువానీతిర్మతిర్మమ ॥ ౭౮

హరిః ఓమ్ తత్ సత్

ఇతి శ్రీమన్మహాభారతే శతసాహస్రికాయాం సంహితాయాం
వైయాసిక్యాం శ్రీమద్భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా
సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే మోక్షసన్న్యాసయోగో నామ
అష్టాదశోఽధ్యాయః

శ్రీకృష్ణార్పణమస్తు

ఓం శాంతిః శాంతిః శాంతిః

అద్భుతమ్మును పుణ్యమై అలరునట్టి
అచ్యుతార్జున సంవాదమైన దీని
తలచితలచియు ధృతరాష్ట్రధరణిపాల!
మాటిమాటికి సంతసంపడుచునుంటి. 76

విస్మయావహమగు హరి విశ్వరూప
దర్శనంబును మదిలోనఁ దలఁచు కొలఁది
అతితరాశ్చర్యమగుచుండె అవనిపాల!
మఱియు సంతసించుచునుంటి మఱల మఱల. 77

ఎచట యోగేశ్వరుండగు కృష్ణుఁడుండు
ఎట ధనుర్ధరుఁడగు పార్థుఁడెసఁగుచుండు
అచట సిరియును, భూతి, జయమ్ము, నీతి
నిలుచు స్థిరముగ నందును నేఁ దలంతు. 78

హరిః ఓం తత్ సత్

ఇది శ్రీ వేదవ్యాసమహర్షి ప్రణీతంబయినదియు నూఱువేల శ్లోకములు
గలదియు ఛందోబద్ధంబయినదియు నగు శ్రీ మహాభారతసంహిత
యందు భీష్మపర్వమునగల ఉపనిషత్ప్రతిపాదకంబును,
బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రంబును, శ్రీ కృష్ణార్జున
సంవాదంబును నగు శ్రీమద్భగవద్గీతలందు మోక్షస
న్న్యాసయోగమను పదునెనిమిదవ అధ్యాయము
సర్వము సంపూర్ణము.

శ్రీకృష్ణార్పణమస్తు.

ఓం శాంతిః శాంతిః శాంతిః



-: శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః :-

# శ్రీ మద్భగవద్గీతా మాహాత్మ్యమ్

ధరోవాచ:-

భగవన్పరమేశాన!
భక్తిరవ్యభిచారిణీ ।
ప్రారబ్ధం భుజ్యమానస్య
కథం భవతి హే ప్రభో? ॥ ౧

వ:-

ప్రారబ్ధం భుజ్యమానోఽపి
గీతాభ్యాసరతస్సదా ।
సముక్తస్సుఖీ లోకే
కర్మణా నోపలిప్యతే ॥ ౨

మహాపాపాదిపాపాని
గీతాధ్యానం కరోతి చేత్ ।
క్వచిత్ స్పర్శం న కుర్వంతి
నళినీదళమంబువత్ ॥ ౩

గీతాయాః పుస్తకం యత్ర
యత్ర పాఠః ప్రవర్తతే ।
తత్ర సర్వాణి తీర్థాని
ప్రయాగాదీని తత్ర వై ॥ ౪

సర్వే దేవాశ్చ ఋషయో
యోగినః పన్నగాశ్చ యే ।
గోపాలాగోపికావాఽపి
నారదోద్ధవపార్షదైః ।
సహాయో జాయతే శీఘ్రం
యత్ర గీతా ప్రవర్తతే ॥ ౫

ఓమ్

-: శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః :-

# శ్రీమద్భగవద్గీతామాహాత్మ్యము

భూదేవి యిట్లనియె:-

అనఘ! ప్రారబ్ధకర్మంబు అనుభవించు
వారికే రీతి నీయందు వారిజాక్ష!
చలన మెఱుఁగని సద్భక్తి కలుగఁగలదు
తెలియఁజెప్పుమ, పరమేశ! దేవదేవ! 1

శ్రీ మహావిష్ణు విట్లనియె:-

ప్రాక్కృతమనుభవించెడు వాఁడునైన
సతతగీతాభ్యాసనసమాసక్తుఁడైన
అతఁడు ముక్తుఁడౌ, జగతి సౌఖ్యంబుఁగాంచు
కర్మములచేత ఎన్నఁడు కట్టువడడు. 2

బ్రహ్మహత్యాది సకలపాపములుఁగూడ
మించు భక్తి గీతలను ధ్యానించునతని,
ఎన్నఁడేనియు సంస్పృశియింప వబల!
అబ్జపత్రంబుపై నీర మంటనటుల. 3

ఎచట భవ్యగీతాగ్రంథమెసఁగుచుండు,
ఎచట అది భక్తితో పఠియింపఁబడునో,
అచట ఆ ప్రయాగాది దివ్యంబులైన
అఖిల తీర్థరాజంబులు అధివసించు. 4

సర్వదేవతలు, ఋషులు, సకలయోగి
వరులు, గోపాలగోపికాపన్నగులును,
ద్వారపాలకు, లుద్ధవనారదులును
సాయపడుచుంద్రు వేవేగ సంతతంబు
ఎచట గీతలు తనరారు అచట పృథ్వి! 5

యత్ర గీతావిచారశ్చ
పఠనం పాఠనం శ్రుతమ్ ।
తత్రాహం నిశ్చితం పృథ్వి!
నివసామి సదైవ హి ॥ ౬

గీతాశ్రయోఽహం తిష్ఠామి
గీతా మే చోత్తమం గృహమ్ ।
గీతాజ్ఞానముపాశ్రిత్య
త్రీన్లోకాన్పాలయామ్యహమ్ ॥ ౭

గీతా మే పరమా విద్యా
బ్రహ్మరూపా న సంశయః ।
అర్ధమాత్రాక్షరా నిత్యా
స్వనిర్వాచ్యపదాత్మికా ॥ ౮

చిదానందేన కృష్ణేన
ప్రోక్తా స్వముఖతోఽర్జునమ్ ।
వేదత్రయీ పరానందా
తత్త్వార్థజ్ఞాన మంజసా ॥ ౯

యోఽష్టాదశజపేన్నిత్యం
నరో నిశ్చలమానసః ।
జ్ఞానసిద్ధిం స లభతే
తతో యాతి పరం పదమ్ ॥ ౧౦

పాఠేఽసమర్థస్సంపూర్ణే
తదర్ధం పాఠమాచరేత్ ।
తదా గోదానజం పుణ్యం
లభతే నాఽత్ర సంశయః ॥ ౧౧

ఎచట గీతావిమర్శనంబెనయు, ఎచట
పఠనపాఠనశ్రవణముల్ జఱుగుచుండు
అట్టిచోట ఓ భూదేవి! అనవరతము
నేను నివసించుచుందును నిశ్చయముగ. 6

ఏనెపుడు గీతలనె ఆశ్రయించియుందు
ధరణి గీతలె నాకు ఉత్తమగృహంబు
గీత ప్రవచించు జ్ఞానమ్ముచేతఁగాదె
ఎల్ల జగముల నేల నే నేలుచుంట. 7

అర్ధమాత్రాక్షరమును, నిత్యమ్మునగుచు
అవనిలో అనిర్వాచ్యపదాతికమ్ము
నైన గీతలె పరమవిద్యయగు నాకు
అదియె, బ్రహ్మరూపము, సంశయమ్ము లేదు. 8

నందనందనుఁడౌ చిదానందమూర్తి
కృష్ణుఁడర్జునునకు వచియించినట్టి
దిదియె, వేదత్రయాత్మకంబిదియె, ఇదియె
జ్ఞానతత్త్వప్రదము, పరానందమయము. 9

అనుదినము పదునెన్మిదధ్యాయములను
ఎవఁడు నిశ్చలమతి జపియించుచుండు
జ్ఞానసంసిద్ధిఁబడయంగఁజాలు అతఁడు
పిదప జన్మరాహిత్యమౌ పదముఁగాంచు. 10

దీని తుదముట్ట జపియింప లేని వాఁడు
తుదకు ఇందు సగంబేని చదువఁవగును,
అటులయినను గోదానపుణ్యము లభించు
సందియంబింత లేదు లేశమ్ముగూడ. 11

త్రిభాగం పఠమానస్తు
గంగాస్నానఫలం లభేత్ ।
షడంశం జపమానస్తు
సోమయాగఫలం లభేత్ ॥ ౧౨

ఏకాధ్యాయం తు యో నిత్యం
పఠతే భక్తిసంయుతః ।
రుద్రలోకమవాప్నోతి
గణో భూత్వా వసేచ్చిరమ్ ॥ ౧౩

అధ్యాయం శ్లోకపాదం వా
నిత్యం యః పఠతే నరః ।
స యాతి నరతాం యావ-
న్మనుకాలం వసుంధరే ॥ ౧౪

గీతాయాఃశ్లోకదశకం
సప్తపంచచతుష్టయమ్ ।
ద్వౌత్రీనేకం తదర్ధం వా
శ్లోకానాం యః పఠేన్నరః ॥ ౧౫

చంద్రలోకమవాప్నోతి,
వర్షాణామయుతం ధ్రువమ్ ।
గీతాపాఠసమాయుక్తో
మృతోఽమానుషతాం వ్రజేత్ ॥ ౧౬

గీతాభ్యాసం పునః కృత్వా
లభతే ముక్తిముత్తమామ్ ।
గీతేత్యుచ్చారసంయుక్తో
మ్రియమాణో గతిం లభేత్ ॥ ౧౭

ఇందు మూఁడవవంతు పఠించువాఁడు
పడయఁగల్గు గంగాస్నానఫలము దేవి!
ఇందు ఆఱవవంతు జపించు నెవ్వఁ
డతఁడుఁ బడయఁగల్గును సోమయాగఫలము. 12

అనుదినము భక్తి నొక్కయధ్యాయమేని
పఠనమొనరించుచుండెడు వాఁడుఁగూడ
కమలలోచన! రుద్రలోకంబుఁజేరి
చిరము ప్రమథులతోడ వసించుచుండు. 13

అనుదినము ఒక్క అధ్యాయమందు, శ్లోక
పాదమేని, పఠము చదువఁగలఁడో!
అతఁడు ఒక్కమన్వంతరం బవనియందు
మనుజ జన్మంబునెత్తుచు మసలుచుండు. 14

ఇందు పది శ్లోకములుగాని, ఏడుఁగాని,
అయిదుగాని. శ్లోకచతుష్టయమ్ముఁగాని,
కాక, మూఁడో, రెండో, ఒక్కండో కడకు
సగము శ్లోకంబునేనియుఁ జదువువాఁడు; 15

వాస్తవమ్ముగ పదివేల వత్సరములు
చంద్రలోకమ్ముఁజేరి వాసమ్ము సేయు,
గీతల, పఠించు తఱి మృత్యువాఁతఁబడిన
యతఁడు నిజముగ దేవత్వమందఁగలఁడు. 16

మఱల మఱల గీతాభ్యాసమానసుఁడగు
వాఁడు సత్తమ మోక్షంబుఁబడయఁగలఁడు;
మరణసమయాన గీతల మదిఁదలంచు
వాఁడుఁ బడయఁగాఁగల్గును పరమగతిని. 17

గీతార్థశ్రవణాసక్తో
మహాపాపయుతోఽపి వా ।
వైకుంఠం సమవాప్నోతి
విష్ణునా సహ మోదతే ॥ ౧౮

గీతార్థం ధ్యాయతే నిత్యం
కృత్వా కర్మాణి భూరిశః ।
జీవన్ముక్తస్స విజ్ఞేయో
దేహాంతే పరమం పదమ్ ॥ ౧౯

గీతామాశ్రిత్య బహవో
భూభుజో జనకాదయః ।
నిర్ధూతకల్మషా లోకే
గీతాయాతాః పరంపదమ్ ॥ ౨౦

గీతాయాః పఠనం కృత్వా
మాహాత్మ్యం నైవ యః పఠేత్ ।
వృథాపాఠో భవేత్తస్య
శ్రమ ఏవ హ్యుదాహృతః ॥ ౨౧

ఏతన్మాహాత్మ్యసంయుక్తం
గీతాభ్యాసం కరోతి యః ।
స తత్ఫలమవాప్నోతి
దుర్లభాం గతిమాప్నుయాత్ ॥ ౨౨

సూత ఉవాచ:-

మాహాత్మ్యమేతద్గీతాయా
మయా ప్రోక్తం సనాతనమ్ ।
గీతాంతే చ పఠేద్యస్తు
యదుక్తం తత్ఫలం లభేత్ ॥ ౨౩

ఇతి శ్రీవరాహపురాణే శ్రీ గీతామాహాత్మ్యం సంపూర్ణమ్.

ఓమ్ తత్ సత్!

సతము గీతార్థము విన నాసక్తిఁజెందు
వాఁడు, జగతి నెంతయు మహాపాపియైన
గూడ, ఆతఁడు వడసి వైకుంఠ పదము
విష్ణు సన్నిధి ముదమున వెలయఁగలఁడు. 18

ఎపుడు గీతార్థమును మదినెంచుకొంచు
నిత్యకర్మంబులను సల్పు నీతిపరుఁడు
అవనియందు జీవన్ముక్తుఁడనఁజెలంగి
పడయు దేహాంతమందు తా పరమపదము. 19

మున్ను జనకాది పెక్కండ్రు భూమిపతులు
ఈ పవిత్ర గీతల నాశ్రయించికాదె
అఖిల నిర్ధూతకల్మషులంచు పేరు
వడసి జగతిలోఁ జెందిరి పరమపదము. 20

ఎవఁడు గీతలఁ తా పఠియించుచుండి
వాని మాహాత్మ్యమును చదువంగఁబోఁడొ?
అతని పారాయణంబెల్ల వ్యర్థమగును
శ్రమమె వానికి మిగులును సరసిజాక్షి! 21

జగతి గీతల మాహాత్మ్యసహితముగను,
పఠనముంజేయుచుండు ఎవ్వఁడు సతమ్ము,
అతఁడు తత్ఫలమునుబొందు, అంతెగాక
అమితదుర్లభంబగు గతి నందఁగలఁడు. 22

సూతుఁడిట్లనియె:-

నెమ్మి నిట్టి గీతామహత్వమ్ము నేను
చెప్పినాఁడను, మిగుల ప్రాచీనమిద్ది,
చదివి గీతల, పిమ్మట చదువ దీని,
చెప్పిన ఫలంబుఁ గొంతురు తప్పకెపుడు. 23

ఇది శ్రీవరాహపురాణమందలి శ్రీగీతామాహాత్మ్యము సర్వము సమాప్తము.

'ఓం తత్ సత్'

ఇది శ్రీకృష్ణకృపానులబ్ధకవితాహేవాకసౌరభ్యస
మ్ముదితప్రాజ్ఞుఁడగస్త్యరెడ్డికులసంభూతుండు, విద్వద్దయా
స్పదభావుండగు వెంకురెడ్డి కృతమై, సర్వైహికాముష్మిక
ప్రదమై, శోభిలుఁగాక! శాశ్వతముగా; బ్రహ్మజ్ఞులగ్గింపగాన్.

---

సింహపురమండలస్థమ్ము-సిరికిపట్టుఁ
గొమ్మ ఈదూరు జన్మస్థలమ్ము, కీర్తి
కిమ్ము వరకవిపూడి వాసమ్ము, ప్రస్తు
తమ్ము నెల్లూరిలో కాపురమ్మునాకు.

వరదగురుశాయిబాబా
సురుచిరమందిరసమీపసుబ్రహ్మణ్యే
శ్వరదేవాయతనాంతిక
పరిసరగాంధినగరమ్ము వాసమునాకున్.

రమ్యగుణవిభూష రాజమ్మ జనయిత్రి
కాశిరెడ్డి నన్నుఁగన్నతండ్రి:
అమృతహృదయులైన ఆ పుణ్యుల కుమారు
లందు, నే కనిష్ఠనందనుండ.

